

"మహామంత్రి తిమ్మరసు"లో ఎన్. టి. రామారావు. దేవిక

సెప్టెంబరు

**19**

ప్రారంభం



పద్మశ్రీ వారి

# సిరిసంపదలు

నిర్మాత
వి. వెంకటేశ్వర్లు.B.A + దర్శకుడు
పి. పుల్లయ్య.B.A

ఆంధ్ర..సీడెడ్... విజయ రిలీజ్ ................ నైజాం..మైసూర్...ఈస్టిండియా రిలీజ్

TARAKA

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది.



# ఉత్తరాలు

## విమర్శ

కొంతకాలంగా మన పత్రికలో ప్రచురింపబడుతూన్న "ఉత్తరాలు' శీర్షికనుచూస్తున్నాను. కాని ఈ శీర్షికలో ప్రచురింపబడుతున్న కొన్ని "విమర్శల"ను చూస్తుంటే చాలావిచారం కలుగుతోంది. విమర్శలు చాలా చిన్నవిషయాలమీద జరుగుతున్నయ్. ఈ విమర్శలమీద మళ్ళీ విమర్శలు "పే"కి బదులుగా "మే" పడింది. ఇది ప్రచురించిన మీ పొరపాటా? లేక రచయితగారి పొరపాటా?" అని అడిగేకంటే మనమే సరిపెట్టుకో వచ్చునని వాలభిప్రాయం. తరువాత, "తిరుపతిలో అద్దాలు బిగించిన 'కూల్‌డ్రింక్‌షాప్' లేదని రచయితగారికి తెలియదా?" అని ఒకరు విమర్శించారు. దానిపై మళ్ళీ ఇంకొకరు "నిన్ననే చూశాను దిగువతిరుపతిలో అద్దాలు బిగించిన కూల్‌డ్రింక్ షాప్" అని వ్రాశారు. ఇలాంటివిషయాల్లో తొందరపడి పూర్తిగా తెలుసుకోకుండా "రచయితగారికి తెలియదా? ఎడిటర్‌గారి అసమర్థతా?" అని అడగటం వారిని నొప్పించటం అవుతుందని నా ఉద్దేశ్యం.

తరువాత—కార్టూన్లపై విమర్శలు. "పోస్ట్ బాక్సుమీద 'డేట్' ఏవిటి?", "ఆ కండక్టరు 'డస్సు' ఏ ప్రాంతానికి చెందినదో! తెలుపుతారా?" వగైరా విమర్శలు అతితేలికైనవి. కార్టూన్‌లో తప్పులుపట్టడం బాగుండదని నా ఉద్దేశ్యం. అలా అయితే, 13—7—62 పత్రికలో మందర్‌గారు వేసిన 'ఇదీ వరస'లో 'మిషన్'కి 'స్టిచింగ్‌సైడ్' కుడిప్రక్క వేశారు. అది తప్పని ఒక టైలర్‌ని అడిగితే చెప్పాడు. శ్రీ ఊమెన్‌గారు వేసిన డా. రాధాకృష్ణన్ 'కార్టూన్'ని పట్టుకుని ఒకరు 'మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారిదని వ్యాఖ్యానించారు. "ఈ కార్టూన్ అటువంటివారికి చెప్పుదెబ్బలాంటిది" అని బాధాకరమైన పదాలతో విమర్శించి విమర్శించుకోబడటంకన్న 'అటువంటివారి'ని (ఉంటే చూచి జారిపడితే విజ్ఞత అనిపించుకుంటుందను కుంటాను.

ఇంతకీ నేను మనవిచేసేదేమంటే చిన్నచిన్న పొరపాట్లను (ఉంటే) విమర్శించేకన్నా మనమే సరిపెట్టుకోవడం బాగుంటుందనీ, ఇలా చెయ్యడంతో ఇంకోవిషయంమీద వచ్చే విమర్శలు ప్రచురింపబడటానికి స్థలాన్నీ, అవకాశాన్నీ కల్పించినవారమవుతామని సహపాఠకులు నా మనవి విని సహృదయంతో అర్థంచేసుకుంటారని ఆశిస్తాను.

సిక్కలపు క్రిష్ణారావు (ఏలూరు)

## ముఖచిత్రం

ఈ వారం (7–9–62) ముఖచిత్రము చూడగానే ప్రేమ్ (పటము) కట్టించాను. ఈ ముఖచిత్రం చూడ ముచ్చటగా నున్నది.

గానిగబాబు (గుంతకల్లు)

* * *

ఈ వారం వారపత్రిక ముఖచిత్రంలో శాన్నాళ్లకు ఓ క్రొత్త ముఖాన్ని చూడగలిగాం. అలాగే—హిందీ సినిమా రంగంలో ప్రసిద్ధికెక్కిన నటీమణులనే కాకుండా, మా అభిమాన నటత్రయం 'దేవ్, రాజ్, దిలీప్'ల చిత్రాలను కూడా మన వారపత్రిక ముఖచిత్రం పై ప్రచురిస్తే చాలా ఆనందంగా, ఉంటుంది.

'బృందం—ఆనందేవ్' రాజమండ్రి

## ప్రపంచ ప్రముఖులు

'ప్రపంచ ప్రముఖులు' శీర్షికలో కేవలం రాజకీయవేత్తల గురించే వేస్తున్నారు. సాహిత్యం, క్రీడ, వాణిజ్యం, సినిమా మొదలయిన ఇతర రంగాలలోని వాళ్ళను గురించికూడా రాయమని ప్రార్థన. వినాయకచవితి సంచికలో మలయాసియా సమాఖ్య గురించి రాసినదాంట్లో ఆఖరి వాక్యం ప్రపంచమంతటా చీలికలు ఏర్పడుతున్న ఈ సమయంలో శ్రీ తుంకూ అబ్దుల్‌రెహమాన్ క్రింద జరుగుతున్న ఈ ఏకీకరణ హర్షించతగ్గది చాలా సమంజసంగాఉంది. ఈ శీర్షిక నిర్వహిస్తున్నది ఎవరు?

ఎస్. రామకృష్ణారావు (కాకినాడ)

మేమే!

## కథలు

బి. విద్యాసాగర్‌గారు రాసిన "చాకలివాడు" కథ మన ఇండ్లలో తరచూ జర్గేదానిలా రాశారు. ఆఖరికి పాఠకులకి రెండుప్రశ్నలు వదిలివేసి, ఏమిటి చెయ్యడం? అన్నారు. మన పూర్వులు చాకలి—కొత్త. మంగలి—పాత ఉండాలనేవారు. నారాయణిని మాన్పించి కోటయ్యకి బట్టలు వేశారన్న అసూయకొద్దీ పోటీలు కోటయ్యమీద చెప్పి ఉండవచ్చు. సాధారణంగా లాండ్రీవాళ్ళు ఆలస్యంచెయ్యరు. అయినా ప్రతిచాకలివాడు కొత్తగా బట్టవేస్తే నమ్మకం కోసం రెండుమూడురేవులు చాలా వేగరం తెస్తారు. అందుచేత కోటయ్యని నమ్మి బట్టలుతెచ్చి, వెయ్యకుండా ఉండడమే మంచిదని నా సలహా.

రేవతి శంకర్ (విజయనగరం)

* * *

ఈ వారం పత్రికలో, "ఉత్తరాయణం"కథలో "సంబంధంబు సొంతపదీనంబు" అని హరవిలాసంలో చదివినట్టు పేర్కొన్నారు, రచయిత. కాని, ఆ.ముక్కామాల్యదలోని 'మాలదాసరి' కథలో పై వాక్యం చదివినట్టు నా నమ్మకం. అయితే, హరవిలాసంలోకూడా ఉందేమో, నాకు తెలియదు.

కుమారి ఏ. పద్మావతి (చెన్నూరు)

## కార్టూన్

31—8—62 తేదీ వారపత్రిక 6వ పేజీ ఊమెన్ కార్టూన్‌లో 'పాక్ అధ్యక్షుడు అమెరికా వెడుతున్నారు. భారతదేశం పాకిస్తాన్‌కు చేస్తున్న అన్యాయాన్ని అక్కడ చాటిచెబుతారు, అని మీరు ప్రచురించి ఉన్నారు. పాకిస్తాన్‌కు భారతదేశం అన్యాయంచేస్తున్నదని మీ అభిప్రాయమా? అలా ప్రచురించడం భారత దేశవిధానాలకు విరుద్ధమని నా ఉద్దేశం. మీరేమంటారు?

వి. ఎస్. స్వామి (మద్రాసు)

? !

## కింగ్ ఆఫ్ కింగ్స్

కింగ్ ఆఫ్ కింగ్స్ అనే (బిబ్లికల్) సినిమా కథ చాల బాగా నడుస్తుంది. కాని ఇంతవరకూ భాషాంతరీకరణంలో కొన్ని తప్పులు కనిపిస్తూవచ్చాయి. ఈ వారం (31—8—62) "ఐనా ఈ పీటర్ తెల్లవారి కోడి మూడుమార్లు కూసేలోగా న న్నెరుగనని అబద్ధమాడ్తాడు" అని వ్రాశారు—అసలు బైబిలులో జీసస్ పీటర్‌తో "నీవు నన్నెరుగనని ముమ్మారుచెప్పువరకు కోడికూయదని నీతో చెప్పుచున్నాననెను" అని (లూకా 22: 24) లో వ్రాయబడింది. అంటే పీటర్ ముమ్మారు అబద్ధమాడిన తర్వాత కోడికూస్తుంది కాని కోడి ముమ్మారు కూసేలోగా పీటర్ అబద్ధం ఆడటంకాదు. గాన ఇలాంటి భాషాంతరీకరణ దోషాలను ముమ్ముందు సవరించి ప్రచురించవలసిందిగా కోర్తాను.

సి. డి. హన్సుబాబ్ (ధవళేశ్వరం)

మా కథకు ఎం.జి.ఎం.స్క్రిప్ట్ ప్లేను అనుసరిస్తున్నాము.

## సరాగమాల

31—8—62 సంచికలోని 'సరాగమాల'లో 'కాలా—బాజార్' హిందీచిత్రంలో పాటగూర్చి చెబుతూ కెమెరామన్ "వి. కె. మూర్తి" ......అని వ్రాశారు. ఆ చిత్రమునకు కెమెరామన్ "వి. రాత్ర" కాని 'వి. కె. మూర్తి' కాదు. తప్పునుగ్రహిస్తారని ఆశిస్తా. 'వి. కె. మూర్తి', గురుదత్ చిత్రాలకు మాత్రమే ఛాయాగ్రాహకుడుగా పనిచేశాడు కాని. 'దేవానంద్' చిత్రాలకుకాదు.

కురిమిళ్ళ. ఉపేంద్ర (హనుమకొండ)

* * *

'లాల్‌ఖిలా' హిందీ చిత్రంలో మహ్మద్‌రఫీ పాడిన పాట ఒకటి "లగ్‌తా నహీహై దిల్ మెరా ఉజ్‌డే దయార్‌మే" ఇదే పాట ఒకసారి రేడియో సిలోన్‌లో వినటం తటస్థించింది. అది యించుమించు ట్యూన్ ఒకటేఅయిన మహ్మద్ రఫీగారి కంఠంకంటే మధురంగాఉంది.

బహుశః అది ప్రవేట్‌సాంగ్ అయిఉంటుంది. అది పాడినవా రెవరో, ఏ రాగంలో పాడబడినది, రికార్డునెంబరు మొదలగు వివరాలు పత్రికద్వారా తెలియపరిస్తే, పదివి సంతోషిస్తా.

ఎం. రామస్వామి (నిజామాబాద్)

★

# ఎస్ కార్ట్స్ పద్ధతిలో మీరు దినం ప్రారంభించారా?

CPH/HI/246











ఎస్ కార్ట్స్
బ్లేడులు
నిర్దుష్టమైన క్షౌరములకు

అన్ని పెద్దస్టోర్సులో
దొరకును



ఓం : తత్ : సత్ :



## సుఖ జీవిత సేవ

"సిద్ధ ఔషధ మహిమ"

సిద్ధుల సాటిలేని మహిమకు ఒక తార్కాణము

## కె. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

# "మేల్ మాయిల్ మందు"

(Regd.)

**దీర్ఘకాల చర్మరోగములకు చక్కని నివారిణి**

నల్లరంగు, ఎఱ్ఱరంగు పొడలు, దద్దులు, పొట్లు, గజ్జి, (చర్మ సంబంధము) పొడలు గల చోట్లలో తిమ్మిర్లు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పుపడి బొబ్బలు గలిగిన తెలియకుండుట, దుర్ నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మరు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదమునందు పల్లపు పుండ్లు ఏర్పడుట, కాలు చేతులు (వేళ్ళు) తగ్గుట, ముక్కు పొట్ట పడుట, చూచుటకు విసుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి చక్కని నివారిణి.

**1 మండలం నూనె, లేహ్యము 8 oz శ్రీ పరమాత్మస్నాన తైలం తపాల ఖర్చులతో రు. 12**

పూర్తి వివరములకు వ్రాయండి :

సిద్ధ డాక్టర్ K. T. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్స్,
*5/22*, మేల్ మాయిల్ P.O. (N. A. Dt.)

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 14—9—62
సంపుటము : 55 సంచిక : 2
శుభకృత్ సం॥ భాద్రపదమా॥ శు॥ పూర్ణిమ

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

విడిప్రతి : 25 న. పై

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1





సినీనటి వాసంతి.

# మనలో మాట

ఈ సంచికలో రు. 1000/- బహుమతి నవల "బంగారు పంజరం" ప్రారంభిస్తున్నాము. పోటీకివచ్చిన నవలల స్థాయి అంత సంతృప్తికరంగా లేదనిపించినా రచనలలో 'వివిధ దృక్పథాలు' ప్రతిబింబించాయని చెప్పవచ్చు. పోటీలో పాల్గొన్న వారందరికీ మా అభినందనలు!

శ్రీమతి కోమలాదేవిగారు ప్రస్తుతం బారెల్లీ (ఉత్తర ప్రదేశ్)లో ఉంటున్నారు.

* * *

చిత్రవ్యక్తులు రచయిత సుకుమార్‌గారు ఈ వారం ఆ శీర్షిక వ్రాయలేదు. 'చిత్రవ్యక్తి' శ్రీమతి వాసంతి తామే వ్యాసం వ్రాసి ఇచ్చారు. ఈ విషయం మేము ప్రత్యేకంగా చెప్పనక్కరలేదని చదివిన వారందరికీ తెలుస్తుంది!

* * *

సుకుమార్‌గారు కొన్ని అనివార్య కారణాలవల్ల 'చిత్రమోదం' చేయలేక. వచ్చేవారం ప్రకటించగలమని అనుకుంటున్నాము.

* *

'డాక్టర్ రాజు' వేసిన శ్రీమతి దేవిక ఈ వారంనుంచి 'కుమారి కథ' అనే మరొక బొమ్మల కథ వేస్తారు.

# లోకంపోకడ



"చిత్కార్ వైనం ఏమిటి షి?" అని అడుగుదామంటేనే ఆయన అలా పరుగులూ, ఉరుకులూ పెడుతున్నాడేమంటూ?"

## విషయానుక్రమణిక


**కథలు**

| | | |
|---|---|---|
| పాపం పసివాడు | — | 16 |
| గ్రుడ్డివాడు | — | 24 |

**సీరియల్ కథలు**

| | | |
|---|---|---|
| కుమారి కథ (బొమ్మల కథ) (ప్రారంభం) | — | 14 |
| హరివంశము | — | 15 |
| విశాలనేత్రాలు | — | 22 |
| బంగారు పంజరం (కొత్త సీరియల్) | — | 32 |

**సినిమా కథ**

| | | |
|---|---|---|
| కింగ్ ఆఫ్ కింగ్స్ | — | 21 |

**ప్రత్యేక వ్యాసం**

| | | |
|---|---|---|
| మనమెరుగని జీవితం (మారిలిన్ మన్రో) | — | 8 |

**శీర్షికలు, వ్యాసాలు**

ఉత్తరాలు—3, ఉమెన్ కార్నర్—6, వివిధ ప్రాంతాల వింత ప్రదేశాలు—7, సినిమా వ్యాసం—9, ప్రపంచ ప్రముఖులు—10, చిత్రవ్యక్తులు—11, పదునుప్రాపు—12, కథకాని కథ—13, వనితా వాణి—18, దాంపత్య జీవితం—19, హమేషా—తమాషా — 26, వారఫలాలు — 28, పరాగ మాల — 31, యువ ప్రపంచం — 60, కొత్త మడికట్లు 63, పొట్టికథలు—64.


అణ్వస్త్ర కిరాత
కులమథన భారత
శాంతిదూత
అణ్వస్త్రాల
పిచ్చి అరి
కట్టండి


నెహ్రూకు
సమాధాన
మేమని
చెప్పటం?


ఇంగ్లీషు
పీడవదిలించు
కునేందుకు
లోహియా


పదవులు విడిచి కాంగ్రెసుకు
సేవచేయండి
ఎలా
వినిపిస్తుంది?

# అద్భుతనగరం అంకారా



అంకారా మ్యూజియంబయట ఒక శిల్పం.

అంకారా అధునాతనమైన వింతలలో ఒకటి అంటారు. అందమైనదీ, అద్భుతమైనదీ, అతి ప్రాచీనమైనదీ అయిన ఈ చిన్న పట్టణాన్ని కొత్తగా టర్కీ రిపబ్లిక్ అవతరించినప్పుడు కెమాల్ అటాటుర్క్ దానిని రాజధానిగా ఎన్నుకున్నాడు. దాంతో దీని ప్రాచీనత ప్రాభవంగా మారింది. వెనుకటి రోజుల్లో దీని ప్రజలు, ఫలవంతంగాని గుట్టలమీద నివసిస్తూ జూలుగొర్రెలనూ, చెవుల పిల్లులనూ పెంచుకుంటూ వాటి ఉన్నితో పొట్టపోసుకుంటూ గడిపేవారు ఈ ఉన్నినే మనం అంగోలా ఉన్ని అంటాము.

1923 వ సంవత్సరంలో అంకారాకు టర్కీ రాజధాని అయ్యే అదృష్టంపట్టింది. దాంతో అది చాలా ఆధునికమైన నగరమైపోయింది.

అటుతర్వాత అంకారా టర్కీలోని ముఖ్యకేంద్ర నగరంగా నిత్యనూత్నంగా ఉంటూ వచ్చింది. గట్టి కట్టడాలు; నిడుపూ వెడల్పూ గల వీధులూ భవనాలూ, మేడలూ, మిద్దెలూ, అంగళ్లూ-అన్నీ వెలిశాయి; పైగా నగరంలో ఫలవృక్షాలూ, పచ్చికబయళ్లూ సమృద్ధిగా ఉన్నాయి. దీనికంతా వ్యవసాయ ప్రాజెక్టులే కారణం.

అంకారాలో కొండపైనున్న ప్రాచీనమైన కోటగోడల మధ్య, చాలామంది ఉన్నరీతిలోనే పొట్టపోసుకుంటున్నారు. ఐతే వీళ్లకు ఉపాధి గల జాగాలలోకి పోయే అవకాశాలిస్తున్నారు.

అంకారా ప్రాచీనవాసుల నాగరికత క్రీస్తుపూర్వం 2000 సం॥నాటి హిటైట్ జాతికి చెందినది. ఈ నగరానికి చెందిన ప్రాచీన గాథలు, దీనిని ఫ్రీజియన్‌ల రాజు "మైదాస్" స్థాపించాడంటారు. ఐతే అటుతర్వాత ఈ ఫ్రీజియన్‌లను లీడియన్స్ అనే బలమైన జాతి జయించింది. వీరి రాజు పేరు క్రోయెసస్.

ఈ నగరం చాలా సార్లు అలెగ్జాండర్ మొదలు మంగోలియా టామెర్ లేన్ వరకూ అనేకుల దాడులకు గురియైంది.

ఒట్టోమన్ రాజ్యంలో ఉచ్ఛదశ నందుకుని మంచి వాణిజ్యకేంద్రంగా ఈ అంకారా ప్రశస్తి పొందింది.

ఐతే ఒట్టోమన్ ఉచ్ఛదశ దాటి క్షీణించిపోడంతో అటాటుర్క్ దీనిని చేబట్టి రాజధానిగా చేసుకునే వరకూ, ఈనగరం జీర్ణదశ ననుభవించింది.

ఈ అంకారా కోట దిగువ కొండ నానుకుని మ్యూజియం ఉన్నది. ఈ పురావస్తు ప్రదర్శనశాలలో ఎంతో శిల్పసంపద ఉన్నది. పూర్వం ఈమ్యూజియం భవనాలు వర్తకులకు ఒక శతాబ్దం క్రితం వరకూ సత్రాలుగా ఉపయోగపడేవని తెలుస్తోంది. ఇక్కడ సంతలు, వ్యాపారాలు జరిగేవట!

హిటైట్ నాగరికతకు చెందిన ఈ మ్యూజియంలోని శిల్పాలు నాటి ప్రజల గురించి చాలా తెలుపుతాయి. అప్పటి ప్రజల వీరోచిత గాథలూ, "జాషువా"తో పోరాడిన వారి ధైర్యసాహసాలు ఇవి తెలియజేస్తాయి. వారందరూ చాలా వీరులే అయినా, అటుతర్వాత వీరిని మించిన వీరులైన "అస్సీరియనుల" చేతుల్లో పరాజయం పొందారు. పేరు మాసిపోయారు.

ఈ మ్యూజియంలో గల శిల్పాలన్నీ అధికభాగం అదమా వద్ద దొరికాయి. వీటిని అర్థంచేసుకోడం శిల్పశాస్త్రకారులకు తలకుమించిన పనిగా ఉంది.

ఇవన్నీ ఫోయినీషియన్ లిపిలో ఉన్నా వీటిలోని పాత్రలన్నీ హిటైట్ తెగకు చెందినవి. దీనిపై పరిశోధనలు జరుపుతున్నారు.

ఐతే ఈ శాస్త్రవేత్తలెవరికో తప్ప అంకారావాసులకు గతమంటే అంత మమకారం లేదు. వర్తమానం వాళ్ళది. రేపటికై వారు కృషి చేస్తారు. అభివృద్ధికై వారు పథకాలల్లుకుంటారు. ఆనందానికై వాళ్ళకి నగరంనిండా కావల్సినన్ని హోటళ్లూ థియేటర్‌లూ, పార్కులూ ఉన్నాయి.

ఒక థియేటర్‌లో అమెరికన్‌లు టర్కీవారు కలిసి ఒక బృందంగా మంచినాటకాలు వేస్తున్నారుకూడా.

టెంపిల్ మానింగ్. ★

మార్లిన్ మన్రోతో ఆమె మూడవ భర్త ఆర్థర్ మిల్లర్.

# మమత ఎరుగని జీవితం

## మారిలిన్ మన్రో

ధనంవల్ల శాంతి ఎలా లభించదో, కొందరు పైకి ఎంత సంతోషంగా కన్పించినా లోలోపల ఎలా కుమిలిపోతారో, అనే విషయాన్ని చలనచిత్ర ప్రపంచంలో 'ప్రణయాధి దేవత' అనిపించుకున్న నటి కీ. శే. మారిలిన్ మన్రో ఆత్మకథలో వివరించింది.

సినిమా నా వృత్తి. నా జీవితం నాకు సంబంధించింది మాత్రమే. ఎవరితోనూ నా సమస్యలు గురించి చర్చించను.

వ్యాపారం నాకు తెలీని విషయం. వ్యాపార దృష్టి ఎక్కువగా ఉంటే ఇంకా డబ్బు సంపాదించేదాన్నేమో! అసలు నా జీవితమంతా అందరినీ తేలికగా నమ్మేదాన్ని. ఎవరేం చెప్తే ఆ పని చేసే దాన్ని. అందుకనే నా వివాహ జీవితం సాఫీగా నడవ లేదు.

ఆర్థర్ మిల్లర్ (మూడవ భర్త—సం॥) నా వ్యవహారాలు చూసేవాడుకాదు. అతనికా వ్యాపారం తెలీదు.

వ స్పెండర్ విమర్శించారు. • నేనుమాత్రం అతిగా బాధపడలేదు. నాకు ఒక రకమయిన 'సభా పిరికిదనం' ఉండడంచేతనే మరీ ఆడంబరంగా అలంకరించుకుని ఆలస్యంగా రావటం అలవాటని కొంద రంటారు.

మునుపు ఎక్కడికయినా ఆలస్యంగానే వచ్చే దాన్ని! ఒకసారి మాత్రం ఒక 'పార్టీ'కి ముందుగా వెడితే ఇంకెవ్వరూ రాలేదు. నే నేం చెయ్యా లంటారు? కూర్చుని దిక్కులు చూడాలా? పోనీ, మనకి ఆతిథ్యం ఇచ్చేవారితో తీరికగా మాట్లాడ వచ్చునంటే — వారుమాత్రం సిద్ధంగా ఉంటా రనేమిటి?

కనీసం, రైలుబళ్ళకి, వివాహాలకి సకాలంలో వెడుతున్నా కదా, అదే చాలు!

నా కిష్టమయిన దేమిటో నాకు తెలుసు. ఎవరో ఇప్పుడు "ఎరుపురంగు దుస్తులు బావుండవు!" అంటే, "ఎందుకు?" అన్నాను.

"తక్కినవారందరూ నల్లనివే వేసుకుంటారు. అక్కడ మేధావు లొస్తారు. ఆ వాతావరణం అలా ఉంటుంది!" అని వారే అనేవారు.

"మేధావులు నలుపే వాడాలా? అలాగని ఎక్కడుంది?" నేను చెప్పేదాన్ని. నే నేది వేసుకున్నా ఎవరో ఏదో అనకుండా ఉండరు! క్లార్క్ గేబెల్ చనిపోయినప్పుడు ఒక సమావేశానికి వెళ్ళాను. మర్నాడు నన్ను గురించి రాసింది మీరు చదివితే గాని తెలీదు! ఒక పత్రికలో, 'ఇటువంటి అసభ్య ప్రదర్శన ఎక్కడా చూడలే' దని ఉంది.

అనిటాకోర్బీ మాత్రం, "నీ 'డ్రెస్' గురించి రాసింది చదివి నవ్వుకున్నాను" అంది నాతో. ఆ 'డ్రెస్' ఎక్కడిదో ఆమెకి తెలుసు. నేను దాన్ని 'మాగ్నిన్' అనేచోట కొన్నాను. దానికి నకలు శాన్ ఫ్రాన్సిస్కోలో ఒక గొప్పఆవిడ వేసుకుంది. అంటే —ఆవిడ వేసుకుంటే తప్పులేదు గాని, నేను ఎర్ర 'డ్రెస్' మీద నల్లటి 'లేస్' వాడితే తప్పా?! 'అల్లరి' గా ఉంటుందా?

నిజం చెప్పాలంటే, ఆడవాళ్ళకోసం 'డ్రెస్' లు నిర్మించే వారిలో చాలామందికి ఆడవాళ్ళంటేనే గిట్టదు. అందుకోసమే స్త్రీలను స్త్రీలుగా కనిపించే దుస్తులు 'నిర్మించ' రు. ఇదొక పెద్ద "ధోరణి" గా మారిపోయింది.

నా వృత్తి నాది. ఎప్పుడో ఒకసారి 'మార్లిన్ ఓట్

—54 వ పేజీ చూడండి

సారథి స్టూడియోస్ 'ఆత్మబంధువు'లో సావిత్రి

# కట్ కటా?
# సమైక్యతా చిత్రాలా?!

సినిమాలంటే జనం తెగ విరగబడిపోతారని అంతకంటే దగ్గిరమార్గం సంపదకూ, అడ్డదారి సిరికీ లేదనీ, ఇంచుమించు అందరూ ఒప్పుకుంటున్న ఈ దశలో అసలు మన సినిమాలను తయారు చేయగల దశావాటిని ప్రదర్శించగల సినిమా గృహాలు (టెంటువైనాసరే) ఎన్ని ఉండగలవనే కథా మనం యోచిస్తే ...... కొంచెం భయంగా ఉంటుంది. బాబోయ్, సినిమాలురావా? ఆ వచ్చిన వాటికి వెండితెరలు కరువా అనిపిస్తుంది. ఒక వార్తానంస అంచనా ప్రకారం దేశంలో 4,200 సినిమాలకు ఇప్పుడున్న ప్రొజెక్టర్‌లను మార్చితేగాని, ఆ బొమ్మలు చూపించవా? అనుకున్నాంటురట.

అంచేత ఇవాళ సినిమా తియ్యాలని తియ్యా ఆలోచనలున్నా, తియ్యగల మార్గాలు లేవన్నే సినిమా హాలు కట్టాలన్నా, దాన్ని కట్టి, నిత్యకళ్యాణం పచ్చతోరణంగా పెళ్ళిళ్లకు ఇవ్వాలేతప్ప—దానిలోకి ప్రొజెక్టర్‌లు కావాలంటేను, ప్రింట్‌లు కావాలంటేనె వస్తుంది పేచీ. అంతేగాక 1960–61 సం.లో మన దేశం సినీ పరికరాలను తెప్పించుకున్న తీరుచూస్తే కట్టబోయే థియేటర్‌లకు స్టూడియోలకు భవనాలు తప్ప, తతిమ్మా సరుకు లభ్యంకాకపోవచ్చును.

మరో 4,000 సినిమాహాలులైనా కట్టవొచ్చునట

—50 వ పేజీ చూడండి



వి. కె. సి. వారి "పతిగౌరవమే సతి కానందం"లో మాలిని



# ప్రపంచప్రముఖులు-14

రెండో ప్రపంచయుద్ధం సమాప్తమైన కొత్తరోజులలో కాబోలు యూరప్‌ఖండంలో రాజరికాలు ఒకదాని తర్వాత ఒకటిగా అంతం కావడంచూసి అప్పటి ఈజిప్టు రాజు ఫరూక్ ప్రపంచం మొత్తంమీద చివరకు మిగిలేది అయిదుగురు రాజులేనని ఒక ఛలోక్తి విసిరాడు. ఆ అయిదుగురు చీట్లపేకలో కనిపించే ఆటీన్, ఇస్పేట్, కళావరు, డయిమన్ రాజులు, బ్రిటిష్‌రాజు అని కూడా ఆయన తన ఛలోక్తిని విడమర్చి చెప్పాడు.

ఇది కేవలం ఛలోక్తి అయినప్పటికీ తన విషయంలోది అక్షరాలా నిజమైంది: ఇరాక్ విషయంలోనూ అదే జరిగింది.

అది 1958 జూలై 14. ఆరోజు ఇరాక్ రాజధాని బాగ్దాద్ వీధులలో రక్తం ఏరులై ప్రవహించింది. అప్పుడే మైనారిటీ తీరి రాజ్యాధిపత్యం చేపట్టిన ఫైజల్ రాజును, ఆయన తరపున రీజెంటుగా పని చేసిన రాజ బంధువు అబ్దుల్ ఇల్లాను, ఇరాక్ ప్రధాన మంత్రిగా పనిచేస్తున్న నూరీ సయ్యద్‌ను దారుణంగా హత్యచేశారు. అబ్దుల్ ఇల్లా శరీరాన్ని తిరుగుబాటుదార్లు బాగ్దాద్ వీధులలోకి లాగి తమ కసి తీర్చుకున్నట్లు కూడా నాటివార్తలు తెలిపాయి.

ఇరాక్‌లో జరిగిన ఆ సంక్షోభానికంతకూ అబ్దుల్ కరీం కాశీం హఠాత్తుగా లేవదీసిన సైనిక విప్లవమే కారణం. పేరుకు ఇరాక్ రిపబ్లిక్ అయినప్పటికీ, కరీం కాశీం ఈ నాడు ఆదేశాని సర్వనియంత.

కాశీం జన్మస్థానం బాగ్దాద్‌నగరమే; వయస్సు 48. ఒక చిన్న భూస్వామి కుమారుడు. ఇరాక్ మిలిటరీ అకాడమీలోనే (1934) పట్టభద్రుడై సైన్యంలో చిన్న ఉద్యోగంలో చేరాడు: బ్రిగేడియర్ అయినాడు. పాలస్తీనా యుద్ధంలో ఒక పదాతి దళాధిపతిగా పనిచేసి యుద్ధరంగానుభవం గడించాడు. రణనీతిలో అనుభవజ్ఞుడే అయినప్పటికీ, రాజకీయాలలో ఏమంత అనుభవంలేదు.

భయానక వాతావరణంలో రాజ్యాధిపత్యాన్ని చేపట్టినప్పటికి, గతనాలుగేళ్ల పాలనలో దేశపాలనలో ఒక స్థిరత్వాన్ని ఏర్పరచగలిగాడనే అనాలి. బాగ్దాద్ సైనిక ఒప్పందానికి స్వస్తి చెప్పడంలోనూ, అమెరికాసహాయాన్ని వద్దనడంలోనూ కాశీం మొత్తంమీద పట్టుదల చూపగలిగాడు. విద్యా, వ్యవసాయరంగంలో సంస్కరణలు ప్రవేశపెట్టాడు. ప్రాక్పశ్చిమ రాజ్యకూటాలమధ్య ఒక విధమైన తటస్థ్య విధానాన్ని సృష్టించుకోగలిగాడు.

వీటితోపాటు సైనికతిరుగుబాటులో అతి సన్నిహితంగా పనిచేసిన ప్రత్యర్థులను తుదముట్టించి, అధికారాన్ని కాశీం స్థిరపర్చుకున్నాడు.

అయితే సైనిక విప్లవాలకు ప్రజావిప్లవాలే విరుగుడు అనే విషయం మరచిపోకూడదు. ఇలాంటి తిరుగుబాట్లకు పెట్టిన పేరైన మధ్యప్రాచ్యరాజ్యాలలో ఏదిస్థిరమో, ఏదిఅస్థిరమో చెప్పలేము. కాశీం సంగతీ అంతేనేమో!



# పట్టుదల గల ఛంత వాసంతి

నేను పట్టి పెంకెఘటాన్ని, కలమొండిని. ఏనయ్యో వాకా పట్టిన పట్టు విడిచేనే లేదు— ఇది మా ఇంట్లో వాళ్ళందరికీ నా మీద ఉన్నఅభిప్రాయం. ఇది ఇప్పటి మాట కాదులెండి! చాలాకాలంక్రితం. నా ఆరో ఎంవత్సరంలో అనుకుంటా...

నేను మా అమ్మా, నాన్నతో తెనాలిలో మధ్యాహ్నం సినిమాకెళ్ళాం. అంతా వెళ్ళిపోయినా నేనుమాత్రం లేవలేదు. మా అమ్మ, నాన్న—సినిమా అయిపోయింది, ఇంటికి వెళ్దాం లెమ్మన్నారు నేను రానని జవాబు చెప్పాను. 'అదేమిటమ్మా! వెళ్దాం రా!' అన్నారు మా నాన్నగారు. చెప్పొద్దూ! నాకు నిజంగా ఏడుపొచ్చింది పెద్దగా ఏడవటం మొదలుపెట్టాను ఓ అబ్బాయిని తోడిచ్చి, మా అమ్మా, నాన్నా వెళ్ళిపోయారు. నేను అలాగే కూర్చుని వరసగా మూడాటలూ చూశా....ఇంతకీ ఆ సినిమా 'చంద్రలేఖ'!...ఈ విషయం తల్చుకున్నప్పుడల్లా నా ఆనాటి పట్టుదలకు నాకే నవ్వొస్తుంది. కాని, ఈనాడు మీ ఎదుట ఒక నటిగా 'వాసంతి'గా తెరమీద నిలబడటానికి ఆ పట్టుదలే కారణమేమో అనిపిస్తుంది

*　　*　　*

గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకా తిమ్మసముద్రం నా జన్మస్థలం. ఆ గ్రామంవారు కొండవీతో పాటు కలవారం. ఆపైన కళవారం కూడా. మా నాన్నగారు ఆరోజుల్లో నాటకాలు వేసి ప్రసిద్ధి పొందారు. ఆ! ఇంతకీ మా నాన్నగారెవరో మీకు చెప్పలేదుకదూ! ఎవరో తెలుసుగా! 'చలో ఢిల్లీ' నాటకం ప్రదర్శనతో దేశంలో బోసుచౌదరిగా పేరుపొందిన కరణంఅప్పయ్యచౌదరిగారు కదా! ఆయన వాతో చిన్నతనంలోనే పెరిగిన 'సినిమా మోజు' పసిగట్టారు. 'అటా పాటా ఉంటే చాలు,' అన్నం నీళ్ళుకూడా అక్కర్లేదు పాపకి' అని సాధిస్తుండే వారాయన.

నా విద్యాభ్యాసం కొంత మా తాతగారి ఊరు పెదనందిపాడులో జరిగింది. అక్కడ మూడో ఫారంవరకు చదువుకున్నాను. మా నాన్నగారు మద్రాసుమకాం పెట్టటంతో మద్రాసులో శ్రీ శారదావిద్యాలయ గరల్స్ హైస్కూలులో ఐదో ఫారంవరకు చదువుకున్నాను. ఆ రోజుల్లోనే మొట్టమొదటిసారిగా నాయికపాత్ర ధరించాను. తోటివారు, పెద్దలు ఉత్సాహం కలిగించటంతో తర్వాత తర్వాత మరికొన్ని నాటకాల్లోనూ, వక్తృత్వ పోటీ, సాంఘికసేవలాంటి ఇతరకార్యక్రమాల్లోనూ పాల్గొంటుండేదాన్ని. అన్నిటిలోనూ మొదటి బహుమతులు నావే.

ఏం లాభం! మధ్యలో మళ్ళీ ఒక చిక్కువచ్చింది. తిమ్మసముద్రంలో హైస్కూలు పెట్టారు. హైస్కూలుకమిటీ సభ్యుల పిల్లలు ఆ స్కూల్లోనే తప్పక చదవాలని కమిటీ తీర్మానించటంతో, మా నాన్నగారు కూడా అందులో ఓ సభ్యుడు కావటం చేత, నేను తిమ్మసముద్రంలో చదవాల్సివచ్చింది. స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణత పొందాను!

ఆ తర్వాత నా మకాం మళ్ళీ మారింది. గుంటూరు

—53 వ పేజీ చూడండి

# చదువుల్రావు


అదృష్టం కొద్దీ సరిగ్గా బస్సు
లోని ఆఖరి ఒక్క సీటు
దొరికింది..చూశారా?
ఆహా..
మనబస్సులో
ఎక్కితే
బాగుండును
ఇంతలో ఓ అమ్మాయి బస్సు లోకి..
అరెరెరె, మీరలా నుం
చుంటే ఎలా! నా సీటులో
కూర్చోండి. నేను నుంచోగలను
థేంక్యూ వెరీ
మచ్


అని ఆ అమ్మాయి ఆ
సీటులో కూర్చోగానే...
రావుగారు ఆ అమ్మాయి
తో కబురు మొదలు
పెట్టబోతూండగా...
నో స్టాండింగ్ పాసెంజర్స్ ప్లీజ్.. మీరు దిగి పోవాలి. అనవసరంగా
మీ సీటు నీ పోగొట్టు
కున్నారనుకుంటా.

# కథ కాని కథ

## ఈశ్వరవేరు!

### (మొదటి బహుమతి)

నాల్గు రోజుల క్రితము ఒక పాములవాడు వచ్చాడు. వాడు ఒక వేరు చూపించి "ఈ వేరు ఏ పాముకైనా చూపితే అది పారిపోతుందని" చెప్పి, తనదగ్గర ఉన్న ఒక పాముకు ఆ వేరు చూపించాడు. పడగవిప్పిన ఆ పాము వెంటనే ముడుచుకొని బుట్టలోకి వెళ్ళిపోయింది. ఇది చూసిన మా పక్కింటి గేళ్ళ తమ్ముడు "నాదగ్గరా ఉంది" అని లోపలకి వెళ్ళి పరుగున ఒక వేరు తెచ్చి, ఆపాముకి చూపేడు. ఆవేరుకి కూడా ఆ పాము పడగ ముడుచుకొని బుట్టలోకి వెళ్ళిపోయింది. వీడికీ వేరుఎక్కడిదా? అని ఆశ్చర్యపోయాము. పాములవాడు వెళ్ళిన తరువాత "అది ఏమిటిరా?" అని అడిగాము. అనుమానము తీరక వాడు సన్నగా నవ్వుతూ "మన పెరట్లో ఉన్న తేన వేరురా" అన్నాడు. మేము వాడి తెలివికి ఆశ్చర్యపోయాము.

టి. సత్యం (ఎ. వేమవరం)

* * *

## కన్యలకు మాత్రమే!

### (రెండవ బహుమతి)

ఒకనాడు మా తెలుగు టీచరు "కనుని విద్యాభ్యాసము" అను పద్యభాగమును చెబుతూ, దానిలోని పద్యమైన..."నీవును బ్రహ్మచారివి పని తుద నేనును గన్యకన్ మహీదేవ కులావతంస, రవితేజ వివాహము నీకు నాకు మున్" అను మొదలుగా గల పద్యమునుచదివి "ఒరే రాము! నీవు లేచి చదువరా" అనెను. అంత రాము లేచి పద్యమును చూసి "టీచర్! నేను కన్యను గాదండి.ఎలా చదవమంటారు?" అనెను. దానితో టీచరూ, మేము నవ్వాపుకో లేకపోయాం.

బలరామకృష్ణ (మలికిపురం)

* * *

## మాలదాసరి

### (రెండవ బహుమతి)

అవి మేము ఐదవ ఫారము చదివే రోజులు. మా తరగతిలో షణ్ముగం అని, మద్రాసు ప్రాంతానికి చెందిన ఒక అబ్బాయి ఉండేవాడు. అతడు క్రొత్తగా చేరినాడు. అతనికి తెలుగు స్వచ్ఛముగ మాట్లాడుటకు రాదు. అరవముతో కలిపి, తెలుగు మాట్లాడేవాడు. ఒకసారి మా పాఠశాల తనిఖీకి జిల్లా విద్యాధికారి వస్తారని తెలిసింది. అతని కేవిధంగా స్వాగతమివ్వాలని మా మేష్టారు ఆలోచిస్తూ ఉన్నారు. తుదకేమో ఆయన కొక ఆలోచన తట్టి, "డి. ఇ. ఓ. గారు" అని చెప్ప ప్రారంభించగానే మా షణ్ముగం లేచి "మాల-దా. సరి" అని అన్నాడు. అప్పుడు మా మేష్టారు కోపంతో "డి. ఇ. ఓ. నే తిడతావురా? వెధవ" అని వాని చెవి మెలిపెట్టసాగినారు. అప్పుడు షణ్ముగం మెల్లిగా "సార్, డి. ఇ. ఓ. గారికి మాలదా వేస్తే సరిపోతది అనిదా చెప్పితిని సార్" అనెను. అతని మాటలకు, మేష్టారితో బాటు మేము కూడ నవ్వాము.

ఆర్. నాగేశ్వరరావు (మదనపల్లి)

* * *

## "వై లేట్?"

### (రెండవ బహుమతి)

నేను నాల్గవ ఫారము చదివేటప్పుడు ఒకరోజు పది నిమిషాలు ఆలస్యంగా వెళ్లాను. అప్పుడు లెక్కల పీరియడ్ జరుగుచున్నది. విద్యార్థులంతా లెక్కలు చేసుకుంటున్నారు. లెక్కలు పుస్తకాన్ని రెఫర్ చేసుకుంటున్న మా టీచరు వాకిట్లో నిలిచిన నన్ను చూచి "వై లేట?" అన్నారు. లెక్కల్లో నిమగ్నురాలైన ఒక అమ్మాయి వెంటనే "ప్రెజంట్ సార్" అంటూ లేచి నిలబడింది. మాష్టరుగారితో సహా క్లాసులోని పిల్లలంతా ఒక్కసారి గొల్లున నవ్వారు. అసలు విషయమేమంటే - ఆ అమ్మాయి పేరు "వైలెట్ బెస్సి." అటెండెన్సు వేస్తున్నారు. కాబోలు అనుకొన్న అమ్మాయి ముఖం సయాపైనంత అయిపోయింది.

అన్వర్ అతావుల్ (కర్నూల్) ☆

[కుమారి కళ మంచిపాటలు రాసి తియ్యగా పాడుతుంది. ఒకనాడు స్టూడియోలో ఆమె కొత్త ఎలక్ట్రికల్ యింజనీరునుచూసి, పాత సౌండ్ యింజనీర్ ను అడుగుతుంది.]




# కుమారి కళ

1 బొమ్మల కథ దేవిక









# హరివంశము

హారీతశివశర్మ

## సాందీపని పర్వం-12

ఆచార్య సందీపని తన ఆస్థరణముననుండి లేచి నిలబడెను. ఆయన వృద్ధుడయ్యును, అప్పుడు సభకు యౌవనునివలె కన్పించెను. కాశికలోని బ్రాహ్మణ ప్రవరు లెంతకాలముగా నాయన నెరుగరు! ఆయన ధర్మప్రవచనముచేయగా నెందరు వినరు! ఎన్నిసారులు వినరు! ఎచ్చటనో యున్నయుజ్జయనినుండి ఆయన కాశికకు వచ్చెను. విద్యయంతయు కాశికయందే గడించెను. మరి కాశికయందే విద్యాదానము చేయుటకు కుదురుకొనెను. కాశికలో నెన్నియో గురుకులము లున్నవి. మరి సాందీపని గురుకులమునకున్న పేరు, ప్రతిష్ఠ మరి యే ఇతర గురుకులమున కున్నవి! ఆ గురుకులమున కాగౌరవము, ఆయన గురువులలో గురువగుట వలననేగాక, ఆయన శీలమువలన, ధర్మమునందు ఆయనకు గల అభినివేశమువలన, శిష్యులన్న ఆయన చూపు ప్రేముడివలన కల్గినది. అందుకు కాశికయందు ఆయనయందు అమర్ష చేయువారున్నారా?! లేరు. మరి నేడు ఆయన ధర్మప్రవచనము చేయుటకు పూనుకొనగా రాజధర్మాసనముననున్న పండితు లందరును ఆశ్చర్యపోయిరి. నిస్తబ్ధులైరి! మహానందుడేమో బ్రాహ్మణధర్మ వ్యతిరిక్తమైన పనిని చేసెను. దానిని ధర్మమే మూర్తియయిన ఆచార్యుడు, సాందిపని ఎట్లు సమర్థించును? ఆ సమర్థన ఎట్లు పొసగును! ఈ అవస్థలో సభయంతయు ఏకకర్ణముగా నాయనకు అర్పితమై యుండిపోయెను.

ఆచార్య సాందీపని ప్రథమమున ధర్మాసనస్థితుడైన రాజును సంబోధించెను. తదుపరి సభాస్తారులను సంబోధించెను. "అయ్యా! నేడు అతిక్లిష్టమైన ధర్మసందేహము వచ్చిపడినది. ఆచార్య మహానందునియందు ఆయన ధర్మచ్యుతికరమైన పనిని చేసినాడన్న అభియోగము ఆరోపింపబడినది. నిజముగా ఆయన అట్లుచేసెనా! ఆయన చేసిన పని యట్టిదా! ఇది విచారించినవారు లేరు. ఈ ధర్మాధిపతియైన రాజు ముందుగనే ఆయన నేరమును చేసినా

[illegible] కాదు. ధర్మవిక్షేపము."

సభ అప్రతిభమయ్యెను. నీలవర్ణము ఎండపట్టుటచే నల్లబడిన పౌండ్రకుని ముఖమున విచిత్రముగా ఎఱ్ఱజీరలు వ్యాపించెను. కన్నులలో కోపపు కెంపుల కాంతులు ముఖముపై విస్తరించినవో! రాజు ఏమో మాటాడబోయెను. ఆచార్య సాందీపని ఆయనను మాటాడనీయలేదు. "మహారాజులు కోపగించి లాభములేదు. నేను ఉన్నవిషయమును ఉన్నట్లు చెప్పుచున్నాను. ధర్మాధికారికి చిత్తవిక్షేపము తగదు. మరి మహారాజుల చిత్తమేగాక, శరీరముగూడా విక్షేపము చెందియున్నది. ప్రభువులు ఆగ్రహించి లాభములేదు." అని ఆచార్య సాందీపని యాగెను.

కంచుకి తనస్థానములో నవ్వుతో వణికిపోయెను. సభయంతయు నటుతిరిగెను. పౌండ్రకుని దృష్టియు నటు ప్రసరించెను. ఆ చూపులలో నాశీవిషము లున్నవో! కంచుకి హఠాత్తాడితుడైనట్లు స్తంబమును భజించెను. పౌండ్రకుని ఆ తీక్షణ దృష్టి ఇదివరకాత డనుభవించినదిలేదు. తీక్ష్ణత అట్టులుండునని అతని కిప్పుడు తెలిసినది. అంతలో అతని ఆలోచనమున కాఘాతము కల్గెను. ఆచార్య సాందీపని మరల తన ప్రసంగమును ప్రారంభము చేసెను. 'మహారాజ! నేను వృద్ధుడను. నోరుజారి ఏవో మాటలందును. తమకు తండ్రివంటి వాడను. నన్ను మీరట్టుల తిలకించవలయును. ధర్మమును చెప్పుటకు మమకారము లుండరాదు. మమకారమును త్రోసివేసినచో వాక్కు కఠినమగును. ధర్మము కఠినమైనది. పరుషమైనది. సూక్ష్మమైనది. కత్తివంటిది. అది ధర్మమును తెలియనివారికి బాధను కల్గించును. ధర్మమనగా నేమి? మనము మన కన్నులతో చూచుచున్న వర్ణాశ్రమ ధర్మము ధర్మమా! అవును. అది ధర్మమే యందును. ఎవరికి? ప్రాకృతులకు. ప్రభూ! ధర్మములో రెండవస్థ లున్నవి, ఒకటి వ్యావహారికము. రెండవది పారమార్థికము. వ్యవహారములో వర్ణాశ్రమాదికము ధర్మము కావచ్చును. పరమార్థముగూడ నీ వర్ణాశ్రమాదిక ధర్మమున్నదా! పరమా

[illegible] వర్ణాశ్రమాదిక ధర్మ మెట్టులున్నది? భగవంతుడు పూర్వము సూర్యునకు ధర్మమును చెప్పెను. అతడు ఆ ధర్మమును ఇక్ష్వాకునకు బోధచేసెను. అది ఇప్పుడు లుప్తమైనది. కాని అంతరించి పోలేదు. ఆ ధర్మమున భగవంతు డేమనినా డనగా, వేదములు త్రైగుణ్య విషయము లనినాడు. అనగా, అవి పరమార్థములు కాదు. పరమార్థము తదతీతమైనది. అట్టులనే వ్యావహారిక ధర్మముకన్న పరమార్థ ధర్మము అతీతమైనది". అని కొంచె మాగి, ఆచార్య సాందీపని ఇట్టులనెను. "మహానందునిగూర్చి ఇట్టు లాలోచించవలయును. ఏలనగా, మహానందుడు వ్యావహారికావస్థను తరించినవాడు. అతడు పారమార్థిక స్థితిలోనున్న యోగి. స్థితప్రజ్ఞుడు. ఆ స్థితిలో ఎవరు ఎవ్వరు? అచ్చట మహానందుడును లేడు; కడజాతివాడును లేడు. ఒకడు దానమును పట్టుటయు, మరియొక్క డిచ్చుటయు లేదు. ఇచ్చినది ఎవ్వరు? పట్టినది ఎవ్వరు? సర్వధర్మములను—అనగా వ్యావహారిక ధర్మములను—పరిత్యజించి, భగవంతునియందు ఏకముగా శరణాగతిని పొందియుండు స్థితి పరమార్థము. ఆ స్థితిలో వ్యావహారిక ధర్మము లెక్కడనుండును? మరియు ఆత్మవేత్తకు తనకన్న వేరైన ధర్మము లేదు. అంతయు తానే యయినప్పుడు, దానమిచ్చునదియు, దానము పట్టినదియు తానే. పరమశివుడు దానముచేయగా పరమశివు డందుకొనినాడు. ఇది వ్యవహారముకొరకు. పరమార్థమున నా దానముగూడ లేదు. దానమిచ్చుట లేదు; దానము పట్టుటలేదు. మహానందుడు సర్వధర్మములను త్యజించినవాడు. అదితానే అయిన వాడు. వానిని వ్యవహారధర్మముతో విచారించుట ఎట్లు? ఈ వ్యవహారధర్మము అధ్యారోపము. రజ్జువునందు సర్పమువలె. ఇచ్చట పరమార్థమైన ఆత్మధర్మమునందు పరమార్థముకాని వ్యావహారికధర్మము, దేహధర్మము ఆరోపించబడుచున్నది. ఇట్టిధర్మము సామాన్య మానవులకు, కర్మజడులకు చెల్లిన

—55వ పేజీ చూడండి



"లావణ్య తప్పితే తనకు ఆడపిల్లలే దొరకరా ఏమిటే? ఈపిల్ల గాకపోతే ఇటువంటివాళ్లు లక్షాతొంభైమంది. తనకేం! మ గమహారాజు." అనుకుని, కాళ్లు బార్లాజాపుకు పడుకుని బాధపడుతున్న సమయంలో బిలబిలమంటూ వికవికలు పకపకలతో పంచపాండవుల్లాగా అయిదుగురూ బృందగానంచేస్తూ గది ప్రవేశంచేసి మాగన్నుగా నిద్రపోతున్న సుబ్రహ్మణ్యాన్ని మంచంమీదనించి అమాంతం ఎత్తి భూమ్మీద నించోపెట్టారు రామేశం, శ్రీశైలం, గోవర్ధనం, చంద్రశేఖరం అండ్ హనుమంతు ఆదిగాగల మిత్రబృందం.

గదంతా గాలించి ఆఖరుకు వంకెకు తగిలించిన షర్టుజేబులోంచి పర్సు పయికి తీసి అందులో డబ్బును లెక్కగట్టి 'రెండు నయాపైసలు తక్కువ ఆరు రూపాయలుంది' అన్నాడు శ్రీశైలం.

'చాలు' అన్నాడు గోవర్ధనం.

'ఏమిటి చాలు. నీ బొంద! దేనికీ చాలదు' అన్నాడు హనుమంతు.

ఈలోగా కొంచెం తేరుకున్న సుబ్రహ్మణ్యం 'ఏమిట్రా మీ గొడవ అసలే చస్తుంటే' అన్నాడు చిరాకుగా.

'చావటం ఏం ఖర్మరా సుబ్బీ! పట్టభద్రుల జాబితాలో నీ పేరు ఎక్కిపోతేనూ' అన్నాడు రామేశం.

'నీ బొంద. నీ జోకులకు వేళాపాళా లేదు.' అని సుబ్రహ్మణ్యం విసుక్కున్నాడు, పగిలిన హృదయ భాండం బాధపెడుతుంటే.

'నిజంరా సుబ్బీ! హాస్యంగాదు. కావలిస్తే నీ మనీపర్సుమీద ఒట్టు. ఇంతకుముందే యూనివర్శిటీ నించి లిస్టు వచ్చిందిరా కాలేజీకి. నువ్వు ప్యాసయ్యావురా సుబ్బీ." అన్నాడు రామేశం తన మాట నమ్మమన్నట్టు.

'అదంతా తర్వాత చూసుకుందాం. ముందర పార్టీ ఏర్పాట్లు చూడండిరా' అని జ్ఞాపకం చేశాడు చంద్రశేఖరం.

అంత బాధలోనూ సుబ్రహ్మణ్యం సంతోషించకుండ ఉండలేకపోయాడు. పరీక్ష ప్యాసయ్యాడు. ప్యాసయినట్టు విన్నాడు. 'ఆహా! ఇవాళ ఎంత సుదినం. ఉదయం లేచి ఎవరి ముఖం చూశానో!' సుబ్రహ్మణ్యం ఉలిక్కిపడ్డాడు. అంతలో దీర్ఘాలోచనలో మునిగిపోతుండగా హనుమంతు బుజం మీద తట్టి టీపార్టీసంగతి గుర్తుచేశాడు.

తన బాధ లోపల అణచుకుని బలవంతాన నవ్వుతెచ్చుకుని 'ఏదో ఏడవండిరా. ఆ పర్సు మీ పరం చేశానుగా' అన్నాడు సుబ్రహ్మణ్యం.

పెద్ద ఫ్లాస్కు, సంచీ తీసుకుని బయటికి వెళ్లిపోయాడు శ్రీశైలం.

సుబ్రహ్మణ్యంలోని బాధకు పూర్వగాథ కొంత ఉన్నది.

* * *

షర్టుచేతిని కొద్దిగా పైకి లాగి వాచీకేసి చూశాడు సుబ్రహ్మణ్యం, పావుతక్కువ పదయింది.

ఎండ తీక్షణంగా ఉంది. నీరసంగా అడుగులు వేసుకుంటూ, ఇంగ్లీషు సినిమాల్లో హీరోలాగా కళ్లు చికిరించి ఎదురుగా వస్తున్న జనాన్ని చూస్తూ, కార్లనూ రిక్షాలనూ తప్పుకుంటూ ముందుకు వెళుతున్నాడు.



చంకలో మడతలుపెట్టిన పేపరు అతడిలాగే ఉసూరుమంటున్నది. దాన్ని పదమూడు నయా పైసలుపెట్టి కొన్నాడు రిజల్ట్సుకోసమని. తీరా చూస్తే ఆరోజు పడనేలేదు. కసిగా పేపరును నాలుగు మడతలు మడిచి చంకలో పెట్టుకుని రూమువేపు తిరిగాడు. ఇంతలో—

"టయిమెంత"

కళ్ళు చీకిరించుకుని ముందుకు వెళ్తున్న సుబ్రహ్మణ్యానికి వినపడలేదు ఆ ప్రశ్న !

'టయిము ఎంతయిందయ్యోవ్ !' మరీ దగ్గరగా వినపడింది.

కళ్ళు కొంచెం పెద్దవిచేసి పక్కకి చూశాడు సుబ్రహ్మణ్యం. 'పదకొండు' అన్నాడు ఆ టయిము అడిగి నతన్ని కోపంగా చూస్తూ.

షాక్‌కొట్టినట్టు ఉలిక్కిపడి తమాయించుకుని సీరియస్‌గా మొహం మార్చుకుని 'ఆ గడియారం రైలుకింద పెట్టండి' అన్నా డతను క్రోపంగా, వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడవుతూ.

'మువ్వెళ్ళి అక్కడ చూసుకుంటావా' అన్నాడు సుబ్రహ్మణ్యం.

ఈ పిట్టు వినకుండానే వెళ్ళిపోయాడతను.

సుబ్రహ్మణ్యం తన వాచీకేసి చూసుకున్నాడు. పదే అయింది. తన పొరపాటు తెలిసింది. అసలు పొద్దున లేచిందగ్గరనుంచి మతి స్థిరంగాలేదు.

నిద్రమంచంమీదనుంచి లేస్తూనే కిటికీ లోంచి, ఎదురుగా పక్కవాటాలో నూతిదగ్గర ఆదిత్యహృదయం పారాయణచేస్తూ స్నానం చేస్తున్న మామ్మగారు కనపడింది.

'శివశివా' అనుకున్నాడు సుబ్రహ్మణ్యం.

లోపల్లోపలే ఆవిణ్ణి తిట్టుకుని మంచం దిగుతూ కిందనున్న గాజుగ్లాసును ఫెళ్ళన తన్నాడు. గ్లాసు పగిలి గదంతా చిందరవందరగా పడ్డది.

అవన్నీ ఒకమూలకు నెట్టి కాలకృత్యాలు తీర్చుకుని క్షౌర కళ్యాణానికి ఉపక్రమించాడు.

గడ్డంచేసుకోవడం ఒకవేపయింది. రెండో వేపు చేసుకుంటుండగా తెగింది.

మామ్మగారి మహత్యం అనుకుని కసిగా కిటికీ లోంచి నూతివేపు చూశాడు. లాయరుగారమ్మాయి లావణ్య వయ్యారంగా నీళ్ళు తోడుతోంది.

సుబ్రహ్మణ్యం ఉషారుగా ఈల వేసుకున్నాడు పైకి వినపడకుండ. నూతివేపు చూస్తూ మిగతా గడ్డం గీసుకుని అఖర్న అద్దంలో చూసుకుని అరు ఔన్సుల ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టాడు.

ఒకవేపు మీసం పూర్తిగా కనపడకుండా పోయింది. రెండోవేపున చారలాగ ఉన్న కోరమీసం వెక్కిరిస్తోంది.

మామ్మగార్ని మనసార మళ్ళీ తిట్టుకుంటూ మిగతా సగం కూడ లేదనిపించి, స్నానంచేసి బట్టలు వేసుకుని వీధిలోకి బయలుదేరాడు.

సెకండియర్ డిగ్రీ కోర్సు రిజల్ట్సు ఆరోజు రావాలి. మామ్మగారి మహత్యం ఎలా ఉందో అనుకుంటూ హొటల్లో అడుగుపెట్టాడు.

చల్లగా ఫానుకింద కూచోగానే తీయని ఊహాలు మెదిలినయి.

'ఆహా ! లావణ్య ! అందానికి తగ్గపేరు .... సన్నగా సన్నజాజితీగెలా ఆ శరీరలావణ్యం, ఎంతయినా పొగడవచ్చు. మంచి భాష వచ్చి, ఛందస్సు రాకపోయినా ఫర్వాలేదు!"

—47 వ పేజీ చూడండి






వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
7, తంబుచెట్టివీధి,
మద్రాసు-1

## ఆడవారూ — ఆచారాలూ

మా చిన్నమ్మమ్మ పూర్వాచారపరాయణురాలు. అందుచేత కూతురుకు కనీసం ప్రాథమిక విద్య గూడ చెప్పించలేదు. ఇప్పుడు 23 సంవత్సరాలు. ఏ ఒక్క పెళ్ళికానియువకుడుగూడ చదువులేనిదే చేసుకోమన్నారు. ఎన్నివేల కట్నం ఇచ్చినా అక్కర లేదన్నారు. ఇక ఆ అమ్మాయి భావిజీవితం ఏమి కావాలి ?

యద్దనపూడి జయలక్ష్మి (గుంటూరు)

* * *

పి. యల్. చెన్నకేశ్వరీదేవి వ్రాసిన "ఆడవారూ—ఆచారాలూ" అనే వ్యాసం చదివాను. వ్యాసంనిండా అసహజమైన సంఘటనలే ! పిల్లలకు చద్దన్నాలు పెట్టే, బడికి పంపే పిన్నిగారు, 12 గంటలకు ఆకలితో వచ్చే బాబాయికి ప్రొద్దున్నే ఎందుకొరకు చద్దన్నం పెట్టి పొలానికి పంపదు?

రచయిత్రిగారికి తెలిసిన ఒక కుటుంబంలోని ఇంటావిడ తన పిల్లలకి పదోఏటనే పెళ్ళిచేసే ఉద్దేశంతో ఉండి కూడా 24, 22 ఏళ్ళు వచ్చేవరకే మి చేస్తూందో? చదువురాదనిచెప్తే పెళ్లాడే అబ్బాయిలు ఈ ఇరవయ్యో శతాబ్దంలో లేకుంటే...... మరి....చదువురాని అమ్మాయిలకు పెళ్ళిళ్లు కాకుండా ఉన్నాయా? వారంతా బ్రహ్మచారిణులుగానే ఉన్నారా?

"ఇక సంగీతమో, హిందీయో చెప్పించరాదా అంటే ఆచెప్పేదీ మగవాడేకదా అని ఆవిడగారి ఉవాచ" అని వ్రాసారే! అయితే సంగీతం, హిందీ చెప్పే మహిళలే లేరనా వారి అభిప్రాయం? అదే వారి అభిప్రాయమైతే, మహిళ అయివుండికూడా మహిళల సామర్థ్యాన్ని మరుగుపర్చుతున్నట్లేగా !

ఒక మహిళాభ్యుదయాభిమానియైన యువకుడు,
యే. టి. యావలి (తొండపాడు.)

* * *

ఆడవారూ—ఆచారాలూ చాలా బాగుంది. నేను ఈమధ్యనే ఇటువంటి వ్యాసం ఎవరయినా వ్రాస్తే బాగుండుననుకున్నాను. ప్రతిజాతికి వారి వారి ఆచారాలు, నియమాలు తప్పక ఉండాల్సిందేను. అంత మాత్రాన సమయమూ, సందర్భమూ లేకుండా భర్తకూ, పిల్లలకూ 1 గంటకు భోజనంపెట్టే ఆచారము నిరుపయోగమనిపిస్తుంది. అక్కడక్కడ కొంతమంది ఆచారమని చెప్పి, తలకు స్నానాలు, తడి గుడ్డలు కట్టుకుంటారు. కానీ, వారు చేసేపనిలో శుభ్రముగాని, మాట్లాడేమాటలలో సత్యముగాని ఉండదు. పైగా, ఎదుటివారిమీద ఆక్షేపణలు. అటువంటివారిని గురించికూడ త్వరలో ఎవరయినా ఒక వ్యాసం వ్రాస్తే చాలా బాగుంటుందనిపిస్తున్నది. ప్రతిపనిలో ఆచారంతోపాటు శుభ్రముకూడా ఉంటేకాని రాణించదు.

మిసెస్. కృష్ణమోహన్ (నాగపూర్)

* * *

చదువుకొన్న అమ్మాయిలు పేరంటానికిపోయి, అందరితో ఆనందముగా కబుర్లు చెప్పుకుపోతున్నా, మ్యూజియంలోగల వింత వింత జంతువులను చూచి నట్లు చూస్తారనుటలో సందేహంలేదు గానీ, "తల్లి తండ్రుల—అసమర్థత" అన్న వాక్యం చాలా శోచనీయం." కుమార్తెలచే ఉద్యోగాలు చేయించే తల్లి తండ్రులు ఉన్నారని చిత్రగారు వ్రాసిన ఈ వాక్యం నన్ను చాలా కలవరపెట్టినది.

పోదరి (భిలాయ్)

## యువతుల సమస్య

చిత్రగారు వ్రాసిన యువతుల సమస్య బాగానే ఉంది. కానీ వారు ఒకే విషయం దృష్టిలో పెట్టుకుని వ్రాసేశా రనుకుంటాను. ఆ రకమైనవే కాదు. ఇంకా ఎన్నో సమస్య లుంటాయి.

చిత్రగారి స్నేహితురాలు చాలా త్యాగమూర్తి. ఆవిడే పెళ్లి చేసుకొని ఉంటే వారి తమ్ముళ్ల చదువులు, చెల్లెల పెళ్లిళ్లు అవడం కష్టంకదా!

పి. సూర్యం (శ్రీకాకుళం)

* * *

ఈ రోజులలో చదువుకొని ఉద్యోగాలు చేసే యువతులు క్షమించరాని తప్పులు చేస్తున్నట్లుగా కొంతమంది భావిస్తారు. నేటి స్త్రీలు పురుషుల తోపాటు సమాన హక్కులను సంపాదించారు. కాబట్టి యిటువంటి వ్యర్థ విషయాలను గురించి ఎప్పుడు ఆలోచించరేమో !

జి. ఎల్. సరస్వతీదేవి (బాపట్ల)

## మంచీ—మర్యాదా

మంచి—మర్యాదా యను పేరునకు వ్యతిరేకముగా చెడూ, అమర్యాద యనునది విశదీకరించి వారు. కాని కొందరువ్యక్తులు పరిచయమున్న వ్యక్తులకే సగౌరవ మిచ్చి ఆహ్వానించుట ఎరుగరు. అటువంటప్పుడు అపరిచయస్తులను ఆదరించడమనడము వారికి అర్థముకాని విషయము. మంచి—మర్యాద యనునది చిన్నప్పుడు పెరిగే వాతావరణము మీద చాలామట్టుకు ఆధారపడి ఉంటుంది అని రచయిత్రి వ్రాశారు. చాలామట్టుకది నిజంకాదేమో. కాలం, వ్యక్తి, పరిస్థితులపైన ఆధారపడి ఉంటుంది.

యం. రాధ (పెద్దపల్లి)

* * *

నాకూ ఇట్లా పరాభవంజరిగింది. మనము వాళ్లింటికి వెళ్లితే మనము వచ్చినట్లే లెక్కఉండదు. లెక్కఉన్నా నిర్లక్ష్యంగా చూస్తారు. ఇట్లాంటి వాళ్లకు ఈ వ్యాసము బుద్ధిచెప్పినట్లున్నది.

సి. హెచ్. భాగేశ్వరి (చిలకలపూడి)

* * *

ఈ విషయంలో డబ్బున్నవాళ్ళు, బీదవారు అను భేదం ఉండదు. వాళ్ళ మనస్తత్వాలనుబట్టి వుంటుందేమో! మా స్నేహితులు ఒకరు చాలా ధనవంతులు. వాళ్ళింటికి వెళ్తే పిల్లలు, పెద్దలు కూడా ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతారు. ఇంకొకళ్ళు చాలాధనవంతులు. కాని వారు మాట్లాడే ప్రతిమాటలోకూడా "మేము ధనవంతులము" అనే అర్థం వచ్చేలా మాట్లాడేవారు. అలాంటివారు అవి తెలిసినతరువాత మనం మళ్ళీ వాళ్ళింటికి వెళ్ళమనుకోండి. మధ్యరకం కుటుంబాలలోకూడా ఈ రెండురకాలవారు మనకు తటస్థపడతారు. వ్యక్తికీ పేరు తెచ్చేది మంచీ—మర్యాదే! అది ప్రతివాళ్ళూ తెలుసుకుంటే చాలు.

వక్కలంక. కనకదుర్గాదేవి (కొత్తపేట)

* * *

వ్యాసం చదువుతూంటే. ఈమధ్య మాకు జరిగిన ఒక సంఘటనను సరిగా పోలిఉంది. రచయిత్రివలె మేముకూడ నిరుత్సాహపడ్డాం కాని, ఈమధ్య బెనారస్ వెళ్లినప్పుడు, మమ్మల్ని బంధువులకంటే అధికంగా మర్యాదగా ఆదరించిన ఒక కుటుంబము యొక్క ఆప్యాయత మనసులో అలా నిలిచిపోయింది. "మంచీ — మర్యాదా" అనేవి వ్యక్తుల మనస్తత్వాలపై ఆధారపడి ఉండటం సహజం. పరిసరా ప్రభావంకూడ ఉంటుందనుటలో సందేహంలేదు. ముక్కూమొహం తెలియనివారితో పరిచయం మనకు కూడ కొంత బాధగానేఉంటుంది. అటువంటి సమయంలో వారి "మంచీ—మర్యాద"లే ఇరువురిమధ్య వీడని బంధమై చిరకాలం వర్ధిల్లుతుందనడంలో సందేహంలేదు.

[illegible] ★

# వనితాలోకం

# దాంపత్యజీవితం

ఆచంట కృష్ణవేణి

ఓ వారంపత్రికలో "భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు" వ్యాసం [illegible] వ్యాసం పొంతం చదివాక కొన్నివిషయాలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. భార్యచెప్పిన మాట భర్త వినకపోయినా, భర్తచెప్పిన మాట భార్య విని సంసారాన్ని చక్కదిద్దుకోగూడదా అని, రచయిత్రి అభిప్రాయం. సంసారంలో కలతలు లేవాలని ఏ భార్యాభర్తా అనుకోరు. సాఫీగా పల్లెవ్రూబాటలాసాగాలని యిరువురూ ఊహా శౌధాలు నిర్మించుకుంటారు. వారి సంసారం తాము ఊహించుకున్నట్లు వుండటానికి ఇద్దరి దోహదం కావాలంటారా అవసరంలేదంటారా?

మనలో మన మాట. మనసు, మమత, ఆత్మాభిమానం మొదలైనవి భగవంతుడు కేవలం పురుషుడికే కాక స్త్రీకికూడా ప్రసాదించాడు. అందుచేత తనకు నచ్చని విషయాలను కొన్ని స్త్రీ వప్పుకొనకపోవచ్చు. అంతమాత్రంచేత భర్త, సంఘం ఆమెను హైందవ స్త్రీకి వుండవలసిన లక్షణాలు లేవని దుయ్యబట్టడం ఏం సమంజసం!

పోతే, ఆ వ్యాసంలో ఉదహరించిన ఒక భర్త "చదువుకోని దాన్ని చేసుకుంటే నే చెప్పినదానికల్లా గంగిరెద్దులా" బుర్రఊపును అంటాడు. ఇది మాత్రం నిజమేమిటి? యథార్థానికి చదువుకున్న స్త్రీయే అయితే—కాస్త సంస్కారహృదయం అవటంవల్లనో, గొడవపెట్టుకొనటం యిష్టం లేకనో—మనస్పంగీకరించకపోయినా — భర్తచెప్పిన దానికి బుర్రూపిస్తుంది; గంగిరెద్దులా మాత్రం కాదు. — అయిష్టంగానే. అదే చదువుకోని స్త్రీ అయితే— మొండిపట్టుదలకూడా గలదైవుంటే— వప్పుకోవటం సరికదా ఎదురువాదనకూడా చేస్తుంది కావల్సినంతసేపు. కనక, ప్రతివిషయానికి చదువుతో ముడిపెట్టడం మంచిదికాదు. కొంతమంది, చదువుకొన్న స్త్రీ వంటచెయ్యదని, మొగుడిచే కాఫీపెట్టించుకు త్రాగుతుందని, భర్తను లక్ష్యపెట్టదని అపోహపడుతుంటారు. ఎందువల్లనో నాకర్థంకాదు. చదువు సంస్కారం కలిగిస్తుంది; బుద్ధిని వికసింపచేస్తుందిగాని యిహేమీ నేర్పదు. వ్యక్తుల ప్రవర్తన చిన్నప్పటినుంచి వారు పెరిగిన వాతావరణంమీద, వారి ప్రవృత్తిమీద ఆధారపడి వుంటుంది. ఈ విషయం తెలుసుకుంటే—ఆ దురభిప్రాయం పోతుందేమో.

స్త్రీ పురుషు లిరువురిలో— ఎవరూ—ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువఅన్నభావం పొడచూపేలా ప్రవర్తించకూడదు ఎప్పుడూ. ఇది చాలా ముఖ్యము. ఇది పాటించిననాడు వారి సంబంధబాంధవ్యం మరింత దృఢతరమై వుంటుంది. ఎవరి ప్రత్యేకతలు వారివి. పురుషుడు "అనాదినుంచి మా జాతి కొక విశిష్టత కొన్నతరము వున్నాయి. అంచేత స్త్రీకంటే నేనే ఎక్కువ" అని అనుకోకూడదు. ఈ తారతమ్యం ఎప్పుడు ఏర్పడిందో అప్పుడే ఒకరికొకరు దూరమయ్యారన్నమాట. "నువ్వు నాకంటే తక్కువదానవు. అంచేత నేను చెప్పినట్టులా విని పడుండాలి" అన్నట్లు పురుషుడు ప్రవర్తిస్తే, ఏ స్త్రీ సహించదు.. ఇది చాలు హృదయము గాయపడటానికి. తనను హేయంగా చూసిన వ్యక్తిమీద కోపం కలగటం సహజం. ఈ కోపం, కసి స్త్రీలో దాగివుంటాయి ఎప్పుడూ. పురుషుడు అహంభావంతో దౌర్జన్యం ప్రకటించి బాధిస్తే, స్త్రీ మాయోపాయంచేత— అంటే, కుటుంబంలోని అనేక విషయాలు అనర్థాలుగా పరిణమించేలా రూపకల్పన చేసో, లేక మరొకవిధంగానో—అంతటి చిత్రవధ చేస్తుంది, మానసికంగా. స్త్రీకి తెలిసిన మాయోపాయాలు పురుషుడికి తెలియవు. పురుషుడు కనులకు కనిపించేవి, భౌతిక విషయాలుతప్ప యితరత్రా ఏమీ ఆలోచించలేడు; ఇటువంటి విషయాలలో. తను ఎవర్ని అయితే అణచివుంచానని భ్రమపడతాడో, ఆ స్త్రీమూలానే తనకు మనశ్శాంతి వుండుటలేదని గుర్తించలేడు పురుషుడు. చిత్రమేమిటంటే పురుషుడు, అందరకూ తెలిసేలా ఆమెను హింసిస్తే, స్త్రీ, ఎవరికీ తెలీని విధంగా ( కనీసం అతనికికూడా తనవల్లనేనని తెలీకుండా ) అతన్ని బాధపెడుతుంది.

మరొక్కవిషయం: పురుషుడి అహంకారం చూసే—ఆ కోపంతోనూ, కసితోనూ— కాస్త గడ్డుగుణంగల స్త్రీ, కొంచెం మెత్తని అమాయకుడైన వ్యక్తి భర్తగా లభిస్తే అంతగానూ వంచిస్తుంది. 'ఎప్పుడూ ఇంతేలో హిరోయిన్ హిరో గార్ని చూసేవిధంగా చూస్తుంది. అతన్ని కీలుబొమ్మలా తయారుచేస్తుంది. ఆ సంసారాన్ని చూసి అందరూ హేళన చేసినా ఆమె ఏమీ చలించదు. చూపరులకు ఇది జుగుప్సాకరంగానే ఉంటుంది. కాని, ఎవరు ఏంచెప్పినా ఆమె వసేమీ వినదు.

పురుషుని అహంకారపూరితమైన స్వభావం ఆ స్త్రీమీద అటువంటి ప్రభావం చూపిస్తే ఈరకం స్త్రీ జీవనపద్ధతి యిలా ఉంటుంది.

ఎందుకొచ్చిన కావేశాలు యివి?

స్త్రీ పురుషు లిరువురూ సఖ్యతతో మెలిగితే ఎంత బావుంటుంది!

* * *

అసలు వైవాహిక బంధం అనేది ఎందుకు ఏర్పరిచారు? ఆదిమ మానవునికి సంబంధబాంధవ్యాలనేవేవీ వుండేవి కావు. ఆ తరువాత రానురాను మేధస్సు పెరిగి తెలివితేటలు మితిమీరినయ్. నాగరికత మానవునిలో ఎన్నో మార్పులు తెచ్చింది.

మానవుడు ఒంటరిగా పుట్టినప్పటికీ, ఒంటరి బాటసారిగానే వుండిపోలేడు. ఎవరో ఒకరు తోడు కావాలి. జీవిత బాటలో ఎందరెందరో తారసపడుతుంటారుగాని గమ్యం[illegible]కూ రారు. కలుస్తుంటారు; విడిపోతుంటారు. చివరివరకూ ఒకరైనా తోడువుంటే జీవితయాత్ర సాగించటం అట్టే భారమనిపించదు. అదీగాక ఒకరి కష్టసుఖాల్ని ఒకరు పంచుకొనటం, సానుభూతి చూపించుకొనటం— యిల్లాంటివాటిల్లో ఎంతో అందమూ, ఆనందమూ వుంటుంది. ఇది గుర్తించాడు మానవుడు. ఒకజాతి వారి మధ్యకలిగే ఆకర్షణకంటే స్త్రీపురుషుల మధ్యనుండే ఆకర్షణ బలీయమైంది. ఎందుకనంటే స్త్రీపురుషులమధ్య ప్రకృతిసిద్ధమైన పరస్పర ఆకర్షణవుంటుంది కనుక. అందుకనే వివాహమనేది ఏర్పరచివుంచారు.

గౌరవం యిచ్చిపుచ్చుకోమన్నారు విజ్ఞులు. ఇది భర్తలు భార్యల పట్లకూడా పాటిస్తే ఏ చిక్కులూ వుండవు.

"భర్తకు యిష్టములేని అలవాట్లు భార్య మానుకోవాలి. స్త్రీ ఇటువంటి త్యాగాలు చెయ్యాలి" అన్నారు, ఆ వ్యాసంలో. ఎందుకని! స్త్రీకి యిష్టం లేని అలవాట్లు భర్త ఏమైనా మానతాడా? మానమనే కనక భార్య అంటే "నా యిష్టం. నేను మానను. ఎలాగైతేనేం? నువ్వొక్కదానవు వచ్చావని నాకిష్టమైన అలవాట్లు అన్నీ మానుకోవాలా?" అంటూ హేళనగా నవ్వుతాడు కద! మరి యిది ఎవ్వరూ పట్టించుకోరే "ఎవరి అలవాట్లు వారివి. అందులో నేను కల్పించుకోవటం దేనికి?" అని సరిపుచ్చుకోగూడదూ యిరువురూ. లేకపోతే త్యాగం చెయ్యవలసివస్తే ఒకరికోసం ఒకరు కాస్తకాస్త త్యాగం చేసుకోకూడదూ యిద్దరూ!

పూర్వపు హైందవ స్త్రీకి ఉన్న లక్షణాలు ఈనాటిస్త్రీలో మచ్చుకు ఒకటైనా కనిపించటంలేదని కొందరు వాపోతుంటారు. పురుషుల్లో అనాటి భీష్ముడు వంటివాళ్లూ లేరు; స్త్రీలలో అనాటి అనసూయలాంటివారూ లేరు. దేశకాల పరిస్థితులనుబట్టి మనుష్యులు మారతారన్నది నిజం. అంచేత ఈనాటి స్త్రీ బానిసలా పడుండలేరు. కనక, ఎవరి పరిధులలో వారు ఉంటూ[illegible] హద్దులను వారు పాటిస్తూ, [illegible]కరి ఆశయా[illegible]లకు మరొకరు దోహదంచేయటానికి ప్రయత్నిస్తే మంచిది; బాగుంటుంది కూడాను.

కొందరు పురుషులు స్త్రీలను సహృదయంతో చూస్తారు. చూడనివారిగురించే నేను పైన వ్రాశాను.

రెండు హృదయాల పొందిక వివాహము. దాంపత్య జీవితములో మంచి స్నేహపు ఛాయలు పడాలిగాని మలినపు మరకలుమాత్రం పడకూడదు.

ఒక మధుర గీతంలాంటిది వివాహము. ఆ గానంలో అపశ్రుతులు ఏమాత్రం ఉండకూడదు. ★





## శ్రమ తీర్చుకోండి ఒక గ్లాసుతో

# కిసాన్ స్క్వాష

ఎంతో రుచికరము, ఎంతో ఆనందకరము, ఎంతో పుష్టికరము. ఎండబారి చెట్టున పండిన పండ్లతో తయారవటంచేత విటమినులు పుష్కలంగా ఉంటాయి. అనుకోకుండా వచ్చే చుట్టాలకోసం అదనంగా ఒకసీసా ఉంచుకోండి.

*కిసాన్ స్క్వాష్ నారింజ, నిమ్మ ఇంకా ఆరు ఇతర రకాలలో లభిస్తుంది.*

కిసాన్ (ప్రోడక్ట్సు) లిమిటెడ్, బెంగుళూరు

PWT/KP/1824

# నూపిన్

NUPIN

# మార్గ్యూఎన్టమ్

నీమ్ క్రీమ్

దురదలు, పొంటిమలు, స్ఫోటకపు మచ్చలు, కురుపులు, గాయములు, పుండ్లు, మొ. వాటికి

Marguentum

SOOTHING ANTISEPTIC NEEM CREAM

CP-37L-62

దక్షిణ ఇండియా ఆఫీసు 5/149 బ్రాడ్వే, మద్రాసు-1.



సిలువముందు కూర్చున్న క్లాడియాకు 'అతడే క్రీస్తు' అని లూసియస్ అనటం విన్పించింది.

**సినిమాకథ :**

# కింగ్ ఆఫ్ కింగ్స్

## జరిగినకథ

రోమన్ సైనికులు జెరూసలేంను ఆక్రమించినకాలంలో జోసెఫ్, అతడి భార్య మేరీ బెత్లెహాం చేరారు. మేరీకి గుర్రాల శాలలో జీసస్ జన్మిస్తాడు. ఆ శిశువును సంహరించేందుకు జెరూసలేం రాజా హీరాడ్ ప్రయత్నించగా జోసెఫ్ మేరీలు ఈజిప్టుకు పారిపోయి, అంటిపస్ రాజ్యానికి వచ్చాక జెరూసలెంకు తిరిగివస్తారు.

రోమన్‌లను విప్లవవాదు లెదిర్చి ఓడిపోతారు. ఆత్మప్రబోధం వల్ల జీసస్ ఎడారి ప్రాంతాలలో గడిపి వస్తాడు. సలోమి, హీరాడియాలు తమ పాపాలను ఏకరువుపెడుతున్న బాప్టిస్టు జాన్ తల తీయిస్తారు. జీసస్ అనేక అద్భుత కృత్యాలుచేస్తాడు. గెలీలీ కొండలలో జీసస్ చేసిన ఉపన్యాసం చాలామందిని నిరాశతో నింపుతుంది. కాబత్ పండుగనాడు నగరంలో రోమన్‌లపై దెబ్బతీయాలని విప్లవకారుడు బరబ్బాస్ ప్రయత్నించి ఓడిపోతాడు. జూడాస్ మోసంవల్ల జీసస్‌ను రోమనులు బంధించి విచారణ జరుపుతారు. లూసియాస్ జీసస్ పక్షాన పాంటియస్ పిలేట్ ముందర వాదిస్తాడు.

"అలాగా! అయితే హీరాడ్ అంటిపాస్‌దగ్గరకు ఇతన్ని తీసుకు వెళ్ళండి!" తప్పుకోవాలనుకున్నాడేమో పాంటియస్ మరి.

జీసస్‌ను తను విచారణ చేయాలనగానే కంపించి పోయాడు హీరాడ్. తనను మానసికంగా దహింపచేయటానికి బాప్టిస్ట్ జానే ఈ రూపంలో వచ్చాడనుకున్నాడు. జీసస్‌కు శిక్ష విధించమని పాంటియస్ దగ్గరకు పంపించేశాడు.

లూసియస్ ఈవార్త తెచ్చిన సమయంలో పాంటియస్ ప్రాతర్భోజనం చేస్తున్నాడు. అంటిపాస్ ఇలా ఆజ్ఞాపించాడు: "ఏమైనా చెయ్యండి. అతన్నిమాట్లాడి తప్పు ఒప్పుకునేలా చెయ్యండి అందరు మనుష్యులకన్న భిన్నంగా ప్రవర్తిస్తూ ఎవరూ ఒప్పుకోని సిద్ధాంతాన్ని ప్రచారం చేయటమే అతని నేరం!" ఈమాటలు వింటూ ప్రక్కనున్న క్లాడియా ముఖంలో అశ్రుకణాలు చిందులాడటం చూశాడు పాంటియస్. మనస్సులో ఏమనుకున్నాడో ఏమో! "సీజరు కుమార్తెనే కదిలించగల వ్యక్తి నిజంగా ప్రమాదకరమైనవాడే!" అన్నాడు.

ఆరోజు రాత్రి జూడాస్ చెరసాల వెలుపలగా చెవియొగ్గి వింటున్నాడు. చెరసాలలో జీసస్ శరీరంపై మోగుతున్న కొరడాల దెబ్బలు తనమీదనేపడ్డట్టు భావించుకు బాధపడుతున్నాడు. లోపల ఒక్కొక్క కొరడాచప్పుడుతో - దీనికి కారకుడవు నువ్వే అనేభావం విద్యుదాఘాతంలా ఒక్కొక్కమాటు గుండెను సూటిగా గుచ్చుకుపోతోంది. "ఈయనే తనను తానే రాజుగా ప్రకటించుకున్న పెద్దమనిషి" అని గేలిచేస్తూ నవ్వుతూ రోమన్ సైనికులు ముళ్ళకంచెతో కిరీటంచేసి జీసస్ తలకు గుచ్చటంకూడా కిటికీలోంచి చూశాక అతని మనస్సు విలవిల్లాడిపోయింది. ఆ దెబ్బలు, అరుపులు, హేళనలు వినిపించనంత దూరంగా- బహుశాశ్వతంగా వినిపించనంతదూరం చేరేందుకేమో - పరుగెత్తిపోయాడు.

చెరసాలలో వున్న బరబ్బాస్ కూడా అంతే అశాంతితో ఆరాత్రి గడిపాడు; అతనికితోడు ఇనప గొలుసులు, ఇద్దరు బందిపోటు దొంగలూ! ఇద్దరూ తెల్లవారితే బతుకు తెల్లవార్చుకోవాల్సిన వాళ్ళే. అప్పుడే తెలతెలవారు

—45వ పేజీ చూడండి

# పోలి క్షేత్రాలు

గణపతి శాస్త్రి

## జరిగిన కథ

విజయనగరంలో శృంగారమంజరి రెండవ కుమార్తె హేమసుందరి. ఒక అర్ధరాత్రి ఆమెను కలుసుకొనవచ్చిన రంగనాయకుడు, కావలివారిని గాయపరిచి పోతాడు. గజదొంగ అనుకుంటారు నగరవాసులు. తలారి వేశ్యమాతతో పాటు కుమార్తెల నిద్దరను దొంగతనం సంగతి విచారిస్తాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం తిరుమలరెడ్డికి చెబుతుంది. అతను కోడెకాడులా వెళ్లిపోతాడు. గోపాలయ్య ఎంత చెప్పిన వినక రంగనాయకుడు, హేమసుందరి కోసం ఆలయగోపురంమీదకిపోయి సింహాచలాన్ని ఎదుర్కొంటాడు. ఆ గోపాలయ్య సాయంతో యింటికి చేరుకుంటాడు. రంగనాయకుని మూలంగా అతని తల్లిదండ్రుల మధ్య కలతలు రేగుతాయి. తిరుమలరెడ్డి తనకు తలపెట్టిన ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ-రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేయాలని సంకల్పించుకుంటుంది.

## 11

రంగనాయకుని ఆరోగ్యం క్రమక్రమంగా కుదుటపడింది. అతని ఒంటిమీది గాయాలన్నీ పూర్తిగా మానిపోయాయి. లక్ష్మీదేవమ్మ కుమారుని కనేక విధాల పరిచర్య చేసింది. అంతేగాని వెంకటనాయకుడిక కొడుకుగాడనే పట్టించుకోలేదు. అప్పుడప్పుడు పెద్దకుమారుల నడిగి కొంచెం మాచాయగా అతని సంగతి తెలుసుకొన్నాడు. ఎప్పుడు గదిలోకి వెళ్లి పలకరించలేదు. అన్నలిద్దరుమాత్రం అతని నెంతో ఆప్యాయంగా ఆదరించారు. కాని దగ్గర కొంచెంసేపుండడానికయినా వారికేమాత్రము తీరిక చిక్కలేదు! ఇద్దరికి పొద్దస్తమానము పొలం పనితోనే సరిపోయేది. భోజనాలవేళమాత్రమే ఇంటికి తిరిగివచ్చేవారు. అందుచేత కొంచెం లేచి అటుఇటు తిరిగేదాకా రంగనాయకుని కేవిధంగాను కాలక్షేపంకాలేదు. వెంకటనాయకుడు పొలంవెళ్లిన అదును కనిపెట్టి, గోపాలయ్య ఒకటిరెండు సారులు చుట్టపుచూపుగా వచ్చి పలకరించి వెళ్లిపోయాడు. అంతేగాని ఆట్టేసేపు కూర్చుని మాట్లాడలేదు.

నాలుగయిదు రోజులు గడిచినతరువాత తండ్రిధోరణి కొంతవరకయినా మారవచ్చునని రంగనాయకుడాశించాడు. కాని రవంతయినా మార్పు కనబడలేదు! ఆపైన లక్ష్మీదేవమ్మ రెండుమూడు సార్లు చెప్పిచూసింది. అయినా ప్రయోజనం కలగలేదు! రంగనాయకుని కా పరిస్థితిలో ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు. క్రమక్రమంగా జీవితంమీదే విపరీతమయిన విరక్తి కలిగింది. తన దురదృష్టాల కన్నిటికి తిరుమలరెడ్డి ఒక్కడే ప్రధాన కారణమని నిశ్చయించుకొన్నాడు. అతడు చేయించిన దుష్కృ

త్యానికి ఎప్పటికయినా తగిన శాస్తి చేసి తీరాలని సంకల్పించుకొన్నాడు.

ఇటీవల అతనికి హేమసుందరిని గురించిన వర్తమానాలేవీ తెలియలేదు. మరి భరించలేక ఒకనాటి సాయంకాలం స్వామిదర్శనంకోసం వెడుతున్నానని తల్లితోచెప్పి గోపాల దేవాలయంవైపు సాగిపోయాడు. తీర్థప్రసాదాలు తీసుకున్నతరవాత 'ఒక సారి గోపురంమీది కిపోదామా' అన్నసంకల్పం కలిగింది. అయితే, తీరా గోపురంమీదికి వెళ్లినతరువాత హేమసుందరి కనబడకపోతే! మున్ముందుగా నాంచారమ్మద్వారా కబురుపంపించనప్పుడు ఆమె తప్పక మేడమీదికి వచ్చి నిలబడగలదన్న నమ్మకమేమిటి? ఇక ధనుర్బాణాలతో రాకపోవడంవల్ల ధ్వజస్తంభం గంటల గణగణల సంకేతాని కిప్పుడవకాశమే లేదు! ఇక ఏమి చెయ్యాలి! అలాగ ఆలోచిస్తూ రంగనాయకుడు రెండుమూడు గడియలసేపు స్వామి పుష్కరిణి ఒడ్డున కూర్చున్నాడు.

అప్పటికి కొంచెం చీకటిపడింది. దేవాలయ గోపురాల దీపాల కాంతులు పైడిపూల తోరణాల వలె పుష్కరిణి తేటనీటిలో ప్రతిఫలించాయి. రంగనాయకుడు ఉసూరుమని నిట్టూర్చి తిరిగి త్వరగా ఇంటికి వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. కొంచెం ఆలస్యమయితే మళ్లీ ఇంటిదగ్గర పెద్ద రభస బయలుదేరవచ్చును! లేచి తొందరగా నాలుగయిదు అడుగులు వేశాడు. మళ్లీ వెనక్కితిరిగి 'పోనీ, ఒక సారి గోపురంమీదికి వెళ్లి చూస్తే! తలవనితలంపుగా హేమసుందరి కనబడుతుందేమో!' అనుకున్నాడు. కాని అంతలోనే కనుచూపుమేరలో నాంచారమ్మ కనిపించింది. తటాలున దగ్గిరికి వెళ్లి పలకరించాడు. ఆమె ఎంతో ఆశ్చర్యపడి 'మీకోసమే వెతుకుతున్నానుబాబూ!ఇపుడిప్పుడే మీరు ఇంటిదగ్గర బయలుదేరి ఇటువైపు వచ్చారని తెలిసింది.'అన్నది.

'ఏమిటి విశేషాలు నాంచారమ్మా! ఇందాకటినించి నిన్ను గురించే ఆలోచిస్తున్నాను. ఇంతలోనే నువ్వు కనిపించావు! ఈవేళ నేను ఎక్కనితొక్కి వచ్చినట్టున్నానే!' అన్నాడు రంగనాయకుడు. ఆమె మొట్టమొదట అతని ఆరోగ్యంసంగతి అడిగింది. తరువాత చల్లచల్లగా రెడ్డిఉంగరం వ్యవహారం బయటపెట్టింది.

'ఆఁ ఆఁ నిజమేనా?' అన్నాడు రంగనాయకుడు నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంతపడి.

'నిజంకాకపోతే ఇంత దూరం పనికట్టుకొని వచ్చి మీకిది చెబుతానా?'

రంగనాయకు డది విని లోలోపల భగ్గుమని ప్రజ్వలించాడు! కాని బాగా తమాయించుకొని హేమసుందరి సంగతి అడిగాడు. ఆమె దిగాలుపడి ఉసూరుమన్నది:

'ఏం చెప్పను! బాబూ! ఆ అమ్మ ఆనాటికానాటికి చిక్కి శల్యమయిపోతూంది. ఆపైన పులిమీద పుట్రలాగ ఈ ఉంగరం బెడద ఒకటి వచ్చిపడింది. ఒక్కసారి ఎక్కడయినా అతిరహస్యంగా కలుసుకుని మీతో మాట్లాడాలని వెంపరలాడుతూంది.'

''నేనుఅదే అనుకుంటున్నాను. కానిఎలాగ సాధ్యపడుతుంది?'

'రేపు దీపదీపాల వేళ హేమ మా ఇంటికి వస్తుంది. ఇంటిదగ్గర ఏదో సాకు చెప్పి తిన్నగా మీారక్కడికి రావచ్చును. ఏం మీ కిది వీలుపడుతుందా?'

రంగనాయకుడు రవంతసేపాలోచించాడు:

'నా మాటకేంగాని, ఆమె మీ ఇంటికి బయలు దేరుతున్నదని శృంగారమంజరిగాని, మాణిక్యవల్లి గాని పసికడితే కొంపమునిగిపోదూ?'

'దీనికి మీరేమీ భయపడకండి! రేపు శుక్ర వారం కాదూ! అమ్మవారి పూజకోసం వాళ్లిద్దరు రేపు సాయంత్రం ఇక్కడికి వస్తున్నారు. ఆపైన పవళింపుసేవ పూర్తిఅయ్యేవరకు మరి తిరిగిరారు గదా! మీ కిద్దరికి ఇంతకంటె మంచిఅవకాశం దొరకదు! కనకనే పొద్దుటినుంచి మీకోసం కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాను.'

'వెదకబోయిన తీగ కాళ్లకడ్డుపడినట్టుందే! సరే, అలాగే వస్తాను!' అన్నాడు రంగనాయకుడు చెక్కిళ్లపైవెల్లివిరిసిన సంతోషపారవశ్యంతో. అతని దగ్గిర సెలవుతీసుకొని నాంచారమ్మ శృంగార మంజరి భవంతివైపు వెళ్లిపోయింది.

ఉంగరం సంగతి విన్నప్పటినించి తిరుమల రెడ్డి దురాలోచన రంగనాయకునికి అమూలాగ్రంగా అవగతమయింది. ఇక అతడెలాటి దుస్సాహసానికయినా వెనుదీయడని బాగా భయపడ్డాడు. అందుచేత ఏమాత్రం ఆలస్యంచేసినా వ్యవహారం చెయ్యిదాటిపోగలదనీ, వెనువెంటనే ప్రతీకారం చేసితీరాలనీ నిశ్చయించుకొన్నాడు. అదే సమయంలో అతని తలపోత హేమసుందరివైపు తిరిగింది. ఆ తన్మయతతో మరికొంతసేపటివరకు రంగనాయకుని కిక బాహ్యప్రపంచ విషయమే జ్ఞప్తికి రాలేదు! దేవాలయంలో అంతట మారుమోగిన మంత్రధ్వనులతో మేళవించిన గంటల గణగణ ధ్వనులతోనే అప్పటి కొక జాముర్రాత్రి గడిచినదన్న విషయం తటాలున స్ఫురించింది! ఉలిక్కిపడి లేచి లోలోపల ఎంతో కంగారుపడుతూ తొందర తొందరగా ఇంటికి చేరుకొన్నాడు.

---

'పెళ్ళి చేసుకున్నారు కదా మీకేమైనా సుఖం లభించిందా?'

'ఓ ! అదివరకు, మా ఇంటి ద్వారబంధంలో పట్టేవాణ్ణి కాదు. ఇప్పుడు కిటికీలోనించే దూరి పోగల్గుతున్నాను.

పి. దుర్గాప్రసాద్ (మద్రాసు)

---

సరిగా అతడనుకొన్నట్టే జరిగింది! లోపల అడుగుపెట్టేసరికి తల్లిదండ్రులిద్దరు తనకోసమే తగాదాపడుతున్నారు! రంగనాయకుడు ఇంత సేపటివరకు ఇంటి కెందుకు రాలేదని తండ్రి గుగ్గిలం చల్లిన అగ్గిలా మండిపడుతున్నాడు! ఆ దురాగ్రహావేశం చల్లార్చవలెనని తల్లి శాయశక్తులా ప్రయత్నిస్తున్నది. అయినా తండ్రి అనుక్షణము రెచ్చిపోతున్నాడు. అదేసమయంలో కుమారుడు ఇంటిలో అడుగుపెట్టిన విషయం లక్ష్మిదేవమ్మ కనిపెట్టింది. ఎంతగా ప్రాణం విసిగినా బాగా ఓరిమి వహించి కొంచెం ప్రశాంత స్వరంతో ప్రతిమాలుకొన్నది:

'ఇదిగో! ఎందు కలాగ గొంతుచించుకుంటారు! ఇంతలోనే వాడింటికి రానేవచ్చాడు! గుమ్మంలో అడుగుపెట్టేసరికి ఇలాగ కాళ్లకింద నిప్పులుపోస్తే ఎలాగ? ఈమధ్యనేకదా కాస్త వాడటు ఇటు తిరుగుతున్నాడు? ఇలాగ దులిపివేస్తే బొత్తిగా బెంబేలుపడి ఇక ఇంటిముఖమే పట్టడంమానివేస్తే?'

'పోతే పోనీ! ఇలాంటి అప్రయోజకుడు ఎక్కడి కయినా పోతే అంతటితో నా శని విరగడయిపోతుంది! అమ్మయ్యా! అనుకుని నలుగురిలోను తల ఎత్తుకుని తిరుగుతాను! మొట్టమొదటినించి నీ మూలానే వా డిలాగ పాడయిపోయాడు! ఇలాగ మాటిమాటికి వెనకవేసుకువచ్చావంటే ఇక వాడికి పట్టపగ్గాలుంటాయా?'

తప్పంతా తనమీద నెట్టివేసేసరికి లక్ష్మిదేవమ్మ మరింతగా రెచ్చిపోయింది! ఆపైన ఆ దంపతు లిద్దరికిమధ్య పెద్దగొడవ చెలరేగింది! అయితే రంగనాయకుని అన్నలిద్దరు కలగజేసుకోవడంతో ఆ కలహం తాత్కాలికంగా కొంత వరకు ఉపశమించింది. లక్ష్మిదేవమ్మ అక్కడినించి కదిలి చాటుమాటుగా వంట ఇంటిలో రంగనాయకుని కింత అన్నం వడ్డించింది. భోజన సమయంలో తొణికిసలాడుతున్న గద్గదికతో ప్రతిమాలుకొన్నది:

'నాయనా! పొద్దస్తమానము అయినవాళ్లతోను, కానివాళ్లతోను కలిసి తిరక్కపోతే, పొలంలోకివెళ్లి కాస్త పని పాట చూసుకోరాదూ? పెండ్రాళ్లే ఇంటికి వస్తే నిన్ను ఎవరేమంటారు? ఊరువాడ కలిసి ఏకమై అనేక విధాల ఆడిపోసుకుంటున్నారే! ఎందుకు చెప్పు మన కింత రొష్టు?... కొంచెం నా మాట విను బాబూ!'

రంగనాయకుడు తల్లిమాటల కేవిధంగాను ప్రతిసమాధానం చెప్పలేదు! అంటీ అంటనట్టు రెండు మెతుకులు నోటపెట్టుకుని, ఆదరాబాదరాగా భోజనం ముగించుకొని పాన్పుమీద మేనువాల్చి పవ్వళించి కళ్లుమూసుకుని నిద్రపోవాలని అనుకొన్నాడు. కాని ఎంతగా ప్రయత్నించినా కంటికొక్క కునుకయినా పట్టలేదు! కిటికీలోనించి నలువైపుల వ్యాపించిన విశాలాకాశం పొక్కాత్కరించింది ! అప్పటికింకా వెన్నెల పొడకట్టలేదు ! సన్నసన్నగా కీచురాళ్ల ధ్వని వినిపించింది. ఆకాశంలో కృత్తిక అంగడిలో వేలాడగట్టిన ముత్యాల హారంలా తళతళలాడింది! దానివైపు చూడగానే రంగనాయకునికి హేమసుందరి మెడలో తరళి ప్పన్న రవ్వలహారం జ్ఞప్తికి వచ్చింది. వెనువెంటనే విశాలనేత్రయుగళి నెమ్మది అద్దంలో నిశ్చలమై నిలిచింది! అంతే! ఆపైన ఎంతసేపటికి కనుదోయి ముకుళించలేదు! తెల్లతెల్లవారేవేళమాత్రం అతని కొక చిన్న కోడి కునుకుపట్టింది.

ఆ మరునాడు రంగనాయకుడు అనుక్షణము ఎడతెగని హేమసుందరి తలపోతలతో తన్మయుడయినాడు. పొద్దున్నే పెద్దకుమారు లిద్దరితోను కలిసి వెంకటనాయకుడు పొలంవైపు వెళ్లిపోవడంవల్ల ఇక ఇంటిదగ్గర లక్ష్మిదేవమ్మ, రంగనాయకుడు మాత్రమే మిగిలారు! ఆ అదును

—[illegible]1 పేజి చూడండి



స్టేషనులో ఆగివున్న రైలుబండి కూతవేసు కుంటూ కదిలింది.

ఆ పెట్టెలోనికి ఎక్కిన శ్రీనివాసరావుగారు సామాన్లు సర్దుకున్నతర్వాత గ్రహించారు — అది స్పెషల్ కంపార్టుమెంటని.

కాలేజీ విద్యార్థులు 'ఎక్స్‌కర్షన్' కు వెళ్తున్నారు కాబోలు! పిల్లలతో నిండిఉన్నది ఆ పెట్టె.

శ్రీనివాసరావుగారిని 'ఇది స్పెషల్ కంపార్టుమెంటండీ !" అని ఒక కుర్రాడు మందలించి చట్టుగా మాట్లాడాడు.

శ్రీనివాసరావుగారు నవ్వారు—ఆయన జుట్టుతో పాటు పండ్లుగూడా తెల్లగా మెరిసాయి !

'బాబూ ! ఎక్కేముందు చూడలేదు. ప్రక్క స్టేషనులో దిగిపోతాను' అన్నారు ఆయన.

ఎవరో కుర్రాడు — 'ఫర్వాలేదు. మీ రొక్కరేగా కూర్చోండి' అన్నాడు. శ్రీనివాసరావుగారి హృదయం అతనిపట్ల కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. కళ్లజోడు తీసి పెట్టుకుని పేపరు చదవడంతో ఆయన మునిగిపోయారు.

కంపార్టుమెంటులోని కాలేజీ విద్యార్థులు —



పరదాకబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంతలో "బాబూ ! ధర్మం చేయండి" అని గుడ్డివాడు కర్ర సహాయంతో తడుముకుంటూ వారిముందుకు వచ్చాడు.

ఇద్దరు ముగ్గురు కుర్రాళ్లు విసుక్కున్నారు వాడ్ని చూసి—

"ఛీ—ఛీ—న్యూసెన్సు ఈ ఆడుక్కునేవాళ్ల తోటి — స్పెషల్గా ఈ గ్రుడ్డివాళ్లతోటి—అడుక్కున్నదిగాక మన కాళ్లే త్రొక్కిపోతారు" ఒక అధునాతన విద్యార్థి అన్న మాటలకు పెట్టెలోని అందరూ నవ్వారు.

శ్రీనివాసరావుగారు పేపరులోంచి తల ఎత్తి "ఇదిగో —బాబూ !" అంటూ పావలాకాసు జేబులోంచి తీసి గుడ్డివాడి పాత్రలో వేశారు. తడుముకుంటూ వచ్చి కాసు అందుకున్న ఆ గుడ్డివాడి ముఖాన్ని దగ్గర్నుంచి చూసారు ఆయన—ఎందుకో అది పరిచయమున్న ముఖంమాదిరి అన్పించింది ఆయనకు.

"—నేను ఏదో కథలో చదివాను—వీళ్ళు పుట్టు గుడ్డివాండ్లు కారట ! వీళ్ల తల్లులు భవిష్యత్తులో తమ పిల్లల బ్రతుకుతెరువుకోసం — కండ్లలో జిల్లేడుపాలు పిండి — గుడ్డివాండ్లలా చేస్తారట !" ఇంకొక కుర్రాడి మాటలను అందరూ ఆశ్చర్యంగా విన్నారు.

"నిజమేరా ! మా ఊళ్లో గుడ్డి పేరయ్య అనే వాడు ఉండేవాడు. వాడే చెబుతుంటాడు — తన తల్లే తనను గ్రుడ్డివాణ్ణి చేసిందని—ఇప్పుడు వాడు సుఖంగా బ్రతుకుతున్నాడు—" అని మరొక కుర్రాడు అందుకున్నాడు.

'గమ్మత్తయిన బ్రతుకుతెరువే!' అని శ్రీనివాసరావుగారి ప్రక్కన కూర్చున్నతను వ్యాఖ్యానించాడు—

మళ్లీ అందరూ నవ్వారు.

గుడ్డివాడిమీద చర్చ కాసేపు ఆగిపోయింది.

"బాబూ — ధర్మం" అని గుడ్డివాడు తన ఉనికిని మళ్లీ తెలియజేసాడు అందులోనివారికి—

శ్రీనివాసరావుగారిని కూర్చోమని చోటిచ్చిన విద్యార్థికి జాలివేసింది కాబోలు ! జేబిలోంచి రూపాయినోటు తీసి వాడి పాత్రలో వదిలి పెట్టాడు.

అక్కణ్ణించి వాడు కదిలి ఇంకొక విద్యార్థి ముందుకు తడుముకుంటూ వెళ్లి ధర్మం అడిగాడు.

'అందరికీ కలిసేనోయ్ — అతను వేసిన రూపాయి !' అని అతను జవాబిచ్చాడు. "అసలు నిజమైన గుడ్డేనా — నీకు" అని ఇంకొక అనుమానాలరాయుడు అడిగాడు.

'నిజమైందే' అన్నట్లుగా గుడ్డివాడు తలూపాడు.

"పుట్టుగుడ్డివా ?" అని మరొకడు ప్రశ్నించాడు.

'కాదు బాబూ !' అని వాడు జవాబిచ్చాడు.

సంస్కారమున్న మనిషిలా ఉన్నాడు వాడు — కుర్రవాండ్ల ప్రశ్నలకు విసుక్కోకుండా జవాబివ్వటం చూస్తుంటే శ్రీనివాసరావుగారికి జాలి కలిగింది వాడిమీద—అయినా గుడ్డివాడు విసుక్కొని మాత్రం ఏం చేయగలడు ?

'ఎట్లా పోయాయి నీ కండ్లు'—మళ్లీ ప్రశ్నలు మొదలయ్యాయి.

"నేను పూర్వజన్మలో చేసుకున్న పాపం బాబూ ! నా మిత్రుడికి తెలిసో—తెలియకనో చేసిన ద్రోహానికి ప్రతిఫలం ఇది—" అన్నాడు వాడు.

సంస్కారపూరితమైన వాడి మాటలకు అందరూ ఆకర్షింపబడ్డారు. కుర్రవాండ్లకు వాడి కళ్లు ఎలా పోయాయో తెలుసుకోవాలనే ఉత్సాహం బాగా ప్రబలి వాడి కథ చెప్పమని అందరూ బలవంతం చేసారు. గుడ్డివాడు తటపటాయించాడు.

'చెప్పు బాబూ !' అన్నాడు వక కుర్రాడు.

'మాక్కూడా కాలక్షేపం' ఇంకొకడు వంత పాడాడు.

శ్రీనివాసరావుగారి పేపరుపఠనం ఆగిపోయింది విస్మయంతో తలెత్తి వాడిని చూసారు.

గుడ్డివాడు చెప్పటం మొదలెట్టాడు.

* * *

"—బారుగా—పొడుగ్గా ఉన్న కట్టెపుల్లలనే కత్తులుగా ఎంచి యుద్ధం చేయటమంటే మాకు చెప్పలేనంత సరదా—అందుట్లో మేముండే ప్రదేశమంతా ఎత్తాటి చెట్లతో నిండిఉండేది — జట్లు జట్లుగా చెట్లమీదికి ఎక్కి బారుగాఉన్న కొమ్మలను వంచి నిడుపాటి పుల్లలను కొట్టి — కత్తుల్లా వాటిని తయారుచేసేవాళ్లం !

మా ఇంటివెనక పెరట్లో భావి గచ్చు ప్రక్కన — పిచ్చి మొక్కలన్నీ మొలిచి పెద్ద అడివిలా తయారయ్యింది. వాటిని ఆనుకునే ప్రహారీ గోడ ఉండేది. దానికి నిచ్చెన వేసి—గోడ అంచుల వరకూ వెళ్లిగూడా చివరకు సాహసోపేతమయిన యుద్ధాలు చేసేవాళ్లం — అంతకంటే ఆనందం అప్పట్లో ఇంకొకటి మాకు ఉండేదిగాదు.

నేనూ—మా శంకరంచెల్లెలు సీతా ఎప్పుడూ వక జట్టు — యుద్ధంఆట మొదలుపెట్టబోయే ముందే షరతులన్నీ చెప్పేసేవాడ్ని—నే నెప్పుడూ యుద్ధంలో ఓడిపోగూడదు — సీతకంటె నాకింకొకరి సహాయం అనవసరం. ఆపదలో ఎవరైనా చిక్కుకుంటే వారిని రక్షించటానికి కత్తియుద్ధం నేనే చేయాలి ! వీ టన్నిటికీ నా మిత్రులు ఒప్పుకునేవాండ్లు—ఎందుచేతనంటే అంతకంటే మంచి పెరడు వాళ్లెవరి ఇండ్లలోనూ లేదు. నన్ను కాదని వాళ్లు ఇంకొకచోట ఆడుకోటానికి—

షరతులను ఉల్లంఘించినవాడిని ఆటలోంచి

—38 వ పేజీ చూడండి





## చమత్కారాలూ!
## విట్ మిరియాలూ!!

కథలు రాయాలంటే
అప్పులు చేయడం నేర్చుకో
కార్టూన్ లే గీయాలంటే
వంట వండటం అలవర్చుకో!
విమర్శించాలంటే
దండగ చదవకు పుస్తకాలు
ఎన్నికల్లో నిలిస్తే
చచ్చినా చెప్పకు నిజాలు.
అబద్ధాలాడగా
అమ్మాయిలే అంతా పుడితే
అప్పులు చేసే అబ్బాయిల
కిచ్చేయ్, సుఖపెడ్తారు!
కాలక్షేపం కావాలంటే
అడుగు పక్కవాడి పేపరు
పరోపకారం చేద్దామంటే
కొను రైల్లో సొంతంగా పేపరు!
కవిత్వమే చెబుదా
మనుకుంటే చదివిందేదో మర్చిపో
వేషమే కడదా
మనుకుంటే 'ప్రజాసేవనే ఎంచుకో!

—కృష్ణానంద్.

*　*　*

## లంచ మహిమ

శంకించక నీవచ్చును,
గొంకక, లంచంబు, పుచ్చుకొనవచ్చును పో;
టెంకాయ లంచమీనిచో
వేంకటరమణుండు మటుకు వినునే మొరలన్.
మురిపించు కాన్కలీయక
తరళాక్షులు ప్రియులనైన దయజూడరు, చ-
క్కెర తాయిలంబు జూపక
దరి జేరరు పిల్లలైన దయతో పిలువన్.
వరమీయడు భగవంతుడు,
త్వరగా పని దేల్చబోరు ధర నధికారుల్,
తెరువీయరు బంట్రోతులు
చిరునగవున తమదు ముడుపు చెల్లించనిచో.
గురువర్యువద్ద, మార్కులు
కొరనైనచో లంచ మిచ్చి కొనవచ్చును పో;
పరిహాసమేల దానిని
గురుదక్షిణయనరె తర్కకోవిదులెల్లన్.
'లంచము' 'మామూల'ను నివి
కొంచెపు పేళ్ళనటంచు గుణనిధులెల్లన్
యోంచి మనంబున, నామం
బుంచిరి 'బహుమతి' యటంచు యోగ్యత మెరయన్.

పి. యస్. రంగారావు (భద్రాచలం)

*　*　*

## హామేషా – తమాషా

హామేషా – తమేషాగా
ఖులాసాగా దిలాసాగా
ఖుషీగా మజాగా
చిలుకా! కులుకా!
గాలిమేడలపైకి
మెట్టు లెక్కి పోదామా
ఆశల 'అంతస్థులోకి
లిఫ్ట్ లెక్కి వెళ్లుదామా
జోరుగా–హుషారుగా
షికారుగా–ఉషారుగా
ఆ స్కైని అంతరిక్షానికి



**రెక్కలతో ఎగురుదమా**

స్వర్గానికి సయితం
కలిసి మెలిసి ఇద్దరం,
మేరా డియర్ చిలుకా!
హాయిగా మనం కులుకా!!

బి. లక్ష్మీనరసింహారెడ్డి (గుంద్రాతిమర్రు)

* * *

## వరకట్న గానం

పదునారు వత్సరమ్ములె
గిద, పిల్లను తల్లిదండ్రి కాపాడుట, ఎన్—
బదినాల్గు వత్సరమ్ములు
వదలక కాపాడవలయు వరుడా వడతిన్,
బరువులు భారము లన్నియు
వరునకు తమ కన్నె నిచ్చి వదులుకొనెద, రా
బరువెల్ల వరునిపై బడు
వరకట్నము తీసుకొనగ వలదే విధిగా?
వరకట్న మెంత యిచ్చిన
సరిపోవును? వధువు, నామె సంతతి సాకన్
వరునకు బ్రతుకంతయు, మరి
వరకట్నము తీసుకొనగ వలదే విధిగా!
వరకట్నంబవగ వధూ—
వరు జీవితములకు పెట్టుబడివంటిదయా!
వరి క్రొత్త బ్రతుకు నడుపగ
వరకట్నము తీసుకొనగ వలదే విధిగా?
వరకట్నమె బహుమతియగు,
వరకట్నమె వరుని విలువ వసుధకు చాటున్,
వరకట్నమీయ యశమగు,
వరకట్నము వరున కీయవలదే విధిగా?
వరకట్నావశ్యకతల్
సరిగా నెరుగంగలేరి జనులెల్లరు, ఈ
వరకట్నమేల నందురు!
వరకట్నము వరున కీయవలదే విధిగా?

సి. యస్. రంగారావు (భద్రాచలం)

"అయ్యా! మీరు ఇన్నాళ్లూ అంతలేసి మీసాలు పెంచారే... ఇవాళ తీయించారేం?"

"ఏం చేస్తాను... మేనల్లుడు పుట్టాడు. వాడు పట్టుకుని ఊగు తాడే మోనని భయపడ్డాను."

శ్యామల (ఉయ్యూరు)

* * *

రావు: నిన్నెవరేనా కొండ మీదనుంచి తోసేస్తామని ఎత్తి పట్టుకుంటా రనుకో. ఏం చేస్తావు?

మూర్తి: కళ్ళు గట్టిగా మూసుకుంటాను.

ఉమాబాల (మైలాపూరు)

* * *

మన స్తత్వవేత్త అయిన ఒక డాక్టరువద్దకు ఇద్దరు పెద్దమను షులు-ఒకడు వస్తూ, ఒకడు వెళ్తూ తారసపడ్డారు.

ఒకడు: అయ్యా! మీరొస్తున్నారా, వెళ్తున్నారా?

మరొకడు: అది తెల్సుకుందామనే తాపత్రయం.'

కె. ఆర్. (మద్రాస్)



"అయ్యా! మీకు నిద్ర వస్తోందా? లేదన్నారుగా." నిద్ర రాక బాధపడుతూ వున్న శ్రీనివాసులుకు నౌకరు సలహా ఇచ్చాడు: "పోయి తెనుగు జానపదం చూడండి! నిన్న రాత్రి నేనా పనే చేశాను"

నాని (వాల్తేరు)★




"మళ్ళీ రేపు ఇనతాలో తిరిగి వచ్చేద్దాం!"

యజ్ఞం ఛద్ద అమ్ములపల్లి (బందరు)




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**14-9-1962 శుక్రవారము మొదలు**
**20-9-1962 గురువారము వరకు**

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం మీ గ్రహస్థితి అనుకూలంగా ఉన్నది. ముఖ్యవిషయాలపైన మీ నిర్ణయాలు చక్కగా లాభిస్తవి. ధైర్యంతో యధార్థం మాట్లాడ గలరు. వృత్తిలో సాటివారి సహాయంతోపాటు గౌరవం కూడా వృద్ధి అవుతుంది. సంఘంలో మీ పెద్దరికానికి భంగం కలిగించేవారు ఉంటారు. ఎప్పటికప్పుడు మీ రికార్డును, ముఖ్యమైన వస్తువులను భద్రపరచుకొంటూ ఉండటం అవసరం. మీ ఆదరాభిమానాలతోను, మాటలతోను అందరను సంతృప్తిపరచగలుగుతారు. స్థిరాస్తులకు సంబంధించి ఏ వ్యవహారమైనా ఈ సమయంలో లాభదాయకంగా జరుగుతుంది. దూరమందున్న స్నేహితుల వద్దనుంచి నిరుత్సాహంతో కూడిన వార్తలు తెలుస్తవి. శుభకార్యాలు నిరాటంకంగా నెరవేరుతవి. 16, 17. తేదులలో బంధు దర్శనం, వృత్తిలో అభివృద్ధి, ఇష్టవస్తుప్రాప్తి.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం ఇతరుల మాటలలోని అంతరార్థాన్ని తెలుసుకొని వ్యవహరించటం అవసరం అవుతుంది తగిన విశ్రాంతి, మనోధైర్యము లభిస్తవి. మీ నిత్యకృత్య కార్యక్రమాలలో ఇతరులమీద ఆధారపడటం అనేది క్రమంగా తగ్గుతుంది. వస్త్రాలు మొదలయిన విలువగల వస్తువులు కొంటారు. వృత్తిలో మీరు ముందు ఒప్పుకున్న బాధ్యతలను సకాలంలో పూర్తిచేయగలరు. ధన సంబంధమైన సర్దుబాట్లలో శ్రమమాత్రం ఉంటుంది. ప్రయాణాలు సంపూర్ణ ఫలితాన్ని ఈయజాలవు. అనవసరంగా ఇతరుల కీచులాటలలో చిక్కుకొనటం జరుగుతుంది. ఈ సమయంలో శక్తికి మించి ఖర్చు చేస్తున్నామనే విషయాన్ని గుర్తుఉంచుకొనండి. గత కాలంలోని కలహాలు పరిష్కారం అవుతవి. 18, 19 లలో కార్యసిద్ధి, విశేష ధనలాభం.

| గ్రహస్థితి |
|---|
| మిధునంలో అంగారకుడు, కర్కాటకంలో రాహువు, సింహ కన్యలలో సూర్యుడు, కన్యలో బుధుడు, తులలో శుక్రుడు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురుపు, కుంభ మీన మేష వృషభ మిధునాలలో చంద్రుడు. |

* * *

**మిధునం :**

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈ వారం కొంతవరకు సుఖం దక్కుతుంది. కార్యాన్ని మించిన ప్రయత్నాలు చేస్తూఉంటారు. కుటుంబంలో సంతోషంగా కాలం జరుగుతుంది. తలవనితలంపుగా ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఆస్తివృద్ధి ప్రయత్నాలు కలసి వస్తవి. మీ వృత్తిఉద్యోగాలలో తోటివారి కుతంత్రాలవల్ల కార్యభారం పెరుగుతుంది. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం కోసం ప్రస్తుతం తొందరపడటం మంచిదికాదు. మీ నేర్పువల్ల పరిస్థితులను గ్రహించుకొని గౌరవమును కాపాడుకొన గలుగుతారు. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. ధారాళంగా ధనం వచ్చి ఖర్చులవుతుంది. బంధువుల రాకపోకలు అధికం. ముఖ్యంగా మీరు చేస్తున్న పనులమీద మనస్సును నిలపలేకపోతూ ఉంటారు. వారాంతంలో దొంగతనంగా వస్తువులు పోయే అవకాశా లున్నవి. 15, 16 లలో గౌరవం, ఇష్టవస్తు లాభం.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)

మీ అంతస్తు పెరిగే సమయం. ధన విషయంలో గాని, వ్యవహార విషయాలలో గాని ప్రతిబంధకాలు ఉండవు. ప్రస్తుతం మీ సుఖాన్ని చూచుకొంటూ కార్యరంగంలో దిగటం అవసరం. విద్యారంగంలో బుద్ధి వికాసవంతంగా ఉంటుంది. వృత్తిలో శ్రమ అధికంగా ఉంటుంది. దైవ కార్యాలు సంతృప్తికరంగా జరుగుతవి. ధన సంబంధమైన లావాదేవీలలో మీ మాట తొందరవల్ల భారం మీపైన పడే అవకాశా లున్నవి. వారం రెండవ భాగంలో స్నేహితులు నిష్కపటంగా ప్రవర్తించకపోవటంవల్ల కొంచెం ఇబ్బంది కలుగుతుంది. క్రొత్తవారితో స్నేహం లభిస్తుంది. కాని నిరుత్సాహంతోస్తుంది. 19, 20 లలో దుబారా ఖర్చు, వృధాశ్రమ.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఏ కార్యం తలపెట్టినా ప్రశాంతంగా నెరవేర్చుకొన గలుగుతారు. మనశ్శాంతి లభిస్తుంది. అనేక సందర్భాలలో ఇతరులకు ఉపకారం చేయగలుగుతారు. వృత్తిలో పెద్ద మార్పులు ఏమీ ఉండవు. కాని, మీ శ్రమకు తగిన ఫలితము, గౌరవము లభిస్తవి. వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. ముందుముందు చేయబోవు పనులను గురించి

ఆలోచిస్తూ ఉంటారు. గౌరవప్రదమైన మనుష్యుల స్నేహం లభిస్తుంది. వ్యవహార నిర్ణయాలు చేయటంలో జాగ్రత్తపడగలుగుతారు. ఇంతకు ముందు ఆందోళన కలిగించినవారే ఈ సమయంలో మీ మార్గాన్ని అనుసరిస్తారు. సంఘ కార్యాలలో అపవాదులు రానున్నట్లు తోస్తూ ఉంటుంది. గ్రహబలంవల్ల అపకారం జరుగదు. 16, 17 లలో ధనలాభం, శుభవార్తలు.

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

పట్టుబడితే కాని పనులుకాని సమయం. మొదట మీ మాటకు ఎవ్వరూ సమ్మతించరు. క్రమ క్రమంగా మీ విలువ పెరుగుతుంది. గౌరవంతో కూడిన ఖర్చులు. రాజకీయాలలో కార్యరూపంతో ఉపయోగం తక్కువ. అయితే పదిమందిలో ఆడంబరము, గౌరవ సూచనలు బాగుంటవి. తరచు ప్రయాణాలు చేయవలసి రావచ్చు. వృత్తిలో అవతలివారి మాటను లెక్కపెట్టకుండా మీ అవకాశాలను బట్టి మీరు నడచుకొనవలసిన సమయం. మీక్రింద పనిచేసేవారు మీ అజాగ్రత్తకోసం ఎదురుచూస్తూ ఉంటారు. మొహమాటం కోసం కార్యభారం పైన వేసుకొని శ్రమపడవలసి వస్తుంది. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సకాలంలో వస్తుంది. 18, 19 తేదులలో బంధుమిత్రులవల్ల కార్యసిద్ధి, వృత్తిలో లాభవార్తలు.

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ఈ వారం మీ వృత్తివ్యాపారాలలో ఉత్సాహం కనిపిస్తుంది. ఎప్పటి పనులు అప్పుడే తెమిలిపోతూ ఉండటంవల్ల సుఖము, సంతోషము లభిస్తవి. ఇతరులవలన మోసంజరిగే అవకాశాలు తొలగిపోతవి. ఉత్తర ప్రత్యుత్తరాలలో మాటతొందరవల్ల, బంధువులవల్ల మాటపడవలసి వస్తుంది. వివరం తెలుసుకోకుండా ఆరంభించిన పనులు మీ మనస్సును చికాకు పరుస్తవి. సంఘ కార్యాలలో మీ స్థితి బాగుంటుంది. కుటుంబంలో తరచు ఉద్రేకపూరిత వాతావరణం కనిపిస్తూ ఉంటుంది. ఈ సమయంలో వ్యవహార వ్యాపార రంగాలలో ప్రతిబంధకాలు లేకుండా ముందుకు పోగలుగుతారు. అతివినయంతో మాట్లాడేవారిని గురించి జాగ్రత్తగా ఉండండి. 19, 20 తేదులలో విసుగును కలిగించే పనులు, స్వల్ప ఆదాయం.

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

బాధ్యతాయుతమైన పనులు, ఎదటివారిని సంతృప్తిపరచటం నిమిత్తం శ్రమ అధిక మవుతవి. ఈ సమయంలో మీ కష్టసుఖాలను గురించి ఆలోచించేవారు తక్కువ. ఆదాయం బాగుంటుంది. దూరమందున్న బంధువుల వద్దనుంచి శుభ సంతోషవార్తలు తెలుస్తవి. క్రమక్రమంగా కార్యభారం ఇతరులకు వప్పగించి విశ్రాంతిగా ఉండగలుగుతారు. స్థిరాస్తులపైన డబ్బును వినియోగించటంవంటి పనులు అనుకూలిస్తవి. వృత్తిఉద్యోగాలలో మీ ఆలోచనలు సాఫీగా ముందుకు సాగకుండా మధ్యలో మెలికపడే అవకాశాలున్నవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండదు. సంఘంలో కీర్తిప్రతిష్ఠలు పెరుగుతవి. 15, 16 లలో మిత్రలాభం, శుభకార్య ప్రయత్నాలు.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ సమయంలో మధ్య మధ్య ఎన్ని అవాంతరాలు ఏర్పడినా చివరకు కార్యానుకూలత ఉంటుంది. వృత్తిలో అదృష్టం కలిసి రాగల సమయం. అయితే మనశ్శాంతి మాత్రం తగ్గుతూ ఉంటుంది. గడచిన విషయాలను తిరగతోడుకొనటంవల్ల వివాదాలు పెరిగే అవకాశాలున్నవి. నౌకరులవల్ల కార్యసిద్ధి, ధనలాభము బాగుంటవి. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. మీ అంచనాకు మించి ఖర్చు చేయవలసివచ్చినా దైవానుగ్రహంవల్ల సమయానికి ఆదుకొనే స్నేహితులు లభిస్తారు. ప్రస్తుతం ఇతరులకు సహాయం చేయటంవంటి పనులను తగ్గించుకొనటం మంచిది. వారాంతంలో మీ ఆరోగ్యం తగ్గుతుంది. ధైర్య సాహసాలతో జయం సాధించుకొన గలుగుతారు. 19, 20 తేదులలో అయినవారితో అభిప్రాయ భేదాలు, ఆదాయ వృద్ధి.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ప్రస్తుతం మీ మనోదార్ఢ్యం తగ్గే అవకాశాలున్నవి. తగినంత ప్రత్యక్ష కారణాలు ఏమీ ఉండవు. స్వల్పవిషయాన్ని కూడా పెద్దదిగా భావించి సందేహపడుతూంటారు. అధికారులవల్ల చిక్కులేకుండా మీ పనులు నెరవేరుతవి. క్రొత్త వ్యాపారాలవంటి అవకాశాలు కలిసివస్తవి. అయితే ఇతరుల నిమిత్తం ధనవ్యయం చేయవలసిన అవసరాలను తగ్గించుకొనటం మంచిది. పిల్లల ఆరోగ్యాది విషయాలలో సంతృప్తికరంగా ఉంటుంది. బంధువులవద్దనుంచి సంతోషవార్తలు తెలుస్తవి. ఆదాయం గతవారంకన్నా కొంచెం తగ్గే అవకాశాలున్నవి. కుటుంబంలో పుణ్యకార్యాలు జరుగుతవి. వృత్తికి సంబంధించిన వార్తలు ఆలస్యంగా అందుతవి. 16, 17 లలో ఇష్టవస్తు లాభం, స్నేహితులవల్ల కార్యసిద్ధి.

* * *

## ఈ వారము ధరలు

బంగారు ధర కొంచెం మందీ వచ్చి నిలుస్తుంది. వెండి ధర గతవారం మాదిరిగానే ఉంటుంది. ప్రత్తి ధర బాగా పెరిగి తగ్గ తగిన సూచన లున్నవి. పసుపు ధర క్రమంగా మందీ అవుతుంది. వేరుశనగ పప్పు ధర వారం మొదటి భాగంలో మందీ వస్తుంది. వేరుశనగ నూనె ధర కొద్దిగా పెరిగే అవకాశాలున్నవి. శనగలకు గిరాకీ తగులుతుంది.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

మంచి పేరుతోబాటు అభివృద్ధిని సాధించుకొంటారు. ఆదాయం బాగా పెరుగుతుంది. సాహసంతో మీ ప్రయత్నాలు అనుకూలిస్తవి. ఇతరులకు సంబంధించిన వ్యవహారాలలో శ్రమ పెరుగుతుంది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. ఇంతకుముందు అందక నిలిచిపోయిన ఫలితం ఈ సమయంలో చేతికి వస్తుంది. ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో వచ్చి సంతృప్తికరమైన ఫలితాన్ని ఇస్తవి. వృత్తిఉద్యోగాలలో చిన్న చిన్న వివాదాలు వచ్చి చివరకు మీ మాట నెగ్గుతుంది. ఈ సమయంలో కలిగే అనుభవంవల్ల అనేక రహస్యాలు తెలుసుకొనగలుగుతారు. ధనాదాయం విషయంలో ఆటంకాలు తొలగుతవి. సంఘంలో పదిమంది దగ్గర ఆదరము, విశ్వాసము సంపాదించ గలుగుతారు. 17, 18 లలో కార్యభారం, అధికారులవల్ల శ్రమ.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ఒక పనికి మరొక పని అడ్డువస్తూ ఉండటంవల్ల ప్రస్తుతం కొంత చిక్కు పడవలసి వస్తుంది. అందరూ ఒక్క పద్ధతిలో ఉండకపోవటంవల్ల దుబారా ఖర్చు పెరుగుతుంది. అధికారులతో సంప్రదింపులు ముందు నిరుత్సాహకరంగా ఉన్నా, క్రమంగా అనుకూలిస్తవి. బంధుమిత్రుల ఇండ్లకు ప్రయాణం చేయవలసి వస్తుంది. వాహనాలు ఎక్కటం, ఆయుధాలను వినియోగించవలసిన పనులు మొదలయిన వాటిలో జాగ్రత్తగా యుండటం అవసరం. కుటుంబంలో శుభ సూచనలు కనుపిస్తవి. విలువగల వస్తువులు ఇతరులకు ఇచ్చేముందు జాగ్రత్తగా ఆలోచించటం మంచిది. స్వతంత్రంగా మాట్లాడటంవల్ల ఎదటివారికి కోపతాపాలు రాగల అవకాశా లున్నవి. 

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.**




కుటుంబంలో అందరి బట్టలను ఇంట్లో ఉతకండి ... షర్టులు, రవికెలు, చీరలు, పిల్లల దుస్తులు, తువ్వాళ్లు, ప్రతి బట్టనూ! కుటుంబంలో అందరి బట్టలనూ సర్ఫ్‌తో ఉతకండి. సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తివల్ల ఫలితంగా మీ బట్టలు అమిత తెల్లగాను పరిశుభ్రంగాను వుంటాయి. నేడే సర్ఫ్‌వాడి చూడండి! అది బట్టలను ఇంట్లో ఉతుక్కొనే అత్యుత్తమ విధానం.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి. SU. 24 X52 TL

# సరాగమాల

వి ఎ కె రంగారావు

## రికార్డుల రివ్యూ

### వారసత్వం: ఎన్. 69736

వెన్నెలదొంగ కృష్ణునిమీదనే మరొకపాట. ఈపాట వెలువడినది తమ చిన్నారి పాటజాడలో ఆ నల్లనివాని నీడజూచి ఇటు పురుషార్థమూ అటు పుణ్యమూ సంపాదించుకొని సార్థకజీవులైన ఒక దంపతుల జంటనోట.

"చిలిపికృష్ణునితోటి చేసేవుపోటి
అసామితో నీవు అన్నింటసాటి".

ఆపాటి ఎందెందు: "చెరసాలలో పుట్టి వ్రేపల్లెలో వెలసి, గొల్లవల్లులమనసు కొల్లగొని" నందులో. ఈ సాహిత్యం నార్లచిరంజీవిది. ఇందులో పాండితీప్రకర్షకనువైన జటిల సంస్కృత సమాసాలు లేవు. స్వపరిజ్ఞానాన్ని చాటుకొనే పద సమూహాలు ఇందులో ముచ్చుకైనా కనరావు. ప్రతిచరణమూ "పాలకడలివంటి 'కననవనమును' తరచినవేళ వెలసిన అమృతకలశి." పాట బంగారు కలువలు చిక్కగా విరిసిన అమలసరసి. దీనికి ఘంటసాల కూర్చినది రాగముకాదు. పారిజాతపరీమళ భరితమైన వాత్సల్యానురాగము. పాడినది లీల, ఘంటసాల. కాదుకాదు. అది పాడినవేళ నిత్యము మనోనేత్రమందు ఆ కృష్ణుని గాంచినవారి గాత్రలీల. వీటన్నిటికితోడు మలయసమీరసమానమై మురళిప్రధానమైన వాద్యరచన. హాయికి మారుపేరు ఈ అనుభవమే.

రెండవప్రక్కనున్న పాట అర్థము వింతగానున్నది. ఆ సినిమా చూసినగాని ఆచిక్కు విడదని తోస్తున్నది. వినుటలోనే అర్థమయినది ఇంతవరకే. భార్యాభర్తలు విడిపోతారు. తమశిశువును పోగొట్టుకుంటారు. ఆపాప మరొకస్త్రీకి దొరికితే అల్లారుముద్దుగా ఆమె చూచుకుంటుంది. సాహిత్యం పై దానివలెనే 'సులిద'' ద్రాక్షాపాకం. సుశీల ఘంటసాల స్వనసమ్మేళనం, మొదటనున్న చరణానికి తక్కినవాటికి గతిభేదం చక్కగా అమరినవి.

### ఫూల్ ఔర్ కలియాం యన్. 53755

"మన్‌రే మత్‌రో, కల్ ఆయెగా తేరా సబేరా" అని పాడుతుంది మధురా శాంతారాం. "మనసా విచారించకు. నీవు కోరే ప్రభాతం రేపు ప్రభవిస్తుంది" అని పాట సారాంశం. ఈ పాటకు సంగీతదర్శకులు శివ్‌రామ్. ఇంతకుముందు "రఫ్తార్", "సురంగ్", "సతీ అనసూయ" మొదలగు హిందీచిత్రాలకు పనిచేశారు. తెలుగు "సతీ అనసూయ"లో వినిపించిందే "సానేల మధుర సానేల కాశి" అన్న పాట. దాని వరస పిరిదే. ఈ పాట పాడిన మధుర, శాంతారామ్ కూతురు. ఆమె కంఠంలో చెప్పుకోదగ్గ పాండిత్యం లేదు కాని అదొకవిధమైన ఆకర్షణ ఉంది. బేహాగ్ రాగంలో ఉన్న ఈ భజన నిరాశాంధకారాన ఉన్నవారికి నిర్మల జ్యోతి. మనోవ్యథతో క్రూన్పడినవారికి సదమల మణిద్యుతి. సంగీతప్రియులకు సంగీతరత్నాకర సార సంగ్రహం.

రెండవప్రక్క మహేంద్రకపూర్‌బృందం పాడిన "మే భాగాహై ప్యార్‌కా" అన్నది. బాగానే ఉంది.

### కలిమిలేములు జి. ఇ. 35297

జానపదగీతాలలో దంపుళ్లపాటలకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. పాట ఎలా ఉన్నా చరణాంతాన "అహ" అని ఉండడం ఈ జాతి పాటలకు పెట్టని మకుటం. "అత్తలేని కోడలు ఉత్తమురాలు ఓలమ్మా, కోడలులేని అత్త గుణవంతురాలు అహ" అన్న పాట "మన దేశం", "అత్తా ఒకింటి కోడలే" చిత్రాల ద్వారా యిటువంటి పాటలతో పరిచయం ఉండటానికి అవకాశంలేని కాలేజీ పిల్లలకు కూడ తెలిశాయి.

ఇటువంటి పాటలనే వరవడిగా పెట్టుకొని "కలిమిలేములు" చిత్రంలో పతాకసన్నివేశానికి అశ్వత్థామ నడక చూపించగా కొసరాజు చక్కని పల్లెపాటు సాహిత్యం వ్రాశారు. "నొసట వ్రాసిన వ్రాలు తప్పదు, చెరిపివేసినా చెరగదులే, ఓలమ్మో ఓలయ్యో"— ఒకడాలెప్పుడు ఒకడికి కాదు నూరు చెప్పినా మారదులే వేయి జెప్పినా మారదులే అహ" అన్న పాట ప్రేక్షకులపై యింత ప్రభావం చూపటానికి కారణం ఉద్వేగప్రేరకమైన చిత్రీకరణ. మనసులేని వాడితో మనువు తప్పదని తెలుసుకున్న తరుణిగుండెల్లో క్షణక్షణానికి ధ్వనించే రోకటిపోటులను అశ్వత్థామసంగీతంలో సరైన రీతి ప్రతిబింబించింది.

వైదేహి కంఠంలో జానపదుల జానుతెనుగుదనం జాలువారుతున్నది భ్రమరాగమనానికై నిరీక్షించు ప్రౌఢ పుష్పములోని మకరందములాగా. "తకఝిమి తాండవకృష్ణునిపై రుక్మిణి చూపులు పడె...మ్మో ఇంట్లో పెద్దలు వద్దో వద్దని చెప్పిన మారదులే" అన్న మాటలలో ఎంత తీయని ఊహలు, ఎన్ని తీరిన కోరికలు దాగిఉన్నాయో!

ఈ పాటతో జోడించినది మాధవపెద్ది, స్వర్ణలత పాడిన సరదాగీతం. ఈ పాటకు ప్రత్యేకత నిచ్చినవి మూడు అంశాలు. ఒకటి తెలుగు సామెతలతో, నుడికారాలతో నిండిన ఆరుద్ర సాహిత్యం. రెండు ఇటువంటి పాటలకు యెప్పుడు కని, విని ఎరుగనటువంటి స్పష్టమైన కర్ణాట రాగచ్ఛాయలు. మూడు స్వర్ణలత సత్యం పాడటంలో నిండుతనం. ఈ మూడూ కలవటం వెన్నెలవర్షంలో విరిసిన హరివిల్లు. తొలిప్రేమల సుడిగాలుల ఊగిసలాడుతున్న యవ్వనవృక్షం. నిస్ఫృహాంబరవీథిని నిశితో విహరిస్తున్న శశిబింబం.

### జతస్వరాలు

"సువర్ణసుందరి" చిత్రంలో "ఏరా మనసాటి మగధీరు లెవ్వరురా" పాట పాడినది ఎవరెవరో తెలుసునా ? ఒక కంఠం పిఠాపురం నాగేశ్వరరావుది. అది తెలిసినదే. తక్కిన రెండు కంఠాలు? ఒకటి వేదాంతం రాఘవయ్యగారిది. రెండవది ఆదినారాయణరావుగారిది, టి. వి. రాజుగారికి సహాయకులు, "కల్యాణి" చిత్రానికి సంగీతం అమర్చినవారు అయిన మద్దెల సత్యంగారిది. ★

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంప గోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరికొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

# పంజరం

శ్రీమతి [illegible]

ఆకాశాన్నంటుతున్న పర్వతాలలో తొలిచిన దారిన ఒక బస్సు నెమ్మదిగా, భారంగా పోతోంది. ఆ బస్సులో కాలేజి విద్యార్థినులు పదహారేళ్ళల్లా కాకపోయినా చాల చలాకీగా, హుషారుగా, సుకుమారంగా ఉన్న అమ్మాయిలు. అందరూ ఇరవై సంవత్సరాలలోపు వారే. పల్లెపాటలు మొదలు సినిమాపాటలు, హిందీపాటలు, జాతీయగీతాలు ఒకదానివెంట మరొకటి ఆపకుండా పాడుతున్నారు. వారిపాటకు తలూపుతూ ఆనందిస్తున్నట్లుగా బస్సు ఊగుతూ కొద్దిగా వాలుతూ పోతోంది. వారు కొన్ని వందల అడుగుల ఎత్తులో ఉన్నారు.

ఆ పర్వత పంక్తిని వదలి బస్సు లోయమట్టానికి వచ్చి రావటంతోనే టక్కున ఆగిపోయింది. ఉల్లాసంగా అరుస్తూ, పాడుతూ, మాట్లాడుతున్న అమ్మాయిలంతా "హే–భగవాన్! బస్సు కేమైందిరా?" అన్నట్లు, బయటికి తలలు పెట్టి చూస్తున్నారు. అప్పు అలాగా కిటికీల్లోనుంచి బయటికి రాలేవుగా?

పరిస్థితిని గమనించి క్షణంలో అవగాహనం చేసుకున్న నిర్మల అందరితో అన్నట్లుగా అంది: "మన బస్సుకేం కాలేదు. పాపం ఎవరిదో కారు పాడైంది కాబోలు రిపేర్ చేస్తున్నారు. అదీ అడ్డంగా ఉంది. దాన్ని తప్పుకుపోలేము."

బస్సులోని కంఠాలన్నీ ఒక్కసారి తమ విసుగును వ్యక్తం చేశాయి. కొందరు అస్పష్టంగా గొణిగారు.

"ఎప్పటినుంచో చూడాలని కళ్ళు కాయలు కాచినై — సరిగదా అని బయలుదేరితే ఇదో అవాంతరం, ఆ కారుగారు బాగయ్యే దెప్పుడో, మనకు దారి వదిలే దెప్పుడో" ఒకమ్మాయి అంది.

"ఎంతో ఆత్రంగా ఉంది. ఇంకా నాలుగైదు మైళ్ళు ఉందట గుహలకి" మరొకరు పల్కారు.

"నానా— మీలో రసికత్వం సున్నా—ఆ కారులో చక్కని అబ్బాయి ఉన్నారనుకోండి — మీలో ఇంత సహనం లేకుండా ఉంటుందా? మనలో కొందరు వారిని ప్రేమించేస్తారు, మనం కారు, బస్సు చుట్టూ ప్రదక్షిణం చేస్తూ ఉంటే ఆ జంటలేమో చెట్లు చుట్టూ, రాళ్ళచుట్టూ ప్రదక్షిణం చేస్తుంటారు. మనం వాళ్ళను చూస్తే ఏమీ పట్టించుకోకూడదు. ఎందుకంటే..."

# బంగారు పంజరం

అందర్లోంకి కొంటెపిల్ల విమల మధ్యలో ఆపేసి, ఏమీ తెలియనిదానికి మల్లేనే వాళ్ల లెక్చరర్‌ను చూచి మౌనం దాల్చింది.

మిగతా పిల్లలంతా నవ్వుతున్నారు. ఈ మాటలను కొద్దిగా విన్న లెక్చరర్ అంది నవ్వుతూ "విమలా—నీవే హీరోయిన్‌లా చెట్లలో పరుగెత్తుతే చూడాలని ఉంది. కానీ మీరంతా నిరాశ చెందినట్లే — ఎందుకంటే ఆ కారులో మీకు తగిన అబ్బాయిలు లేరు. భార్యాభర్తలున్నారు. అందులోనూ పెద్దవారయ్యే."

"ప్చ్ ...." అన్నారు కొందరు. మిగతా కొందరు కిచకిచ నవ్వారు.

"దిగి అలా ఒంటరిగానన్నా వన విహారం చేస్తామండీ" అంటూ ఒక విరహిణిలా బస్సు దిగింది విమల. అందరూ దిగారు.

నిర్మల వాళ్ల కాలేజి సెక్రటరీ. అందరూ ఆమె మాటని గౌరవిస్తారు. వాళ్ల లెక్చరర్ నిర్మలకి చుట్టం. వా రిద్దరు, ఇంకా కొంద రమ్మాయిలు కారు దగ్గర నించుని చూస్తున్నారు.

దాదాపు అరగంట దాటింది. కానీ కారు రిపేర్ అయిన సూచనలు లేవు. ఎండ ముదురుతోంది. దూరంగా చెట్టుక్రింద జంపఖానా పరచి కూర్చున్న ఓ నడిప్రాయపు స్త్రీని చూచి, నిర్మల అక్కడి కెళ్లింది. ఆమెకు నమస్కరించి ప్రక్కగా కూర్చుంది. నిర్మల దగ్గరకి చిన్న గుంపు వచ్చింది.

"మావల్ల మీ ప్రయాణంగూడ సాగలేదు" అందామె.

"ఫరవాలేదు. ఇంకో గంటకైనా అవకపోతుందా ?" నిర్మల మాటల్లో ఏవిధమైన విచారమూ లేదు.

"ఏకాలేజివారు మీరు ?" అని ప్రశ్నించిందా స్త్రీ.

"గుంటూరునుంచండీ. మీ రెక్కడినించి వస్తున్నారు ?"

"బొంబాయినించి. తెల్లవారు ఝామున బయలుదేరాము. ఇలాగైంది. బయలుదేరిన వేళావిశేష మమ్మాయీ" అందామె నిస్పృహతో.

"ఇంత దగ్గరగా ఉన్నారు. అజంతా గుహలెప్పుడు చూడలేదా ?"

"మే మొచ్చి ఏడాది కాలేదు. అంతకుముందు గోదావరిజిల్లాలో ఉండేవాళ్లం. ఇంతకాలానికిరావటం పడింది గానీ, ఈ కారు బాగయ్యేదెప్పుడో...."

"గోదావరిజిల్లా అంటే—మా నిర్మల—అంటే ఈ అమ్మాయి వాళ్లది గూడ గోదావరే. రామచంద్రపురం కదు నిర్మలా ?" విమల మధ్యలో అందుకుని అంది.

"మీ కారును, డ్రైవరును వదిలి మనమంతా వెళ్దామండీ. మనం చూచివచ్చాక, మీ డ్రైవరును పంపుదాము. లేకపోతే మీరు చూడటం అయ్యాక మా బస్సులో వచ్చేసి కారు దగ్గరుంటే, మీ డ్రైవర్ మా బస్సులో తిరిగెళ్లి గుహలను చూచాక తిరిగి అందరం కలుసుకుని మీ దగ్గర కొస్తాము. అప్పటికి మీ కారు బాగు కాకపోతే మాతో ఔరంగాబాద్ వచ్చేద్దురుగాని, మీ కారును బస్సు లాగుతుంది ....." నిర్మల తేలికగా అయిపోతుం దన్నట్లు చెబుతోంది.

"అంతలో నా బస్సు బరువు లాగలేక ...." విమల హేటిని మూమ్మా మరొక అమ్మాయి




ఉత్సాహానికి
హుషారుకు
కారణం!
రాగోలైన్




ఈ పుష్టికరమైన ఆహార పానీయమును
మీరుకూడా పుచ్చుకొని యెల్లప్పుడు
ఉత్సాహంగా వుండండి !!

ఫైన్ కెమికల్ వర్క్సు,
పి. బి. 71, మైసూరు-4

క్రొత్త పెద్ద డబ్బా
కాల్గేట్
బేబీ పౌడరు

ఎక్కువ పౌడరు...,
ఎక్కువ పొదుపు...
సులభంగా పెట్టగల
క్రొత్త మూత!






పసిపాప యొక్క
లేత చర్మమునకు
ఉపశమనము కలిగించును!

అంది. "పిన్నీ, నీ ఆవేశకునవు నోరూను—ఏమిటా మాటలు? నిజమే నిర్మల చెప్పినలాగ చేయాలి, లేకపోతే మీరు ఒంటరిగా ఈ అడవిలో ఏ దిక్కూ లేక ఎంత సతమత మైపోవాలో ?"

"లేవండీ వెడదాము. అందరికీ ఆలస్యమైపోతోంది" అంటూ నిర్మల లేచింది.

"అండీ ఏమిటి ? మీరు మాకు 'మామి' .... ఛత్ — 'మామి' బాగులేదు. పిన్నిగారు....గారు కూడా అనవసరం. 'గారు' తగిలిస్తే మాటలు ఓ హద్దులో ఉండాలి. పిన్నీ అంటే చనువుగానూ ఉంటుంది; కదు పిన్నీ" అంది విమల.

"ఈ ఎక్స్‌కర్షన్ గ్రూపులో విమల మాకు హాస్యా న్నందిస్తుంది. విమల మాటల్ని అంతగా పట్టించుకోకండి." నిర్మల చిరునవ్వు నవ్వుతూ అంది. విమల మూతి బుంగగా పెట్టింది.

"ఫరవాలేదమ్మా. పిన్నీ అనండి. మీరింత చనువుగా ఉంటేనే నేనూ మీలో ఒకదానిలా భావిస్తాను. మీ అందరి సహృదయతకు మేమెంతో కృతజ్ఞులం."

వారి లెక్చరర్ శీలతో అంతా చెప్పారు. ఆమె డ్రైవర్‌కు చెప్పవలసినదంతా చెప్పింది. ముందు సీటులో భార్యాభర్తలు కూర్చున్నారు.

అందరూ ఒక్కొక్కరుగా బస్సులో కూర్చుంటున్నారు. బస్సు కెదురుగా నించుని విమల విరగబడి నవ్వుతోంది. ఏమిటంటే ఏమి టన్నారు.

"తెలివంటే మీదే మరి. కారు దాటి వెళ్లేందుకు దారి లేదుకదా ? బస్సు హైజంప్‌చేసి వెళ్లాలేమిటి ?" అంది.

"మహ నవ్వావులే .... ఇంతకూ ఏం చెయ్యాలి?" అంది ఒక అమ్మాయి.

"మనలో శాండోల్లా ఉండి, గ్రో—బాల్ను అడగగల్గినవారు, నిన్న ఎల్లోరాలో అన్నపు పాత్రను దించినవారు, కూజాను మోసినవారు, మొన్న నా తలమీద మొట్టినవారంతా ధావలయునని అజ్ఞాపిస్తున్నాను" అంది విమల సీరియస్‌గా.

పిన్నిగారు, ఆమె భర్త నవ్వుతూ దిగారు. వాళ్ళు శాండోల క్రింద లెక్కన్నమాట.

"ఏడికొవేలే" అంటూ అందరూకారుదగ్గరకెళ్లారు

వాళ్ల నెందుకు పిల్చారో వెంటనే కనుక్కున్నారు. కారుచుట్టూ అప్పుడే పదిమంది చేరారు. ఇంకొంతమంది వాళ్ళ చేతులేశారు. ఇద్దరు డ్రైవర్లు స్టీరింగులన జరుపుతుంటే వీళ్ళంతా కారును నెమ్మదిగా ప్రక్కకు ఎత్తి పెట్టారు. విమల సాయంచేయకుండా దూరం నించి చూచి, అంతా అయ్యాక చేతులు దులుపుకుంటూ "హమ్మయ్య" అంది ఆయాసంగా.

కొందరు నవ్వేశారు. కొందరు చురచుర చూచారు. అక్కడ పడివున్న స్క్రూలను, సుత్తులను, స్పేనర్లను, తీసివేసిన టైర్ను రెంటిని పరిశీలనగా చూస్తూ అంది విమల "ఈ సామానంతా చూస్తుంటే చిన్నప్పుడు నేను గడియారాన్నంతా విప్పి, మళ్లీ పెట్టను చేతకాక తన్నులు తిన్న సంఘటన గుర్తొస్తోంది డ్రైవరూ" అంది. పాపం ఆ డ్రైవర్‌కి అర్థం కాలేదు. మిగతా వారంతా విరగబడి నవ్వుతున్నారు. పిన్ని అతనికి హిందీలో చెప్పింది. అతనూ నవ్వాడు.

"విప్పటం తాం సుంథం కదా" అంటూ బస్సెక్కింది.

"విమలా!—అతనెంత బాధపడ్డాడో—మరీ అంత చిలిపితనం పనికిరాదు" నిర్మల నెమ్మదిగా మందలించింది.

విమల తప్పుచేసినదానిలా సైసైకి అగుపించింది.

బస్సు వెంటనే స్టార్టు కాలేదు.

"అయింది పని .... నే చెప్పలేదూ .... బరువెక్కువైతే బండి నడవదని ?" విమల ముందు సీటువైపు చూపిస్తూ అంది. అందరూ నవ్వుతున్నారు. డ్రైవర్‌కు ముందున్న అద్దంలో విమల సైగచేసి చూపటం చూచిన పిన్ని భర్తతో చెప్పింది. ఆయన గూడా హాయిగా నవ్వాడు.

"విమలా" అంది నిర్మల.

"తమాషా కన్నాను నిర్మలా .... వారిని బాధ పెట్టాలని కాదు. నా నోటికి చేతి—రుమాలు కట్టేస్తాలే" అంది.

"ఒద్దు విమలా .... నీలాటివారుంటే .... బాధలు, సమస్యలు, కష్టాలు మర్చిపోతాము" అంది పిన్ని నవ్వుతూ.

బస్సు స్టార్ట్ అయింది. అందరి హృదయాలు తేలికపడినై. అజంతా విహారాలను సమీపించారు.

"ఏవీ గుహలు" అన్నారంతా కలిసి. ఎదురుగా చిన్న కొండలు—లోయ మాత్రం కనిపిస్తుంటే.

"ఆ ప్రక్కనున్న మెట్లెక్కి, ఆ కొండ ఎక్కిపోతే గుహ లొస్తాయి. ఇక్కడినించి అగుపించవు" అన్నారాయన.

"భలే గుహలేవే .... ఇంకా ఊరిస్తున్నాయి" అంది విమల.

నిర్మల, శీలు డ్రైవర్‌తో మాట్లాడుతున్నారు.

"అక్కడ భోజనం చేయటానికి వీలులేదమ్మా. మీరు యిక్కడే తినేసి వెళ్లాలి." అన్నాడు డ్రైవర్.

నిర్మల పరిస్థితి సందరికీ తెల్పి అందరూ భోంచేసి బయలుదేరాలని చెప్పింది. కొందరు రయిష్టపడ్డారు. కొందరు వద్దన్నారు. ఆత్రంగా చూడాలనుకున్నవారు ముందుగా వెళ్తామన్నారు.

లెక్చరర్ శీల సామానంతా దింపిస్తోంది మౌనంగా నిర్మల ఇదేమీ పట్టించుకోలేదు. అందరినీ నిశ్శబ్దంగా ఉండమని చెబుతోంది. "భోజనం గుహల దగ్గర చేయటానికి వీలులేదు అక్కడే తింటామంటారా ? ఈ పాత్రలను, నీళ్లను ఎవరు మోసుకొస్తారు ? గుహలను పరిశీలనగా చూచి, గైడు ద్వారా వివరాలు తెలుసుకుని రావాలంటే కనీసం నాలుగైదు గంటలైనా పడుతుంది. అంత దాకా భోంచెయ్యకపోతే నడిచే ఓపికలేక సరిగా చూడలేము ...... "

"ఔను నిర్మలా, పేగులు అల్లరి చేస్తుంటే..."

నిర్మల విమలమాటలు లెక్కచెయ్యకుండా చెప్పుకుపోతోంది. "అందరం భోంచేసి ఒట్టుగా వెడదాము."

అంతటితో వాదన ముగిసింది. అందరూ చెట్లక్రింద బారులుతీర్చి కూర్చున్నారు. నిర్మల నందరూ గౌరవించే తీరు చూచి పిన్నిగారు


క్యాలెండర్లు

నాణ్యమైన ఫోటో ఆఫ్ సెట్ క్యాలెండర్లకు మమ్ము సంప్రదించండి. క్యాలెండరు బొమ్మలను క్యాలెండరు మ్యానుఫ్యాక్చర్లకు, ప్రింటర్లకు ప్రత్యేక ధరలకు సప్లయి చేయుదుము.

మంచికమీషనుపై పనిచేయుటకు సమర్థులైన ఏజంట్లు కావలెను. వ్రాయండి.

AJANTA ARTCALENDAR Mfg. Co.
P. B. 255, MADRAS—1.
or P. B 962, Calcutta-1.



డాక్టర్ వృత్తి చేయండి!

విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ ద్వారా హోమియోపతి చదివి, సర్టిఫికెట్టు కాలేజిద్వారా డిప్లొమా పొందండి.

ప్రాస్పెక్టస్ ఉచితం. ఇంటు వ్రాయండి

INDIAN HOMOEOPATHIC COLLEGE
(APW), JULLUNDUR CITY



వైబ్రా

గర్భాశయ రోగ నివారిణి

సకల గర్భాశయ వ్యాధులను రోగార్తి. ఆరోగ్యమగు సంతానమును కలుగచేయును. అన్నిచోట్ల దొరకును. వెల 2.50

కృష్ణా లేబరేటరీ బెజవాడ

POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC

రోజంతా చల్లగా మరియు సువాసన వెదజల్లుతూ ఉండుటకు

## పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ వాడండి.

చుట్టూ శీతోష్ణస్థితి ఎలా వున్నా, రోజంతా సువాసన వెదజల్లుతూ, తాజాగా ఉండుటకు స్నానము చేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను ఒళ్లంతా జల్లుకోండి! వెదజేర్చే యీ పౌడరు ఎంతో మెత్తగా ఉంటుంది. తేలికైన సువాసనను కలిగి ఉంటుంది, బాగుగా చెమటను పీలుస్తుంది! స్నానానంతరపు తాజాదనమును రోజంతా పొందుటకు దీనిని వాడుటయే మంచిమార్గము!




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపించబడినది)

JWT P-3233

ఆశ్చర్యపడింది. నిర్మల ధీమాగా, తన మాట వినాలి అన్నట్లు దౌర్జన్యం చేయకుండా, ఎంతో నెమ్మదిగా వాళ్లకంతా అర్థమయ్యేలా చెప్పింది. పిన్ని, ఆమె భర్త దూరంగా కూచుని తమ టిఫిన్ తింటూ, నిర్మలను గమనిస్తున్నారు.

కొంతసేపటికి నిర్మల ఒక విస్తట్లో పులిహోర, ఖారీ, బంగాళదుంపకూర, రెండరటిపండ్లు, రెండు కిళ్లీలు తెచ్చి వారి దగ్గరుంచి వెళ్లిపోయింది.

గోలగోలగా ఉంది. అందరూ కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు. నిర్మల, విమల మాత్రం వడ్డిస్తున్నారు.

"మరికాస్త కూర వడ్డించు విమలా"

"ఇంకొంచెం!"

"మరీ గిల్లిగిల్లి వడ్డిస్తావేం?"

"అంతా మీకే వడ్డిస్తే మరి మాకో" విమల జవాబు. అందరూ నవ్వటం.

అంతా గమనిస్తున్న పిన్ని భర్తతో అంది "ఒంటరిగా వచ్చినట్లయితే ఇంత సరదాగా ఉండేది కాదుగదండీ"

"ఔను. విమల విదూషకురాలైతే నిర్మల కథానాయిక" అన్నారాయన.

అందర్నీ తృప్తిదీర భోంచేయనిచ్చి వారిద్దరు కూడ భోంచేసి లేచారు. పదిగంటలు దాటింది. గ్లాసులు, బిస్కట్లు, వెన్న, రొట్టె, లైమ్‌స్క్వాష్ సీసాలు తీసుకుని బయలుదేరారు.

అలా కొండల్లో పోతూ హెయిర్‌పిన్ కర్వ్‌స్‌ను దాటి, కొండల అంచున ఒక సమతల ప్రాంతాని కొచ్చారు.

అక్కడినుంచి దృశ్యం గంభీరంగాఉంది. ఒక ప్రక్క లోయ — ఆ కొండలమధ్యస్థంగా బాల్కనీ లా కట్టిన గోడ. ఆ గోడముందు గుహలు, విహారాలు, చైత్యాలు. అంతవరకు నిరీక్షణతో వస్తున్న యాత్రికుల కీ దృశ్యం ఒకవిధమైన సంతృప్తి నిస్తుంది. అడుగు ముందుకు పడదు. హృదయం సంభ్రమాశ్చర్యాలకు లోనౌతుంది.

కొంతసేపు అందరూ శిలాప్రతిమల్లా నిలుచుండిపోయారు. త్వరగా వెళ్ళి అంతర్భాగం చూడాలన్న కోర్కె జనించగానే పరుగున అందరూ మెట్లెక్కుతూ, నడుస్తూ ఆఫీసుగదిని సమీపించారు. గైడు అక్కడే ఉంటారు. ఐదురూపాయలు కట్టి రశీదు పుచ్చుకుని పెద్ద ఫ్లాష్ బల్బును పట్టుకున్న గైడు, కూలీ రాగా అందరూ మొదటి గుహలోపలికెళ్ళారు.

గైడ్ ఒక్కొక్క చిత్రంపై లైటు వేస్తూ వారందరికీ విపులంగా చెబుతున్నాడు. అతను హిందీలో చెబుతుంటే, పిన్ని తెలుగులో చెబుతోంది.

"పిన్నీ! ఆ ఐదురూపాయల్లో సగం తీసుకో" అంది విమల. లీల "ఉష్" అంది. విమల గప్‌చిప్‌గా ఉండిపోయింది.

"ఇంత ఎక్కువ వెల్తురుంటేనే మనకు కన్పించటంలేదు. మరి ఆ కాలం చీకట్లో ఇంత ఎత్తున, ఎలా చిత్రించారు?" అంది నిర్మల.

నిర్మల ప్రశ్నవేసినా, జవాబుకోసం అందరూ చూస్తున్నారు. అతను చెప్పాడు. పిన్ని తర్జుమా చేస్తూ అంది.

"గుహాల నిర్మించేటప్పుడే, వాళ్ళు సహజమైన వెలుగు, సూర్యరశ్మి లోపలికి వచ్చేటట్లుగా తొలిచారు. చీకంతో ఏదో ఒక సమయంలో ఈ గుహలోకి వెల్తురు జొరబడుతుంది. అంతేకాక వాళ్ళు సూరుములలో చిత్రించేటప్పుడు బయట ఎండలో అద్దాలుపెట్టి సూర్యరశ్మిని ప్రతిఫలింపచేసి ఆచోటులో వెల్తురుపడేలా చేసేవారని చెబుతారట. ఈ చిత్రాలలోని డిజైన్లు, సీలింగ్‌లో ఉన్న డిజైన్లు మన గుడ్డలమీద ప్రస్తుతం ప్రింట్ చేస్తున్నారట. రంగుల సంవిధానం, ఎంతో పొందికగా, ఆకర్షణీయంగా ఉన్నాయి — చూడండి" అంటూ ఆమె తల పైకెత్తి చూడటం మొదలెట్టింది.

సగంవరకు చూడటం అయింది. మెడలు పీక్కుపోతున్నాయి. "అబ్బ" అంటూ అందరూ మెడలు సవరించుకుంటున్నారు. "బహుశ ఈ విహారాలు చూడటంఅయ్యాక నామెడ వంగదనుకుంటాను." అంది విమల.

ఫరవాలేదులే—నే వంచుతా" అన్నారొకరు.

ఈగుహలప్రాంగణాలలో శిల్పం అత్యంత రమణీయంగా ఉంది. బయట ఎంతో సుందరంగా లతలను, పూలమాలలను, రాతిలో తొలిచారు. నిలువు పాటి బౌద్ధవిగ్రహాలు గోడలోనే తొలిచిన వెన్నో వున్నాయి. కొన్నింటికి బాల్కనీలు కూడా వున్నాయి. వాటి నిర్మాణ మత్యంతాశ్చర్యాన్ని గొల్పుతుంది. ఒక అంగుళంమేర రాయిగూడా చెక్కబడకుండా లేదేమో అనిపిస్తుంది.

జమురావు గానక చేరీలో జనం పిసుగుకొంటూన్నా, నసుగుతూవున్నా సరే ఖాతరు చేయకుండా తెగవాయిస్తున్నాడు.

"ఏమండీ! ఆయనకు ఈ గోల అంటే ఖాతర్ లేదా?" అన్నాడు మూర్తి.

"కాదు. ఆయనకు బ్రహ్మ చెముడు."

పి. నాగయ్య, (గుంటూరు)

వీటిని చూస్తుంటే హృదయం తెలియని అనుభూతితో ఉప్పొంగిందందరికీ. అందులోనూ ఆంధ్రుల కృషి ఎంతోఉందని తెలిశాక వారి హృదయానందం ఇంతింత కాదు. ఎటుచూచినా మనవైపుకే తిరిగినట్లున్న బుద్ధుని చిత్రం, మాయాదేవి రాహులునిచేత బుద్ధునికి భిక్ష పెట్టించుతున్న చిత్రాలు వారి హృదయ ఫలకాలపై స్థిరమైన ముద్రలేశాయి.

అన్ని గుహలు చూచేవేళకి నాలుగు దాటింది. గైడు ఆఖరుగాఅన్నాడు లైటుఆర్పుతూ "శిల్పము, చిత్రలేఖనము, నిర్మాణక్రమము, ఈ మూడింటి కలయికవల్ల సృష్టింపబడిన ఈ గుహలు వాటికవే సాటి. మరిక ప్రపంచంలో ఎక్కడా ఈ సంబంధం చూడము."

అందరి హృదయాలు ఏదో ఉన్నతస్థాయి నందుకున్నట్లున్నాయి. అనిర్వచనీయానందం, తృప్తి వారి ముక్కిరి బిక్కిరిచేసినై. ఈసారి నిర్మల, లీల అందరికీ టిఫిన్ పంచి, అక్కడే ఒకగుహ దగ్గరున్న బావి నీళ్లతో నిమ్మరసం కలిపి అందరికీ పంచారు.

అలసిపోయి కాళ్ళీడ్చుకుంటూ తిరుగుముఖం పట్టారు.

నిర్మల అంది: "వాళ్ళ డ్రైవరును పంపాలి. త్వరగా వెడదాము"

"ఆ డ్రైవర్ ఏం చూస్తాడు లెద్దూ. చీకట్లో ఏం తెలుస్తుంది?" అంది విమల.

నిర్మల అంతటితో పోనివ్వలేదు. "పాపం ఎంత ఆత్రపడుతున్నాడో — అతనుమాత్రం మనలాటివాడుకాడూ పిన్నీ! మనం త్వరగా వెళ్దాము అంది. పిన్ని నిర్మలవైపు ప్రేమతో చూస్తూ నడుస్తోంది.

ఇంతలో ఎవరో కేకవేశారు: "అడుగో డ్రైవర్" నిజంగానేమోఅని అంతా ముందువైపు పరిశీలనగా చూశారు. ఎవ్వరూ రావటంలేదు. "విమల మాటలు నమ్మకండి" అంది పిన్ని.

వారొక మలుపు తిరుగుతున్నారు. నిజంగానే డ్రైవర్‌వచ్చాడు. విమల తలపైకెత్తి గర్వంగాఅందరివైపూ చూస్తూ "విమలమాట నమ్మకండి"అంది.

"కారు రిపేర్‌చేశానమ్మా. ఇంకో లారీడ్రైవర్ సాయంచేశాడు. తీసుకొచ్చేశాను. తాళాలివిగోండి. గబగబ చూచేసి వస్తాను." అంటూ పరుగు తీశాడు.

చీకటిపడ్తోంది. పుల్లలు సేకరించి, దగ్గరున్న పల్లెనుంచి పాలు సేకరించి కాఫీ చేసుకుని తాగారు. పిన్ని వాళ్లడ్రైవర్ రావటంతో అందరూ బయలుదేరారు.

అందరూ ఆ దంపతులకు నమస్కరించారు. పిన్ని వాళ్లను విడువలేకపోతోంది. "మీ మేలు ఎప్పటికి మర్చిపోలేను. ఈ కొన్నిగంటలే మీతో ఆనందంగా గడిపినా ఈ మధురక్షణాలు నా మనస్సులో ఎప్పుడూ వుంటాయి.
మీకు మా ఇద్దరి ఆశీస్సులు".

కారు బయలుదేరబోతోంది. విమల గట్టిగా కేకేసింది. "మాకంటే ముందుగా వెళ్తున్నారు. మళ్ళీ కారు చెడగొట్టుకునిమాత్రం మాకోసం చూస్తూండకండి. ఈసారి మేం ఆగం— రయ్‌న వెళ్ళిపోతాము." పిన్ని నవ్వుతూ చేయి ఊపింది.

పిన్నిభర్త అడిగారు: "ఏ మాలోచిస్తున్నావు?"

కారులో కొన్ని క్షణాలు మౌనంగా గడిచినై.

పిన్ని భర్తముఖంలోకి చూస్తూ అంది: నిర్మలనుగూర్చి"

"నిజంగానా?"

"ఔను— ఎంత మంచిపిల్ల! మంచి వ్యవహార దక్షతగలది. ఎంత అణకువ— ప్రేమ"

"నేనుగూడ నిర్మలనుగూర్చి ఆలోచిస్తున్నా" భార్యాభర్తలొకరి ముఖాలొకరు చూచుకున్నారు. ఎందు కాలోచిస్తున్నారో వారికి తెలిసినా— అలా ఆలోచిస్తున్నందుకు సిగ్గుపడి తిరిగి మౌనం దాల్చారు. పిన్ని చిన్నగా నిట్టూర్చింది.

దూరంగా ఎక్కడో బస్సుహారన్ వినిపిస్తోంది.

(సశేషం)

కాల్గేట్ టూత్ బ్రష్
మీ దంతములను ఎక్కువ
శుభ్రపరుచునట్లుగా శక్తివంతముగా
తయారైనది!
సైజులు: ★ పెద్దలకు ★ చిన్నవారికి ★ పిల్లలకు ★ పసిపిల్లలకు
★ గట్టివి ★ ఓమాదిరివి ★ మెత్తనివి
అంతేగాక డీలక్స్ ఆరోగ్యదాయకమైన ప్లాస్టిక్ పెట్టెలోగూడా లభించును!
శాశ్వతమైన శుద్ధి చేసిన నైలాన్ కుచ్చుల వలన ఇది బాగా మన్నుతుంది!
SHORT HEAD
COLGATE
Nylon TOOTH BRUSH
NYLON STERILISED
TB/G/15 T



రోజల్లా కష్టించి పని చేశాక వినోద కాలక్షేపానికి సిద్ధమేనా కాదా? అయితే సానటోజన్ సేవించండి. 95% పాల సత్తువ గలిగి 7 విటమినులతో బలపర్చబడిన బలవర్థకౌషధము (టానిక్) ఇది ఒక్కటే. సానటోజన్ శరీరప్రకృతిని శక్తివంతంగా ఉత్తేజపరచి, శారీరక మరియు మానసిక జవశక్తులను వృద్ధిపరచ పురికొల్పును.
సానటోజన్ ఆరోగ్యమునకు జవ శక్తులకు అధికసత్తువగల బలవర్ధ కౌషధము (టానిక్)





సానటోజన్
అధికసత్తువగల బలవర్ధక టానిక్
GR. S. 54 TEL.


# గుడ్డివాడు

9 వ పేజీ తరువాయి

తీసేసేవాణ్ణి—అంతకంటే దారుణమయిన శిక్షణ ఇంకొకటి ఉండేదిగాదు. ఏంచక్కా మేము కత్తుల్లాంటి కర్రలు తీసుకొని యుద్ధం చేస్తుంటే వాడొక్కడూ ఒక ప్రక్కగా దిక్కుదిక్కుమంటూ నిలబడి ఉండేవాడు. యుద్ధంలోనుంచి పారిపోయివచ్చిన సైనికుడిలా ఉండేది అప్పటి తీసేసినవాడి పరిస్థితి! ఆ శిక్షను ఎప్పుడూ ఒప్పుకోకపోయేవాడు. అందుకే నే చెప్పినట్లు వినాల్సి వచ్చేది—

'శీను' ఎప్పుడూగూడా నాకు ప్రత్యర్థి—వాడు అప్పుడప్పుడూ నాతోటి ఓడిపోవటానికి ఒప్పుకోకపోయేవాడు—కాని మిత్రులంతా నాకు అండదండగా ఉండబట్టి వాడి ఆటలు ఏమీ సాగేవి కావు—

ఆటలో 'సీత' రాజకుమారి. నేను ఆమెను రక్షించే రాజకుమారుణ్ణి—శీను ఆమెను బలాత్కారంగా గుంజుకొనిపోయి అడివిలో దాచే రాక్షసుడు. శంకరం—రంగడూ, చంద్రం—గిరి—వీళ్లంతా వాడి అనుచరులు. నేను ఒక్కణ్ణే సీతను శీనుచెర నుండి విడిపించుకొని రావాలి! అదీ ఆట!

గుర్రం పరుగుతీస్తున్నట్లుగా నోటితోనే శబ్దం చేసుకుంటూ మా భావి గచ్చుపలక చుట్టూ మూడుసార్లు తిరిగేవాణ్ణి—అక్కణ్ణించి గబుక్కున గుర్రాన్ని గంతు వేయించినట్లుగా—నేనే వేసి, దట్టంగా ఉన్న చెట్లచాటుకు వెళ్లి సీతకోసం వెతికేవాణ్ణి. శీను ఎప్పుడూ వరి గడ్డివాము ప్రక్కనే ఉన్న చింతచెట్టుక్రిందనే సీతను పట్టుకొని కూర్చునేవాడు. నాకు తెలుసు వాడు అక్కడికి పోతే దొరుకుతాడని—కాని గబుక్కునపోయి రాక్షసుడితోటి కత్తియుద్ధంచేస్తే ఏం సరదా ఉంటుంది? అందుకే ఈ తతంగమంతా!

నేను శీనుతోటి 'కర్రయుద్ధం' చేస్తుంటే వాడికి అండగా తతిమ్మా సావాసగాండ్రంతా ఉండేవారు. నేను సీతను తీసుకొని వెళ్లకుండా చూడటమే వాళ్ల లక్ష్యం! కానీ ధర్మం తప్పకుండా గెలవాలికాబట్టి—నేనే అందర్నీ ఓడించేవాడిని. ఆటతర్వాత అంతా గలిసి శంకరంగాడు ఇంటి నుంచి దొంగిలించుకొని వచ్చిన దోసకాయలను ముక్కలుగా తరిగి—ఉప్పూ కారంలో నంచుకొని తినేవాళ్లం!

ఇది ఉ. వా. తప్పకుండా సాయంత్రం నాల్గింటి నుంచి ప్రతిరోజూ జరగాల్సిన మా మిత్రబృంద కార్యక్రమం. ఎప్పుడోతప్ప అందరం 'కత్తియుద్ధం ఆట' తప్పనిసరిగా ఆడేవాళ్లం. శీను ఇల్లు మా ఇంటి ప్రక్కనే ఉండేది. వాడు స్కూలు ఒదిలిపెట్టేసరికి ఖచ్చితంగా మా ఇంటికి హాజరయ్యేవాడు. వాడి వెనుకగా తతిమ్మావాళ్లంతా అటు ఇటూ తేడాతో చేరేవాళ్ళు.

ఇహ రేపు ఉగాదిపండుగనగా బడిలో తెలుగు మాష్టారుగారు పద్యం ఒప్పచెప్పనందుకు తాట ఊడేలా పేంబెత్తంతో నన్ను కొట్టారు! క్రితంరోజు రాత్రి 'స్టంటు సినిమా' కు దొంగతనంగా నేనూ—శీనూ వెళ్లినందుకు ప్రతిఫలం అది—'కత్తియుద్ధం'ఆటలో నేను అందర్నీ ఉత్తుత్తిగా ఓడించినా నిజజీవితంలో నా అంతగా భయపడేవాడు మరొకాడు ఉండేవాడు కాదు. క్లాసులో మాష్టారుగారు పాఠం ఒప్ప చెప్పనందుకు ఎంతగా బాదుతాడో అని నాకు తెగ భయమేసేది.

అందుకే అన్ని ఆటలు అయినతరువాత సాయంత్రం చక్కగా స్నానంచేసి—పెరుగేసుకొని అన్నంతిని — బుడ్డిదీపముందర పుస్తకాలు వేసుకొని కూర్చునేవాడిని. అర్థగంట పాఠం చదివానంటే ఇహ నేను దాన్ని మరిచిపోయేవాణ్ణి కాదు. అంత జ్ఞాపకశక్తి ఉండేది.

అవ్వాళ పాఠం రానందుకు దెబ్బలుతిన్న భయం ఇంకా నా మనస్సులో మెదుల్తుండబట్టి స్కూలు విడిచిపెట్టగానే వచ్చి బుద్ధిగా స్నానంచేసి అమ్మ పెట్టిన కారప్పూస కరకర నములుతూ తెలుగు శతకం ముందరేసుకొని కూర్చున్నాను.

మా అమ్మ వంటింట్లో పండుగకోసం పిండి వంటల తయారీతో సతమతమవుతున్నది. నాన్న అప్పుడే ఆఫీసునుంచి వచ్చి వరాండాలో కూర్చొని బావతో మాట్లాడుతున్నాడు. బావా—అక్కా అవాళ్టి ప్రొద్దుటిబండికి వచ్చారు. పండుగ వాసనలతో మా ఇల్లు గమగమ లాడుతూ ఉన్నది.

శీను వచ్చాడు. నా దొక్కడేగాదు—వాడితో పదిమంది. నాకు తెలుసు వాళ్లు ఎందుకు వచ్చారో? కానీ నేను ఆపూట ఆటకు వెళ్లదల్చుకోలేదు. 'రాన'ని—ఖచ్చితంగా చెప్పాను. శీను నన్ను బలవంతంచేశాడు. ఈ రెండురోజులూ శలవులేకాబట్టి తర్వాత చదువుకోవచ్చు అన్నాడు. నేను ఒప్పుకోలేదు. ఈ రభసంతా ప్రక్కన వంటింట్లో అమ్మ వింటున్నదికాబోలు! నన్ను పిలిచి నవ్వుతూ—'ఎన్నడూ లేని బుద్ధి ఇవ్వాళనే నీకు వచ్చిందేమిట్రా! రాత్రి చదువుకోవచ్చు! వెళ్ళు—పాపం! వాళ్లు అంతగా బతిమిలాడ్తుంటే—'' అన్నది.

నాకు తప్పిందికాదు—ఆపూట 'కత్తి ఆట' ఆడటానికి వీలుపడిందికాదు—మా పాలేర్లు—సన్నగా చెక్కివున్న మా కత్తులమీద మోజుపడి గొడ్లను మళ్లించటానికి తీసుకుపోయారు. అందుచేత 'కోతి కొమ్మంచి' మొదలెట్టాం. గమ్మత్తుగా ఉండే 'కత్తి ఆట' మీదికి 'కోతి కొమ్మంచి' ఏం వస్తుంది? అందుకే ఆ ఆట ఆడుతున్నామేగాని—మాక్కు రుచించలేదు. పైగా శంకరం చెట్టుపైనుంచి బోర్లపడ్డాడు. పెద్దగా గాయమయితే కాలేదు గానీ నెత్తురు వచ్చింది.

నాకు రక్తం చూసేసరికి భయమేసింది—ఆట ఆపుచేసాం. కుంటుకుంటూ శంకరం ఇంటికి వెళ్లాడు. వాడి కుంటినడకను చూసి అందరూ ఫకాల్న నవ్వారు. నాకు ఎందుకో దిగులనిపించింది. 'ఇంక నయమే—వాడి కాలు విరగలేదు'—అనే భావం నా మనస్సులో ఉదయించి కాస్త తృప్తికల్గింది.

శీను 'ఇంటికి' వెళ్తూ వెళ్తూ నా చెవిలో 'రేపు శలవే కాబట్టి కత్తిఆట ఆడుకుందాం' అన్నాడు—నేను 'సరే' నన్నాను.

రెండోరోజు ఉదయం పక్కమీంచి లేస్తుండగానే నాకు శీను చెప్పిన సంగతి జ్ఞాపకం వచ్చింది. కత్తిఆట ప్రోగ్రాం ఉంది కాబట్టి ఎక్కడలేని ఉత్సాహంతో కాలకృత్యాలు పూర్తిచేసుకుని అమ్మ దగ్గరికి వెళ్లాను. అమ్మ కాఫీ ఇచ్చి—'సారథీ—నీవూ, అక్కా వెళ్లి శీను నాన్నగారినీ, అమ్మనూ భోజనానికి పిలవాలిరా!'' అన్నది. నాకు తెగ సంతోషమేసింది. శీనుతో ఏంచక్కా ఇవ్వాళ్లా మా ఇంట్లోనే ఎగరవచ్చు!!

---

చనిపోతూ ఒక మాజీ లక్షాధి కారి విల్లు ఇలా రాశాడు. "నాకు ఆస్తిపాస్తులుండేవి. అన్నీ హారతి కర్పూరం అయిపోయాయి. ఇక ఈ భూమిని మాత్రం ప్రపంచంలోని ప్రజలందరికీ వదిలి పోతున్నాను."

ఆర్. మల్లయ్య (మద్రాసు)

---

ఒక్క పరుగుతో శీను ఇంటికి చేరుకున్నాను. ఆ ఇంట్లో కొంచెం నాకు చనువుగూడా! ఎగురుతూ ఉత్సాహంగా 'ఇవ్వాళ మీరంతా మా ఇంటికే నండోయ్—భోజనానికి!' అని అందరితో చెప్పేసాను. వెనగ్గా వచ్చిన మా అక్క ముసిముసి నవ్వుతో శీను అమ్మకు అసలుసంగతి చెప్పింది—'అవ్వాళ బాబిగాడి పుట్టినరోజుపండుగకూడా కల్సివచ్చింది కాబట్టి అందరం సంతోషంగా మా ఇంట్లోనే పండుగ జరుపుకోవాలని—

పదిగంట లయ్యేసరికి శీనుకుటుంబమంతా మా ఇంటికి తరలి వచ్చింది. మా ఇంట్లో కోలాహలం అంతా ఇంతా గాదు.

ఫలహారా లయినతరువాత నేనూ—శీనూ గల్లి మిత్రులందర్నీ పిల్చుకొని వచ్చాం! మా చెట్ల మీదికి ఎక్కి పొడుగాటి కర్రలు విరిచి—వాటిని సన్నగా చెక్కి కత్తుల్లా తయారుచేసాం!

ఇహ ఆట మొదలుపెట్టాం!

ఎప్పటిలాగానే నా ఉత్తుత్తిగుర్రంతో శీను దాక్కున్న చింతచెట్టుకిందికి చేరుకున్నాను.—'దుర్మార్గుడా—ద్రోహీ' అంటూ శీనుమీద అమాంతం పడి మొదట కలబడ్డాను. తరువాత కర్రకత్తులతో అసలుయుద్ధం ప్రారంభించాం! శీనుకు సహాయంగా పదిమంది చేరారు. నే నొక్కణ్ణీ—ధైర్యంగా అందర్నీ ఎదుర్కొని పోరాడుతున్నట్లు నటిస్తున్నాను. గుండ్రంగా తిరుగుతూ దెబ్బకు దెబ్బ తీసాను. అందరూ నా ధాటికి ఆగలేక పారిపోయారు. శీను ఒక్కడే మిగిలాడు—నేను హీరోలా పండ్లు కొరుకుతూ వాడిమీద పడి —ద్రోహీ! నీవు చేసిన పాపానికి ప్రతిఫలం ఇదే!'' అంటూ గభాల్న కర్రకత్తితో పొడవబోయాను. వాడికి నా యాక్షనుకు నవ్వువచ్చి వంగిఉన్న వాడల్లా పైకి లేచాడు. అంతే!

నా కర్ర వాడి కండ్లల్లో గుచ్చుకుంది—'అమ్మో' అని వాడు బాధగా కేకేసి బిర్రబిగుసుక పోయాడు.

నేను ఏం చేసాను? ఏమి టీ దారుణం!?

నాకేమీ అర్థంగాలేదు. నా కాళ్లు భయంతో బిగుసుకపోయాయి! నేను వణికిపోయాను.

వాడి కేకకు ఇంటిముందున్నవారంతా ఉరుకులు పరుగులతో దొడ్లోకి వచ్చారు.

శీను కంటిగుడ్డువెంబడి నీళ్లు కారుతున్నాయి! ఏం జరిగిందో ఎవరికీ అర్థంగాలేదు. నన్ను నిలదీసి అడిగారు. నేను మాట్లాడలేకపోయాను. వళ్లంతా చెమటలతో తడిసిపోయింది.

మా నాన్న 'మాట్లాడవేంరా?' అంటూ నా చెంపమీద ఛెళ్లుమనిపించాడు. వెక్కుతూ జరిగిన సంగతి చెప్పాను. 'పెద్ద ఘోరంచేసినట్లుగా అందరూ నావైపు అసహ్యంగా చూసారు.

మా నాన్నకు కోపం కట్టలు తెంచుకొని వచ్చింది. నామీదపడి ఇష్టం వచ్చినట్లు బాదాడు. నేను అడ్డు చెప్పలేదు—నేను ఘోరం చేసాను?

శీనుకు కన్ను పోయింది—శీను గుడ్డివాడయ్యాడు! అక్కడివా రందరూ అదే తీర్మానించారు. శీనుఅమ్మను చూస్తుంటే నాకు ఏడుపు ఆగలేదు. ఆమె వాడిమీద పడి పెద్దగా శోకాలుపెడుతున్నది. శీను నాన్న ఏమీ మాట్లాడలేదు కానీ నావైపు ఛీత్కారంగా చూసాడు. మా నాన్న 'తుపుక్కున' నామీద ఉమ్మేసి శీనును తీసుకొని ఆదరాబాదరా హాస్పిటల్‌కు వెళ్లారు. ఆయన వెంబడి ఆదుర్దా నిండిన హృదయాలతో అందరూ వెళ్లారు. నేనూ—మా అమ్మా, అక్కా—అక్కడ మిగిలిపోయాం!

నేను ఏడుస్తూ అక్కడ నిలబడ్డాను.

అమ్మ నావైపు అసహ్యంగా చూసి—'ఎందుకు నాయనా—ఇంకా ఏడుస్తున్నావ్! నిష్కారణంగా బంగారంలాంటి పిల్లగాడి కండ్లు పొట్టన బెట్టుకొని—ఏమవుతుందో—ఏంపాడో?'' అనుకుంటూ అక్కతోసహా ఇంట్లోకి వెళ్లింది.



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదీన్నీ, మీ సరియైన దర్యనుగురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామా యున్నూ వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశిగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-25 న. పై.లకు మాత్రమే వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్నయెడల శాంతి చేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైనపంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

**Pt. Dev Dutt Shastri, Raj Jyothishi (W. P.) JULLUNDUR CITY.**





**ఆహార లోటువల్ల మీరు నీరసించిపోతున్నారా?**

**ఆల్బో-సాంగ్ సేవించండి**

దివ్యమైనది మరియు సామాన్య పోషక ఆహారమును పొదుపుగాను వైజ్ఞానికంగాను బలపరచును.

టీ, కాఫీ, పాలు, గంజి, పళ్ల రసం మొదలైనవాటితో కలిపితే ప్రీతైన రుచిగలది. ఆల్బో-సాంగ్, శిశువులకు, ఎదిగే పిల్లలకు, చంటి బిడ్డ తల్లులకు, మెదడునుపయోగించే పనివారికి, వృద్ధులకు, బలహీనతకు, రక్తహీనతకు మరియు రోగ విముక్తులై కోలుకుంటున్న వారికి, దివ్యమైనబలవర్థక ఆహారము.




పౌడరుగాను, బిళ్లలుగాను దొరుకుచున్నది.

**జె. అండ్ జె. డిషేన్**
హైదరాబాద్


# గుడ్డివాడు

నేను ఒక్కణ్ణే అక్కడ మిగిలిపోయాను.

నా ఒళ్ళు వేడెక్కింది.

నన్ను పోలీసులు పట్టుకోబోతారు—జైల్లో వేస్తారు. అదే నా అప్పటి పన్నెండేళ్ల మెదడులోకి జొరబడిన భావం!

నా హృదయం బండరాయిగా మారింది. ఆ ఇంట్లో ఉండగూడదనుకొని నిశ్చయించుకొన్నాను. పెరటిగుమ్మం తలుపులు తెరచుకొని నెమ్మదిగా రైల్వేస్టేషనుకు చేరుకున్నాను—రైలు ఆగివుంది. అందులోకి ఎక్కి కూర్చున్నాను. రైలు కదిలింది—మా ఊరూ—మా పరిసరాలు మొత్తం దూరంకాజొచ్చాయి—చివరకు అవి శాశ్వతంగా దూరం అయ్యాయి!" శీనును గుడ్డివాడిగా చూస్తూ పదే పదే గుర్తుకువచ్చే నా పాపంతో అక్కడ బ్రతకలేనుకూడా. ఇహ అదే చివరిసారిగా ఆ ఊరిని చూడటం—"

*　　*　　*

ట్రయిను పరుగులుతీస్తుంటే గుడ్డివాడు చెప్పిన కథనం అందరూ విన్నారు.

రెండు నిముషాలు పెట్టెంతా నిశ్శబ్దంగా ఉన్నది.

'హంబక్!' అని గట్టిగా విద్యార్థులలో ఒకడు అరిచాడు.

—కొందరు నవ్వారు. శ్రీనివాసరావుగారికి నవ్వు రాలేదు. కండ్లజోడు పెట్టుకున్న ఆయన కండ్లకు గిర్రున నీళ్లు తిరిగాయి.

"మరి మీ శీనుకండ్లు పోయాయి గానీ — నీవి కావుగా. ఉత్తుత్తి కత్తియుద్ధంలాగానే—ఉత్తుత్తి గుడ్డివాడి ఆట ఆడుతున్నావా?" ఇంకొక పిల్లగాడు పరిహాసంగా అడిగాడు.

అంతా తెగ నవ్వారు!

"ఏమిటో బాబూ! చిన్నతనపు పిచ్చి వైరాగ్యం—ఇప్పుడు నాకే నవ్వు వస్తున్నది—తలుచుకుంటుంటే.—మా అమ్మ అంటుండేది చేసిన తప్పుకు శిక్ష అనుభవించాలని. అందుకే నా కండ్లలో జిల్లేడుపాలు పిండుకున్నాను. అనుమానంగా ఉంటే మీరే చూడండి" అంటూ కూరుకుపోయిన రెప్పలను బలవంతాన పైకి గుంజాడు.

అవి అచ్చమైన గుడ్డికళ్లు!!

పెట్టెలోనివాండ్లందరూ కాస్త బిత్తరపోయారు—గుడ్డివాణ్ణి పరిహాసం పట్టించినందుకు. వాడిమీద అప్పటికి జాలి కలిగినట్లుంది—అందరూ ఋణమో ఫణమో ముట్టచెప్పారు.

ట్రయిను ఆగింది. వాడు తడుముకుంటూ పెట్టె దిగి స్టేషనులోని గుంపులో కలిసిపోతున్నాడు—

శ్రీనివాసరావుగారు పిచ్చిగా అరిచారు.

"సారథీ! నీ శీనుకు కండ్లు పోలేదు—నేనే నీ శీనును" అని—

పెట్టెలోనివాండ్లు నివ్వెరపోయారు!

—అప్పటికే గుడ్డివాడు చాలాదూరం వెళ్లిపోయాడు—



కనిపెట్టి ఆమె అతని కనేక విధాల హితవుపదేశించింది. పొలంలోకివెళ్లి అన్నలిద్దరితోను కలిసి పనిపాటలతో కలగజేసుకోవలిసినదని అదే పనిగా చెవిలో ఇల్లుకట్టుకుని పోరింది. అయినా రంగనాయకుడు ఉలకలేదు పలకలేదు! తలవంచుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. క్రమక్రమంగా ఆమె కంఠస్వరంతోబాటు పరుష ధోరణి బాగా హెచ్చింది. రంగనాయకు డిక భరించలేక ప్రాణం విసిగి 'ఒంటిమీద తగిలిన దెబ్బల నెప్పి ఇంకా తగ్గలేదు! అక్కడికి వెడితేమాత్రం నేనేమి పనిచెయ్యగలను!' అని పెడముఖంపెట్టుకుని కూర్చున్నాడు.

లక్ష్మీదేవమ్మ మరి మాట్లాడలేదు. గిరుక్కున వెనక్కితిరిగి పెరటిలోకి వెళ్లి కొంచెం గొంతెత్తి అదేపనిగా రుసరుస లారంభించింది:

'ఇంతకి నేనేమి చెయ్యను! ఎవరి కర్మ ఎలాగ రాసిపెట్టిఉందో ఎవరు చెప్పగలరు! ఆయన ధోరణి చూస్తే, కతన్నుబుస్సుమని కారాలు, మిరియాలు నూరుతున్నారు! దుస్సహవాసాలుచేసి పాడయిపోతున్నాడని మండిపడుతున్నారు. పోనీ అనుకుంటే వీడంతకన్నా బిర్రబిగుసుకుని పోతున్నాడు! మనిషికి కాస్త ఇంగితజ్ఞానం లేకపోయాక ఎన్ని విధాల తల మొత్తుకుంటే మాత్రం ఏమిటి లాభం! పాతికేళ్లు పైబడ్డ తరవాత ఇప్పటికయినా కాస్త మంచి, చెడ్డ తెలియకపోతే ఎలాగ? కొంచెం వెనక, ముందు ఆలోచించుకో నక్కర్లేదూ? ఇక ఎప్పటికి వస్తుంది బుద్ధి!'

తల్లి కూడా ఆవిధంగా తనమీద విరుచుకు పడ్డ తరువాత రంగనాయకు డిక ఒక్క క్షణమయినా ఆ ఇంటిలో ఉండలేక అల్లల్లాడిపోయాడు. ఇక ముమ్ముందు ఏది ఏమయినా సరే, అని గుండె రాయి చేసుకొన్నాడు. తొందర తొందరగా మధ్యాహ్నం భోజనం ముగించుకొని కొంచెంసేపు విశ్రమించి గోపాలస్వామి దేవాలయం గోపురం పై అంతస్తుమీదికి వెళ్లి కూర్చున్నాడు. అప్పటి కాతనికి రవంత మనశ్శాంతి లభించింది. ఒకవేళ తలవనితలంపుగా హేమసుందరి సందర్శనం తటస్థపడగలదేమో అని మరికొంతసేపు నిశ్చల దృష్టితో పరిశీలించాడు. కాని ఆమె కనబడలేదు! అయినా అతడు తన నిరీక్షణ విరమించలేదు!

అరగడియ గడచిన తరువాత అతనికి నాంచారమ్మఇంటికి వెళ్లవలసిన సమయం సమీపించిన దన్న విషయం జ్ఞప్తికి వచ్చింది. ఉలిక్కిపడి లేచి ఊరవతల కొబ్బరి, పోకల తోటలో చూచాయగా కనిపిస్తున్న ఆమె కుటీరంవైపు సాగిపోయాడు. ఒకేఒక అంగలో అక్కడికి వెళ్లి వాలిపోవాలని అనుక్షణము అతని మనస్సెంతయినా తహతహలాడింది! కాని తన సంగతి ఎవరయినా కనిపెడుతున్నారేమో అన్న అనుమానం అడుగడుగునా వెంటాడించి పీడించింది. అందుచేత అనుకొన్నంత తొందరగా అతని నడక సాగలేదు.

నాంచారమ్మకుటీరం ప్రాంగణంలో అడుగు పెట్టినంతలోనే ఆమె అతని కెదురుగా వచ్చి

# విశాలనేత్రాలు

23–వ పేజీ తరువాయి

ఎంతో ఆప్యాయంగా పలకరించింది. అంతలోనే రంగనాయకు డడిగాడు:

'హేమసుందరి ఏది? ఎక్కడ ఉంది?'

'ఎందుచేతనో గాని ఇంతవరకు రానే లేదు. ఆమె కోసమే పడిగాపులుపడి కూర్చున్నాను. ఎందుచేత ఇంత ఆలస్యం అయిందో!'

ఆ సమాధానం విన్న పిమ్మట రంగనాయకుని కిక ఊపిరే ఆడలేదు. ఏదో పెద్ద అవాంతరం వల్లనే ఆమె అక్కడికి రాకపోయి ఉండవచ్చునని అనుమానించి బాగా దిగాలుపడ్డాడు. అంతలోనే నాంచారమ్మ పెదవిమీద చిరునవ్వు తరలించింది:

'ఉత్తది! ఊరికే అన్నాను! కంగారు పడకండి! హేమసుందరి వచ్చింది. అదిగో ఆ గదిలో

---

"అయ్యా! మీరు ఎన్నికలకు ప్రచారంచేస్తూ "నేను నోట్లతో వోట్లను కొనలేదు. కొనబోను" అని చెప్పగానే జనం ఏం చేశారూ?" అని అడిగాడు విలేఖరి.

"కొందరేమో చప్పట్లు కొట్టారు. చాలామంది లేచి వెళ్లిపోయారు. మిగిలిన ఒకరిద్దరూ విసుక్కున్నారు" అన్నాడు నాయకుడు.

—ఎస్. చిట్టిబాబు.

---

తలుపుమూల నిలబడింది. మొట్టమొదట రాలేదని చెప్పమని పట్టుపట్టింది. అందుచేతే చిన్న అబద్ధం చెప్పాను! అంతే!'

రంగనాయకుడు అదికూడా ఇంకొక పరిహాసమేమో అనుకుని క్షణకాలం తటపటాయించాడు. అయితే మరు నిమేషంలోనే ఒక్క అంగలో ఆ గదిలో ప్రవేశించాడు. కాని హేమసుందరి అతని కెక్కడ కనబడలేదు. నలువైపుల పరిశీలించాడు. ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. అంతలోనే మంచంకింద దాక్కున్న ఆమె మెరుపులా ఇవతలికి వచ్చి అతని కట్టెదట నిలబడింది! రంగనాయకు డొక క్షణకాలం తన కన్నులే నమ్మలేక, నిర్ఘాంతపడి ఆ సుందరిని తన బిగికౌగలింతలో బంధించాడు. హేమ ఉక్కిరిబిక్కిరై 'అదిగో! నాంచారమ్మ వస్తున్నది! అదిగో! అదిగో!' అని మూపుడువేలెత్తి నిర్దేశించింది. రంగనాయకుడు తన గాఢాశ్లేషం సడలించి కొంచెం దూరంలో నిలుచున్నాడు. కాని నాంచారమ్మ ఆటునైపే రాలేదు. హేమసుందరి కలకల నవ్వు మాత్రమే ఆ గదిలో అంతట ప్రతిధ్వనించింది!

రంగనాయకు డంతలోనే తిరిగి హేమసుందరిని గాఢాలింగనంతో బంధించి పెడద కనుదోయి ముద్దుపెట్టుకొన్నాడు.

'హేమా! ఇక మనం ఒక క్షణమయినా నిచుళాపురంలో ఉండలేము! ఎక్కడికయినా వెళ్లిపోదామా?'

హేమసుందరి ఉసూరుమని నిట్టూర్చింది:

'ఎక్కడికి వెళ్లినా మా అమ్మ, రెడ్డి మనఇద్దరిని సుఖంగా బ్రతకనిస్తారా?'

'నీ కా భయం అక్కరలేదు! నే నున్నానుగా?'

'అయితే ఇంతమంది కన్నుగప్పి ఇక్కడినించి వెళ్లడ మెలాగ?'

'నీ కెందు కా గొడవ! నేను చూసుకుంటానుగా!' రెడ్డి నీకోసం వెంపరలాడుతున్నాడని కనిపెట్టింది కనక మాణిక్యవల్లి మన కేదో విధంగా సాయం చేసి తీరుతుంది. లేకపోతే అధమపక్షం చూచీ చూడనట్టయినా మాట్లాడ కూరుకుంటుంది.'

హేమసుందరి రవంతసే పాలోచించింది:

'ఆ మాట నిజమేగాని ఇంతకి ఎక్కడికి వెళ్లాలో ఆలోచించారా?'

'అదే ఆలోచిస్తున్నాను. నాలుగైదు రోజులలోనే నిర్ణయించి నాంచారమ్మ ద్వారా కబురు పంపిస్తాను. ఇక నువ్వు ఏ క్షణంలో నయినా సరే ఇక్కడినించి వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉండాలి! తెలిసిందా?'

'ఏమో! నా కిదంతా తలుచుకుంటే చాలా భయంగా ఉంది! నేను రాను!'

రంగనాయకు డా ప్రశ్న విని ఎంతో ఆశ్చర్యపడ్డాడు:

'ఇదేమిటి ఇలాగ మాట్లాడుతున్నావు! ఎందుకు నీ కింత భయం!'

'ఎక్కడి కయినా వెళ్లిన తరవాత మరి మన బ్రతుకుతెరువు మాటేమిటి?'

రంగనాయకుడు నిర్లక్ష్యంగా ఒక చిరునవ్వు చిందించాడు:

'అయ్యో! వెర్రిదానా! ఇదా నీ భయం! నే నీ సంగతి ఆలోచించలే దనుకొన్నావా? నీ కేవిధమయిన లోటు రానివ్వనులే!'

'నా మాట కాదు ఆలోచిస్తూంట! మీ మాట!'

'నా మాటకేంలే! నువ్వు సరసన ఉంటే నా కదే పదివేలు! ఇక ఎక్కడా లోటన్నమాటే అనిపించదు!'

అంతలోనే ఆ పక్క గదిలో నిలబడిన నాంచారమ్మ నెమ్మదిగా 'హేమా! మీ అమ్మ, అక్క తిరిగి వచ్చేవేళయింది! మరి ఆలస్యం చేస్తే మాటదక్కదు!' అని హెచ్చరించి, అక్కడికి వచ్చింది. హేమ ఉలిక్కిపడి 'అప్పుడే కొంచెం చీకటి పడ్డట్టుంది. మరి నేను వెళ్లాలి. మళ్లీ ఎప్పటికో మీ దర్శనం!' అని నిట్టూర్చి కంట నీరు పెట్టుకొన్నది. రంగనాయకు డామె కన్నీరు తుడిచి,చిక్కని ముద్దు ముద్రతో వీడ్కొని 'త్వరలోనే

# తెలుగు పత్రికలన్నిటిలో 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' సర్క్యూలేషన్ అధికమైనది


పాటల్లో ఆసక్తి కొందరికి...





కాని, ప్రతివారికి ఆసక్తి



Parry's ప్యారీ

మిఠాయిల్లోనే

ఎందుకంటే అవి రుచికరమైనవి, ఆరోగ్యకరమైనవి

రుచి చూచారా
• డైజెస్టివ్ మింట్సు
• ఆర్చర్డ్ ఫ్రూట్సు
• డెవన్ క్రీమీ టాఫీ

గమనించండి: ప్యారీస్ జావో, కాదో (రేపరుమీద ఈ పేరుంటుంది)

తయారుచేయువారు: ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మదరాసు.

JWT/PRS/322 ReV


## విశాలనేత్రాలు

అని ధైర్యంచెప్పి సత్వర గమనంతో తన ఇంటి వైపు సాగిపోయాడు.

హేమసుందరి, నాంచారమ్మ అతి త్వరితంగా నడక సాగించి అనతికాలంలోనే శృంగారమంజరి భవంతి చేరుకొన్నారు.

### 12

ఆ తరవాత నిచుళాపురంలో నాలుగయిదు రోజులు, ఎలాంటి విచిత్ర విశేషాలు లేకుండా నిమ్మకి నీరెత్తినట్లు సాగిపోయాయి. ఆపైన ఒకనాటి అర్ధరాత్రివేళ, తిరుమలరెడ్డి భవంతిలో హఠాత్తుగా ఒక పెద్ద గందరగోళం బయలు దేరింది! చాలాసేపటివరకు రెడ్డికి ఏమయినదీ, రవంతయినా అవగాహన కాలేదు. మొట్టమొదట అతనికి కొంచెం మెళకువ వచ్చింది. అంతలోనే నడినెత్తిమీద పిడుగువంటి ఒక పెద్ద ఆఘాతం తగిలింది! దానితో స్పృహతప్పి శయ్యమీదినించి జారి, చాపచుట్టగా నేలమీద కూలబడిపోయాడు! కొంచెం తెలివి వచ్చిన మరికొంతసేపటి కతని చెవులలో ఏదో కోలాహలం గింగురుమని మారు మ్రోగింది.

బాగా తెలివివచ్చిన తరువాత ఇరుగుపొరుగు తొందర తొందరగా అతని భవంతిలో ప్రవేశించారు. భార్య సరసనే కూర్చుని తలమీద తగిలిన గాయానికి కట్టు కట్టింది. నలుగు రయిదుగురు సాయంపట్టి తిరిగి అతనిని పాన్పుమీద పడుకో బెట్టారు. ఆ సమయంలో కుడి మోకాలు కొంచెం అటు ఇటు కదిలినంతలోనే రెడ్డి విపరీతమయిన యమయాతనతో గొంతెత్తి ఆక్రోశించాడు! ఇరుగు పొరుగువా రప్పటికి ఆ మోకాలు కీలూడినదని గ్రహించుకొన్నారు. వెంటనే శల్యవైద్యుడు కుమ్మరి గురవయ్యకి కబురుపెట్టి కట్టు కట్టించారు. కొంచెం తెల్లవారేవరకు ఇరుగుపొరుగు లలో తగు మనుష్యులు కొందరు రెడ్డిభార్య నోదారుస్తూ అనేక విధాల సాయపడ్డారు. మరి కొందరు చుట్టుమూగి ఎప్పుడో చాలాకాలం క్రితం జరిగిన అటువంటి దుస్సంఘటనలు కొన్ని ప్రస్తావించి ఎంతో విడ్డూరంగా తమలో తాము గుసగుస లాడుకొన్నారు. మరికొంతసేపటికి క్రమ క్రమంగా అందరు తమ తమ ఇళ్లకి వెళ్లి పోయారు.

బాగా తెల్లవారిన తరవాత రెడ్డి మనస్సు కొంచెం కుదుటపడింది. భార్య ముఖతః క్రమ క్రమంగా గతరాత్రి జరిగిన దుస్సంఘటన అంతా అతని కవగత మయింది.

అర్ధరాత్రి దాటిన తరవాత దొంగ ఎవడో భవంతిలో ప్రవేశించాడు. ఆపైన బాగా ఆదమరచి నిద్రిస్తున్న సింహాచలంమీద విరుచుకుపడి ఒళ్లు హూనంచేసి కాళ్లు, చేతులు విరిచికట్టి నోటిలో గుడ్డలు కుక్కి, రెడ్డి నిద్రిస్తున్న గదిలో జొర బడ్డాడు. మొట్టమొదట స్పృహతప్పి పోయేటంత గట్టిగా కొట్టి, మోకాలు కీలు తొలిగించి నోట

నొక్కులు నొక్కి ఒకమూల పడవేశాడు! కొన్ని నగలు, రత్నాలహారాలు, అయిదారువేల బంగారు వెండి శంఖచక్ర నాణకాలు చేజిక్కించుకొని, ఇరుగు పొరుగుల కళ్లు గప్పి చల్లచల్లగా జారుకొన్నాడు.

రెడ్డిభార్య ఆ పక్కనే ఇంకొక గదిలో నిద్రిస్తున్నది. భర్త పడినెత్తిమీద పడిన దారుణా ఘాతం సవ్వడి విని, ఉలిక్కిపడి లేచి నలు వైపుల పరిశీలించింది. ఆమె కేమి అంతు చిక్క లేదు! ఒకేఒక్క అంగలో భర్తగదిలో ప్రవే శించింది. పరుపుమీద ఆయన కనబడలేదు. పందిరి పట్టెమంచం కోడు దగ్గర పడిఉన్నాడు. శిరస్సు మీద తగిలిన గాయంలో నుండి రక్తం బొట బొట ప్రవహిస్తున్నది. విపరీతమయిన భయోద్వేగంతో ఆమె నోట మాటే వెలువడలేదు. చీర చెరగు చించి గాయానికి కట్టుకట్టి, గొంతెత్తి సింహా చలాన్ని పిలిచింది! కాని ఎక్కడ వాడి జాడే విన బడలేదు. ఆ నిస్సహాయ స్థితి, భర్తమీద హఠా త్తుగా విరుచుకుపడిన ఘోరాపద తలుచుకొని తలుచుకొని ఆమె గొంతెత్తి గోలుగోలున విలపిం చింది. ఆ దీనాక్రోశం విని ఇరుగు పొరుగు అప్పటికి చేరుకొన్నారు. సింహాచలంకట్లు విప్పి, ఆమె నోదార్చి శాయశక్తులా తోడ్పడ్డారు.

తనవంటి గొప్ప వ్యక్తి భవంతిలో అంతటి ఘోరకృత్యం జరగగలదని తిరుమలరెడ్డి కలలో నయినా ఊహించి ఉండలేదు. కొంచెం తేరు కున్నాక సింహాచలాన్ని పిలిచి మాటిమాటికి అనేక విధాల ప్రశ్నించాడు. ప్రయోజనం కలగలేదు. ఆదమరచి నిద్రిస్తున్న సమయంలో హఠాత్తుగా దుర్మార్గు డెవడో మీద విరుచుకుపడి, చావగొట్టి నోట గుడ్డలు కుక్కిన సంగతి మాత్రమే తనకి తెలుసునని, అంతకంటె తా నేమీ ఎరగనని చెప్పి వాడు కంట నీరు పెట్టుకొన్నాడు. రెడ్డి మరి లాభంలేదని నిశ్చయించి ఇరుగు పొరుగుల ద్వారా తలవరికి కబురు పంపించాడు. అతడు వచ్చి వ్యవ హారం అంతా విని చల్ల చల్లని మాటలతో రెడ్డి నోదార్చి ఎలాగో అలాగ త్వరలోనే ఆ పాపిని పసి కట్టి రూపుమాపి వేయగలనన్నాడు. తన కది ఒక ఘనకార్యమే కాదు పొమ్మన్నాడు. ఇక ఒక క్షణ మయినా ఆలస్యం పనికిరాదని చెప్పి సెలవు తీసు కొని తిన్నగా దండనాయకుని భవంతివైపు సాగి పోయాడు!

రెడ్డి మొకాలి కీలు బాధ క్రమక్రమంగా ఎక్కువయింది. ఎన్నివిధాల చికిత్స చేసినా అది రవంతయినా తగ్గలేదు. అపార ధనాపహరణం కన్న, దానికి సంబంధించిన దుర్భరావమానమే అతని నెక్కు వగా వేధించింది. ఎవడో దొంగ తనవంటి మహా ధన వంతుని లోగిలిలో జొరబడి, క్షణంలో తప్పించు కుని పారిపోయాడు ! మొకాలి కీలు తొలగించి అవమానించాడు. తలవరి, దండనాయకుడు కలిసి ఈవేళ కాకపోతే రేపయినా వాడి అంతు కను క్కొని, కాళ్లు చేతులు విరిచి కట్టించి కారాగారంలో పడవేసి ఉరి తీయించవచ్చును! కాని అంతమాత్రం చేత తన పరాభవ యాతన ఉపశమించగలదా ? అస లంతటి గుండెలుతీసిన బంటెవడు ? వాడు పట్టి ధనాశతోనే తన భవనంలో జొరబడ్డాడా ? లేక అవిధంగా తన పగ తీర్చుకొన్నాడా ? ఒకవేళ రంగనాయకుడే అవిధంగా తన కసి తీర్చుకోలేదు కదా ! అతనికి తనమీద అంతటి పట్టరాని అక్కసున్ని కలగడాని కెక్కడ ఆస్కారం లేదే ? సింహాచలం దేవాలయంలో అతని ఒళ్లు హూనం చేసినట్టు మాత్రమే చెప్పాడే ! అంతేనేగాని ఇంకొక సంగతే ఎత్తుకోలేదే ! తాను పనికట్టుకొని కొట్టించిన సంగతి రంగనాయకునికి రవంతయినా తెలిసి ఉండదే! కనక అతని కీ దొంగతనంతో సంబంధం ఏమి ఉంటుంది ? అయితే ఇంతటి ఘోరకృత్యం తలపెట్టిన దుస్సాహసి ఎవడు ? రెడ్డి ఆలోచన లావిధంగా తరపరంపరలా సాగిపోయాయి. కాని ఎన్నెన్ని విధాల తల బద్దలు కొట్టుకున్నా అసలు సమస్య తెగలేదు.

అప్పటికి జాము పొద్దెక్కింది. అంతలోనే ముత్యాలు గదిలో అడుగుపెట్టి నాంచారమ్మ వచ్చిందని చెప్పింది. వెంటనే లోపలికి తీసుకు

---

"మీరు పాడుతున్నప్పుడు తలుపులన్నీ వేసుకుంటారే... మీ గానమాధుర్యం ఎవరూ వినరాదనా ?" సుబ్బారావును అప్పారావు అడిగాడు. "ఊహూఁ... కాదు అది విని లోపలికి గార్ధభేంద్రుని కుటుంబం రాకుండ రక్షణ" అన్నాడతడు.

విష్ణుమూర్తి (కొవ్వ)

---

రావలసిందని ఆజ్ఞాపించి, రెడ్డి ఏకాగ్రదృష్టితో ఆమె రాకకోసం నిరీక్షించాడు. నాంచారమ్మ కళ్ళెదట నిలబడగానే అతని భార్య దుసరుస లాడుతూ లేచి పక్కగదిలోకి వెళ్లిపోయింది! నాంచారమ్మ రెడ్డి పరిస్థితి గమనించి నిలువునా నిర్ఘాంతపడి 'ఇంతటి ఘోరం జరిగినట్టు తెలియ లేదు బాబూ ! దొంగ సంగతి మా కిప్పు డిప్పుడే తెలిసింది. న న్నొకసారి త్వరగా వెళ్లి చూసి రమ్మని పంపించారు. అయ్యో ! ఎంతపని జరి గిందీవేళ ! అయితే అక్కడ జరిగిన మోసం మీకింకా తెలియనే లేదా !' అన్నది.

'ఏమిటది ? ఏమి జరిగింది ?' రెడ్డి ఎంతో ఆత్రంగా అడిగాడు.

'హేమసుందరి, రంగనాయకుడు కలిసి హఠా త్తుగా ఎక్కడికో పారిపోయారు !'

'ఆఁ ఆఁ ఎప్పుడు ?'

'నిన్న రాత్రి తెల్లవారుజామున.'

అయితే ఇక్కడ దొంగతనం జరిగిన తరవాతే 'వాళ్లిద్దరు కలిసి పారిపోయారన్నమాట! ఎంతపని జరిగింది! తప్పకుండా ఆ దొంగ రంగనాయకుడే! సందేహంలేదు. అయితే నాంచారమ్మా ! మీ అందరి కళ్లు కప్పి వాళ్లెలాగ పారిపోయారు ?'

'ఇందులో కళ్లు గప్పడాని కేముంది బాబూ ! ఇద్దరు కలిసి ఏమేమి పన్నాగాలు పన్నుకున్నారో మరి! మన కేం తెలుస్తుంది? నిన్న తెల్లవారు జామున మా ఇంటి కెదురుగా బోయీల కోలా హలం వినిపించింది. కొత్త పెళ్లికుమార్తె ఎవరో అత్తవారింటికి వెడుతున్నదని అనుకుని ఎంతో సంబరపడ్డాము. అంతేనే గాని అంతలోనే కొంప మునిగిపోతుందని అనుకోలేదు!'

'సరేలే ! ఇంతకి ఏమి జరిగింది ?' రెడ్డి కొంచెం విసుక్కున్నాడు. మళ్లీ నాంచారమ్మ మొదలు పెట్టింది :

ఆ మేనా మన లోగిలి ముందు కొంచెంసే పాగింది. బోయీలు భుజాలు మార్చుకుంటున్నా రేమో అనుకున్నాము. ఆ తరవాత మెరుపులా ఆ మేనా అక్కడినించి వెళ్లిపోయింది! 'తెల్లవారిన తరవాత మరి హేమసుందరి జాడే కనిపించలేదు! ఎక్కడికి వెళ్లిందో అని వీధి నాలుగు మూలల గాలించాము. ఎక్కడా కనబడలేదు! బాగా తెల్ల వారిన తరవాత రంగనాయకు డెక్కడికో పారి పోయాడని తెలిసింది. అందుచేత అతడే ఈ మేనాలోవచ్చి హేమసుందరిని వెంటబెట్టుకుని వెళ్లి పోయి ఉంటాడని అనుమానించాము. మీ ఇంట్లో జరిగిన దొంగతనం సంగతి తెలిసిన తరవాత ఊరు వాడ అదే మాట అంటున్నారు. ఇంతకి వాళ్లిద్దరు ఏకమయిన తరవాత మనమేం చెయ్యగలం బాబూ !'

ఆ ఘోర వృత్తాంతం విన్నతరువాత మరి కొంతసేపటివరకు రెడ్డినోట మాటే వెలువడ లేదు ! క్రమక్రమంగా లోలోపల రాజుకొంటున్న ఆగ్రహావేశంతో అతని కళ్లు రెండు చింత నిప్పుల్లా ఎర్రబడ్డాయి. అయినా పిడికిలి బిగించి అతడది నిగ్రహించుకొన్నాడు. రవంతసేపు ఏదో ఆలోచించి ఉసూరుమని నిశ్వసించాడు:

'నాంచారమ్మా ! ఎంతటి రహస్య మయినా మరు క్షణంలోనే అతగాడికి తెలిసిపోతూంది ! ఇంతకి పైవాళ్లెవరో, మనవాళ్లెవరో తిన్నగా తెలిస్తే గదా మన రహస్యం దాగడానికి ! చిన్నప్పటినించి హేమసుందరిని పెంచి పెద్దదానిని చేశావుగదా ! కొంచెం ముందుగా చూచాయగా నయినా నీతో ఈ మాట చెప్పలేదా ?'

'లేదు బాబూ ! చెబితే రెక్కలు కట్టుకుని వచ్చి మీ చెవిని వెయ్యనా ! నాదాకా ఎందుకు ? అక్కతో కూడా ఆ అమ్మ ఈ మాట ఎన్నడు చెప్పలేదట! నెత్తి, నోరు బాదుకుని ఆమె పొద్దుటనించి ఒకటే గోల ! కూతుళ్లిద్దరు ఏకమై తన ఇల్లు గుల్ల చేస్తున్నారని ఆ పెద్దావిడ ఒకటే ఘోష ! ఏం చెప్పను ? ఆ ఇంట్లో అడుగు పెట్టడమే యమ యాతనలా తయారయింది బాబూ!'

'సరేలే గాని నగలు, నాణ్యాలు ఏమయినా పోయాయా ?'

'పోకేం ? ఆ అమ్మ చేయించిన నగలన్నీ హేమ సుందరి ఒంటిమీదే ఉన్నాయి. ఆపైన ఆమె రత్నాలమాల, మిరియాలపేరు కూడా హేమ

మెంటలోనే ఉన్నాయట ! అందుకనే ఆవిడ నెత్తి, నోరు బాదుకుని వలవలా ఏడుస్తూంది! పోనీ ఈవేళ రాకపోతే రేపయినా మీ రొక్కసారి అక్కడికి వచ్చి—'

'రావాలనే ఉంది వాంచారమ్మా ! కాని రాత్రి జరిగిన గందరగోళంలో కుడి మోకాలు కీలు తొలగిపోయింది. అధమం పదిపదిహేను రోజుల దాకా మంచందిగడానికే వల్లపడదంటున్నాడు వైద్యుడు. లేకపోతే నే నీపాటికి రెక్కలుకట్టుకుని వెంటాడించి వాడి అంతు కనుక్కోనూ ?'

'అయ్యో ! పాపం. ఎంత పని జరిగింది ! ఇం కెవరికి దెబ్బలు తగలలేదుకదా !'

'తగలకేం ! సింహాచలానికి గట్టి దెబ్బలే తగి లాయి! మొండి ఘటం కనక వాడవి లక్ష్యపెట్ట కుండా తిరుగుతున్నాడు. ఇంకొకళ్లయితే ఈపాటికి మంచంపట్టవలసిందే !

'అయ్యో ! పాపం ! అలాగా !' అని వాంచారమ్మ అతని దగ్గిర సెలవు తీసుకుని తిన్నగా శృంగారమంజరి భవంతి- బయలుదేరింది. ఆమె వెళ్లిన తరువాత రెడ్డి కొంచెం గొంతెత్తి 'ఒరేయ్! సింహాచలం!' అని పిలిచాడు. వెంటనే వా డక్కడికి వచ్చి 'పిలిచారా ! బాబూ !' అన్నాడు. హేమసుందరీ రంగనాయకుల సంగతి చెప్పి, రెడ్డి వాడి ముఖవైఖరి నిశితంగా పరిశీలించాడు:

'ఎలాగ తెలిసిందో గాని నేను కొట్టించిన సంగతి కనిపెట్టి గట్టిగా పగ తీర్చుకుని హేమసుందరితో కలిసి పారిపోయాడురా వాడు !'

'ఎవడు బాబూ ! వాడు ?'

'ఇంకా ఎవడని అడుగుతా వేమిటి ? ఆ రంగనాయకుడే ! .... అయితే ఈ మాట ఎలాగ తెలిసిందిరా వాడికి ?'

'ఏమో బాబూ ! నా కేమి అంతుపట్టడంలేదు!'

'సరేగాని నువ్విప్పుడు ఒకసారి తలవరి దగ్గిర ఈ గొడవ సంగతి చెప్పి రా ! నిలుచున్నపాటుగా జమా బట్టీలలాంటి రౌతులు నాలుగు మూలల గాలిస్తే వా డెక్కడో అక్కడ దొరక్కపోడు !'

సింహాచలం క్షణకాలం ఆలోచించి అడిగాడు :

'వాళ్లు ఎటువైపు వెళ్లారో తెలిసిందా ? బాబూ !'

'సరిసరి! తెలిస్తే నాలుగు మూలల గాలించడ మెందుకు ? ఏది ఏమయినా సరే, నే నిక ఆ రంగన్న గాడి అంతు చూడనిదే మరి నిద్రపోదలుచుకోలేదు. త్వరగా వెళ్లిరా ! నువ్వు కూడా కొంచెం ఆరా తియ్యి!'

'అలాగే బాబూ ! తమ కింత తలవంపు జరిగిన తరవాత కుక్కిన పేనులా మాట్లాడ కూరుకుంటా ననుకున్నారా ! ఆ తలవరిబాబు రౌతుల నెవ్వరిని పంపించకపోయినా సరే ! ఎక్కడ తల దాచుకున్నా ఎలాగో అలా వెంటాడించి వాడి రక్తం కళ్లజూస్తాను.'

'ఎందుకు పంపించడు ! స్వయంగా నేను అడిగానని చెప్పు. వీలయితే వెంటనే ఆయన నిక్కడికి తీసుకురా! మరి ఆలస్యం చెయ్యకు! బయలుదేరు! ఇంకా నిలబడ్డావేం !'

సింహాచలం ఒక్క అంగలో వీథిలో పడ్డాడు! ఆతగాడికి బాగా గట్టి దెబ్బలే తగిలాయనీ, అందుచేత ఎలాగయినా రంగన్న అంతు కనుక్కొని తీరతాడనీ నిశ్చయించుకుని రెడ్డి ఎంతో సంతోషించాడు.

వాంచారమ్మ తిరిగి వెళ్లి రెడ్డి భవంతిలో జరిగిన సంఘటన అంతా శృంగారమంజరికి పూస గుచ్చినట్టు చెప్పింది. అసలే ఆమె హేమసుందరి పారిపోయినందు కెంతో ఆరాట పడుతున్నది ! ఆపైన తలవని తలంపుగా ఇంకొక పెద్ద పిడుగు విరుచుకుపడింది. ఆమె చిన్నకుమార్తె మీద పుట్టెడాశ పెట్టుకొన్నది. క్షణంలో అవి అన్నీ అడుగంటిపోయాయి! పైగా రెడ్డి మోకాలు కీలూడింది! అది ఎప్పటికి నయ మవుతుందో! కొంచెం వయస్సు మళ్లిన తరువాత కాలు వంగిన దంటే, తిరిగి కోలుకోవడాని కెంతకాలం పట్టగలదో ఎవరు చెప్పగలరు!

మాణిక్యవల్లి ఇన్నాళ్లనించి హేమసుందరి ఎక్కడికయినా వెళ్లిపోతే తన మార్గం నిష్కంటకం కాగలదని ఉవ్విళ్లూరింది. ఆమె రంగనాయకునితో కలిసి పారిపోవడాని కెంతో సాయం చేసింది. కాని తలవనితలంపుగా రెడ్డిమీద విరుచుకుపడిన పిడుగు వద తలుచుకుని తలుచుకుని కుమిలి దుఃఖించింది. తా నొకటి తలిస్తే దైవం వేరొకటి తలపెట్టగలడన్న సామెత ఆమె యెడల అక్షరాల యథార్థమయింది! అంతే కాదు. తన గోడు పైకి వెళ్లడించడాని కయినా అవకాశంలేక గుడ్లనీరు కుక్కుకుని కృశించింది. ఆ భవంతిలో ఒక్క వాంచారమ్మ మాత్రమే లోలోపల హేమసుందరి తప్పించుకుని పారిపోయినందు కెంతో సంతోషించింది. దానికి వేరే కారణ మేమి లేదు ! హేమసుందరి ఆమె ఎన్నడు ఊహించలేనంత మొత్తం ముట్టచెప్పింది!

రెడ్డిపోరు భరించలేక తలవరి రంగనాయకుని కోసం నిచుళాపురం పరిసరాలన్ని చాలా జాగ్రత్తగా గాలించవలసిందని కొంతమంది రౌతుల కాజ్ఞాపించాడు.

అలాగలాగ అయిదారు రోజులు గడిచిపోయాయి. అయినా ఎక్కడ రవంతయినా రంగనాయకుని జాడ పొడకట్టలేదు ! ఎన్నెన్ని ప్రక్రియలు చేసినా రెడ్డి మోకాలు కీలు తిన్నబడలేదు. లేకపోతే అతడే స్వయంగా రంగనాయకుని అన్వేషణకోసం రౌతుల నెంతమందినో ఉరికించి ఉండేవాడే !

అలాగ మరికొంతకాలం గడిచిన తరువాత రెడ్డి మనస్సులో రంగనాయకుని యెడల ప్రజ్వరిల్లిన విద్వేషాగ్నిజ్వాల రవంత చల్లారక పోలేదు ! అయితే అశక్తదుర్జనత్వం ఒక్కటే దానికి కారణం! కాని సింహాచలం క్రోధావేశం మాత్రం కొంచెమయినా శాంతించలేదు. స్వయంగా తానే నడుం కట్టుకొని ఎప్పటికయినా సరే, రంగన్న జాడ పసికట్టి పగ తీర్చుకుని తీరాలని వా డదేపనిగా భీష్మించుకుని కూర్చున్నాడు. ఆ తీవ్ర ధోరణి గమనించి రెడ్డి లోలోపల మిక్కిలి ఉప్పొంగి శాయశక్తులా ప్రోత్సహించాడు. సొమ్మెంత ఖర్చయినా సరే, మరి వెనక ముందు ఆలోచించనక్కరలేదని గట్టిగా భరవసా ఇచ్చాడు. దోసిళ్లతో బంగారు, వెండి శంఖచక్రాలు గుమ్మరించాడు. దానితో సింహాచలం వీరావేశం మరింతగా విజృంభించింది!

—ఇంకా ఉంది.



తుండగా ఒక దడిగాడు బరబ్బాస్‌ని: "చావబోయేవాని మనస్సెలా వుంటుంది" ఈమాటకు బరబ్బాస్ సమాధానం చెప్పేవాడో లేదో కాని, చెరసాల తలుపులు తెరుచుకున్నాయి. బరబ్బాస్ తిరిగి చూచాడు.

రోమన్ సైనికులతో లూసియస్ లోపల ప్రవేశించాడు. సైనికులు ఇరువురు దొంగలను తీసుకువెళ్లారు. ఇంక లోపల మిగిలిందల్లా...విజితుడు బరబ్బాస్... విజేత సిలూయస్.

లూసియస్ చెరసాల తలుపు దగ్గరే చేతులుకట్టుకు నిలబడి వున్నాడు. అతనికి కొద్దిదూరంలో గొలుసుల బంధనాలలో బరబ్బాస్ వున్నాడు. ఇద్దరూ ఒకరి కెదురుగా ఇంకోరు.

"నాజరెత్ నివాసి జీసస్ నెరుగుదువుకదూ?" బరబ్బాస్ ఔనన్నట్లు తలూపాడు. రెండో ప్రశ్న వచ్చింది లూసియస్ నుంచి "అతడు మరణశిక్షకు అర్హుడేనా ?"

"ఆ అర్హత అతనికన్న నాకే ఎక్కువ" బరబ్బాస్‌మాట పూర్తి కాకుండానే "అతనితో నిన్ను పోల్చుకుంటున్నావా? ఎంత ధైర్యం నీకు" అని లూసియస్ అడ్డంవచ్చి గొలుసులు వూడదీయ ప్రారంభించాడు. బరబ్బాస్ వెంటనేసమాధానం చెప్పాడు. "మా ఇద్దరి ధ్యేయం ఒకటే. ప్రజలందరి సమాన స్వేచ్ఛ. అయితే అనుసరించిన మార్గాలు మాత్రం వేరు. అతని కెప్పుడు శిక్ష అమలు?"

"ఇప్పుడతడు క్రాస్ మోసుకుపోతున్నాడు." లూసియస్ అతి ఆర్ద్రంగా నెమ్మదిగా సమాధానం

## కింగ్ ఆఫ్ కింగ్స్

21-వ పేజీ తరువాయి

చెప్తూ ముందుకు వచ్చాడు. వాక్యంలో ఒక్కొక్క పదము వాడిములుకులవలె దూసుకుపోగా బరబ్బాస్ "ఈ మాట నాతో చెప్పట మెందుకూ? నన్నూ అందరితోపాటు తీసుకువెళ్లండి, ఆ శిక్షేదో త్వరగా కానిస్తే సరిపోదూ...?" బొబ్బలేయటం మొదలుపెట్టాడు. ఈలోగా లూసియస్ బరబ్బాస్‌నుబంధించిన గొలుసులు ఊడదీశాడు.

---

బొగ్గుగనిలో పనిచేసే కూలీ ఒకడు బోనులో సాక్ష్యం చెబుతున్నాడు. అతని చేతులు నల్లగా వున్నాయి.

జడ్జి :— ఆ "గ్లోవ్స్" తీసేయవయ్యా.

కూలీ :— తమరు సులోచనాలు పెట్టుకోండి సామీ.

చిట్టిబాబు, (సైనపూర్)

---

"వెళ్ళు ... నీకు స్వేచ్ఛ లభించింది!" బంధనాలువిడిన చేతులు నులుముకుంటున్న ద్వారం దగ్గరికి పోయిన బరబ్బాస్‌కు మాటలు దొరకలా. 'ఎలా' అని మాత్రం అడిగాడు.

"మా దేశాచారం ప్రకారం ప్రతియేటా ఈరోజున ప్రజలు కోరుకున్న ఒక్కర్నిమాత్రం విడుదలచేస్తాం. ప్రజల్లో అధికులు నీ విడుదలే కోరారు. నీకు మారుగా మరణిస్తున్న ఆవ్యక్తిని సందర్శించు పో!" అన్నాడు లూసియస్.

ఆ కంఠంలో బరబ్బాస్ పట్ల ద్వేషమూ, జీసస్‌పట్ల జాలి ధ్వనించాయి.

జీసస్‌చే సిలువను మోయిస్తూ శిక్షాస్థలానికి రోమనులు తీసుకువెళ్లారు. బరబ్బాస్, జూడాస్, మేరీ మాగ్దలీన్ ఇంకా తదితర స్త్రీలు శిక్షాస్థలానికి వెంబడించారు. సిలువ బరువుకు నవయువకుడు జీసస్‌కూడా తాళలేక ఒకచోట ముందుకు పడిపోయాడు. అప్పుడు జనసమూహంలోంచి ఓ యువతి వచ్చి అతనికి సహాయపడి, ముఖం తుడుచుకునేందుకు పట్టుగుడ్డను ఇచ్చింది. ఆమెను పిలేట్ భార్య క్లాడియాగా గుర్తించిన జీసస్ చిరునవ్వుతో కృతజ్ఞత తెల్పాడు సెరోకరు సిలువ మోసుకు రాగా జీసస్ శిక్షా స్థలానికి వెళ్ళాడు.

సిలువ స్తంభాన్ని లేవనెత్తారు. జీసస్‌ను దానికి బంధించి మేకులు కొట్టారు. అతని కిరుప్రక్కలా ఇద్దరు దొంగలకుకూడా అదే శిక్ష విధించారు. వాళ్లు "నీవు నిజంగా ముక్తిప్రదాతవే ఐతే నిన్ను రక్షించుకుని మమ్మల్ని రక్షించు." అని జుగుప్సాభావంతో హేళన చేశారు. "ఈ రోజున మీరు నాతో స్వర్గధామంలో హాయిగావుంటారు" అని జీసస్ సమాధానం చెప్పాడు.

సూర్యుడు సాయంవిభాగంలోకి వచ్చే సమయానికి "తండ్రీ! నీ చేతుల్లో ఆత్మార్పణం చేసుకుంటున్నాను." అని జీసస్ అన్నమాట ఎక్కడినుంచో విన్పించినట్లు వినిపించాయి. వెంటనే పపంచం అంతటా ఆవరించిన అంధకారం మధ్య ఓవింత మెరుపు మెరిసి పడింది.

జీసస్ సిలువ ముందున

ఫిలిం స్టార్ లెదర్ సోల్ నైలాన్ ప్లాస్టిక్ పాదరక్షలు.




స్త్రీలకు, కాలేజీ విద్యార్థులకు మిక్కిలి అందమైన డిజైనుల లోను, ఆకర్షణీయమైన రంగులలోను లభించును. కొలతలు పంపండి. ధర: స్పెషల్ రు 5/75. కాశ్మీర్ రు 7/25. పోస్టేజి రు 1/50 అదనం. ఏదైనా రెండు జతలు కొనువారికి పోస్టేజి ఉచితం. ప్రతిఆర్డరుతో రు. 2/- అడ్వాన్సు పంపండి. తృప్తికరముగా లేనియెడల డబ్బు వాపసు చేయబడును. ఉత్తరాలు ఇంగ్లీషులో వ్రాయండి. వ్యాపార వివరాలకు వ్రాయండి.

ALANKAR TRADERS (APM)
Gandhi Bagh, Nagpur-2.



పామొలీవ్ లవెండర్

హాయిందాగాను... అందముగాను...
వుండు మనోహరమగు సువాసన!




ఇవి యిప్పుడు మీకు పామొలీవ్ టాల్కులో లభించును. కొంచెము పామొలీవ్ లవెండర్ మీ చర్మము మీద చల్లుకొన్నచో, ఉత్తేజపరచే సువాసన మీ చుట్టూ వెదజల్లును. పామొలీవ్‌ను వాడి ఎల్లప్పుడూ తాజాగాను, ఆహ్లాదముగాను వుండండి.

పామొలీవ్ డీలక్సు-17 విదేశీ సువాసనలుగల మిశ్రమము!

 PT. G. 6. TEL


## కింగ్ ఆఫ్ కింగ్స్

మోకాళ్లమీద కూర్చున్న క్లాడియాకు తనప్రక్కగా లూసియస్ నమస్కరిస్తూంకటం కన్పించింది. "అతడే క్రీస్తు" (ముక్తిప్రదాత) అని అతడు అనుకొన్న మాటలు కూడా ఆమెకు వినిపించాయి.

జీసస్ మరణించిన ప్రదేశం చూచేందుకు వస్తున్న బరబ్బాస్‌కు గెత్సెమెన్ ఉద్యానంలో జూడస్ ఉరిపోసుకొని చెట్టుకు వ్రేలాడటం కన్పించింది.

జీసస్ సమాధిముందర ప్రార్థనలు సల్పుతున్న మేరీ మాగ్దలీన్ కళ్ళు తెరిచేసరికి సాబత్ దినాన జీసస్ శరీరం కన్పించలేదు. (అరిమతియా నివాసిజోసఫ్ జీసస్ శవాన్ని సమాధిలో పదిలపరిచాడు.) ఆ సమాధివంక అలా చూస్తూ "ఆయన సమాధినుండి పునః ఉద్భవించాడు" అని అంది.

గెలిలీ సముద్రతీరాన వున్న జీసస్ శిష్యులకు ఓ నీడ కన్పించింది. వారు మోకాళ్ళమీదవంగి నమస్కరించారు. తలపైకెత్తి చూచారు. ఆ ఛాయకు ఆలంబనమైన జ్యోతిర్మూర్తిని చూడగానే వారి ముఖారవిందాలు వికసించాయి.

ఆతడు మహోన్నతుడు, మహోత్కృష్టుడు. స్వార్థరహితుడు. లోకుల పాపాలకుగాను, ఆత్మత్యాగమొనర్చి పునరుద్భావం చెందిన ఆ తేజోమయమూర్తి దివ్యవాణి తరతరాల, దేశదేశాల ప్రజల మనస్సుల్లో మెరుస్తూ సంతత మోదాంత గాథగా వెలుగుతూ వుంటుంది. (సమాప్తం.)

చిత్రకథానువరణ "నాగరాజ్"

# పాపం పసివాడు

17 వ పేజీ తరువాయి

సర్వరు తెచ్చిన ఇడ్లీ తింటానికి ఉపక్రమించాడు సుబ్రహ్మణ్యం. ఇంతలో పక్కనించి ఇడ్లీ ప్లేటు, సాంబారుసమేతంగా ఎగిరి సుబ్రహ్మణ్యం మీదగా దూసుకుపోయి కింద పడింది.

'సారీ ! సార్ ఎక్స్యూజ్ మి.' అన్నదో గొంతు.

సుబ్రహ్మణ్యంతల తిరిగిపోయింది. ఎదుట కూచున్నాయన ఇంకా క్షమాపణలు చెప్పుకుంటూనే ఉన్నాడు. ఏడవలేక నవ్వుతూ 'ఫర్వాలేదులెండి' అన్నాడు మొహంమీద చిమ్మిన సాంబారు తుడుచుకుంటూ.

పేపరుబోయ్ కనుపించాడు హోటలు ముందు. రిజల్ట్సు పడేఉంటాయి అన్న ఆదుర్దాతో చివాల్న లేచి, అడ్డంగా ఉన్న మూడు కుర్చీలలోని శాల్తీలను తోసుకుని బయటపడ్డాడు.

ఆ ముగ్గురూ ముక్తకంఠంతో సుబ్రహ్మణ్యం కనపడుతున్నంతసేపు తిడుతూనే ఉన్నారు.

'రిజల్ట్సు పడ్డాయా' అని అడిగాడు.

'పడినయి సార్' అన్నాడు పేపరు కుర్రాడు.

డబ్బులిచ్చి పేపరు తీసుకుని బార్లా తెరిచాడు పేపర్ని, రిజల్ట్సు చూసే ఆదుర్దాతో.

'హోటలు కడ్డంగా నిలబడ్డావేమయ్యా సినిమాపోస్టరులా పేపరూ, నువ్వూ' అన్నాడొకాయన సుబ్రహ్మణ్యాన్ని పక్కకు నెట్టి లోపలికి పోతూ.

వినుక్కుంటూ కొంచెం పక్కకి జరిగాడు. కిళ్లీకొట్టతను గుడ్లురిమి చూశాడు. సుబ్రహ్మణ్యం వాటం చూస్తే తెరిచిపట్టుకున్న పేపరుతో అసలే పెడల్పుతక్కువున్నకిళ్లీకొట్టును మూసేటట్టున్నాడు.

సణుక్కుంటూ, పదడుగులదూరంలో ఎదురుగా రోడ్డు అవతల ఉన్న మునిసిపాలిటీ చెత్తకుండీదగ్గరకు వెళ్లి ఒకపక్కగా నిలబడి పేపరు తెరిచాడు అక్కడింకేం అభ్యంతరం ఉండదని.

ఇంతలో ఇంకో బుర్రకూడ పేపరుమీదికి వంగింది. ముక్కుపొడుం కంపుగొడుతుంటే పక్కకు తలతిప్పాడు సుబ్రహ్మణ్యం.

'వారఫలాలు జూద్దామనీ ....' అన్నాడాయన.

చిర్రెత్తుకొచ్చింది సుబ్రహ్మణ్యానికి. ఇటు పక్క కుండీలోంచి కుళ్లువాసన, ఘరోవేపు నుంచి పొడుంకంపు. పేపరు ఆయనకు అందించాడు గత్యంతరం లేక.

రెండుముక్కుల్నిండా బుర్రున పొడుం పీల్చి తన ఇంట్లో ఉన్న చిన్నా పెద్దా, అందరి వారఫలాలు వివరంగా చదువుకుని పేపరు సుబ్రహ్మణ్యానికిచ్చి నిష్క్రమించాడు ఆ పెద్దమనిషి.

గాభరాగా పేజీలు తిరగేశాడు. నాలుగో పేజీలో మధ్యన ఒక కాలంపొడుగునా పైనించి కిందదాకా కనపడ్డాయి ఏవో నెంబర్లు.

గుండె చేస్తున్న ఆర్భాటం షర్టుకింద నుంచి చెవుల్లోకి రవాణా అవుతోంది 'లబో దిబో' మని.

తీరా చూస్తే అవి హిందీ పరీక్షలకు సంబంధించినవి.

పేపరు కుర్రాడిమీద గొంతువరకు కోపం వచ్చింది. పత్రిక మడిచి చంకలో పెట్టుకుని **ఉమారుముంటూ రూయుసేమ ఇమ్మంటోటే**

**వాడెవడో టయిము అడిగాడు. తను పదకొం**డన్నాడు పరధ్యాన్నంగా. వాడేమో రైలుకింద పెట్టమన్నాడు వాచీని. ఇంతకూ గంగాభాగీరథీ సమానురాలయిన మామ్మగారి పిలుపు ఇదంతా అనే నిర్ధారణకు వచ్చాడు.

నీరసంగా గది తాళంతీసి లోపలికి అడుగు పెట్టాడు సుబ్రహ్మణ్యం. మామ్మగారిమీద ఎక్కడలేని కోపం వచ్చింది. కిటికీలోంచి చూశాడు. నూతిదగ్గరగా ఉన్న జామచెట్టుకు మడిబట్ట ఆరవేసింది మామ్మగారు.

మడిబట్ట ముట్టేసుకుందామన్నంత కోపం వచ్చింది. అదే ఆవిడకు తగిన ప్రాయశ్చిత్తం ! కాని, తీరా తను మడిబట్ట ముట్టుకునేప్పుడు ఎవరైనా చూస్తే పీవు తాషామరబా మోత ! ఆ సమయంలో — తన స్వీట్‌బ్యూటీ లావణ్యగనక చూసి పళ్లికిలిస్తే ఎంత అవమానం ! అందుచేత ఆపని మంచిదిగాదనుకుని మంచంమీద కూలబడ్డాడు.

ఇంతలో గుమ్మం అవతల గాజుల గలగలశబ్దానికి .... నాగస్వరం విన్న పాములాగ మెడ నిక్కించి చూశాడు సుబ్రహ్మణ్యం.

'మా బామ్మ మిమ్మల్నోసారి రమ్మన్నది" అన్నది లావణ్య గుమ్మం అవతల నించుని.

రక్తం గడ్డకట్టుకుపోయింది సుబ్రహ్మణ్యానికి. ఈ మామ్మగారు దేవాంతకురాలు ..... ఆవిడ మడిబట్ట ముట్టేసుకుందామనుకున్న సంగతి తెలుసుకోలేదుకదా ! అని భయపడ్డాడు. తర్వాత తనభయం ఆధారరహితం అని ధైర్యంతెచ్చుకున్నాడు.

ఈ గుంజాటనతో పిలవడానికి వచ్చిన లావణ్యకు సమాధానం ఇవ్వనేలేదు.

'ఎందుకూ' అని లేచి గుమ్మందగ్గరకెళ్లి అక్కడెవరూ లేకపోవడం చూసి హతాశుడయ్యాడు. లావణ్య వెళ్లిపోయింది. 'ఎంత దురదృష్టవంతుడివిరానువ్వు'అనిస్వంతానికితిట్టుకున్నాడు.

'ఇంతకూ మామ్మగారు ఎందుకు రమ్మన్నట్టు' మళ్లీ అదే ప్రశ్న.

గదితలుపు దగ్గరగా వేసి పక్కభాగంవేపు బయలుదేరాడు. ఇంటిముందున్న క్రోటన్సు మొక్కలకు అడ్డంపడి వెళ్తుంటే కిటికీలోంచి చూస్తున్న ఇంటివారమ్మాయి ప్రాణం ఉసూరుమంది.

ఎన్నాళ్లనుంచో ప్రాణప్రదంగా పెంచుకుంటున్న మొక్కలు తొక్కిపాడుచేస్తున్నాడీఅద్దెకున్నఅబ్బాయి.

అసలే ముక్కుకు సూటిగా పోయేమనిషి సుబ్రహ్మణ్యం. సరాసరి హాలులోకి వెళ్లి 'మామ్మగారూ! ఎందుకు పిలిచారుట' అన్నాడు, లావణ్య కనపడుతుందేమోననే ఆశతో పక్కగదుల్లోకి చూస్తూ.

మామ్మగారు ముసుగుసవరించుకుంటూ వచ్చింది.

'వచ్చావా నాయనా. ఈనాటికి నీకు పని చెప్పక తప్పలేదు. మరేం అనుకోకు. మా అబ్బాయేమో, వాడిదోపని వాడు కోర్టుకు వెళ్లిపోయాడు ఏదో కేసుందని.'

బోలెడంత మొహమాటపడుతూ, 'ఫర్వాలేదు. దానికేం, చెప్పండి. నాకు సెలవేగా' అన్నాడు సుబ్రహ్మణ్యం.

'బజారుకెళ్లి ఒక పాతిక మామిడిపండ్లు, ఒక కట్ట తమలపాకులు తెచ్చిపెట్టు నాయనా. ఇవి **రెండు మర్చిపోయావ్మా పెళ్లిచూపులకని విశాల**


పండిత
డి. గోపాలాచార్యులవారి

అరుణ

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యాలకు

ఆయుర్వేదాశ్రమం
ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు 17

కుటికురా
అయింట్‌మెంట్
చర్మరక్షణకు శతాబ్దానికి
పైగా పేరుమోసింది.




మూటపడి సంవత్సరాలు ! ఇంత
కాలంగా ప్రపంచమంతటా కుటికురా
అయింట్‌మెంట్ ఉపయోగంలో
ఉందన్న మాట !
కుటికురా అయింట్‌మెంట్ చర్మంలో
తెచ్చే క్రిములను నాశనంచేస్తుంది.
పూరేడు కాయలూ, మొటిమలూ,
గజ్జి మొదలైన వాటిని రూపుమాపి
అవి మళ్లీ రాకుండా చేస్తుంది.
దీనిలోగల క్రిమిసంహార నూనెలు,
ఒరపును, చమట పొక్కులను,
పురుగుల కాట్లనూ నయంచేస్తాయి ; గీ
కోతలూ, కాల్పులను మాన్పుతాయి.

కుటికురా అయింట్‌మెంట్

కుటికురా టాల్కం పౌడరు
డబ్బా కొనండి — కుటుంబానికి
అంతటికీ ఉపయోగపడే బహుళ
వినియోగ టాల్కం పౌడరు

NATIONAL CO 3006 2B

# నెర్వి టాల్

నరముల బలహీనతకును, రక్త పోటుకున్నూ రామ బాణము. అనుభవ యుక్తముగా చేయబడినది.

8 ఔ. సీసా 5-75, పోస్టేజి 1-75.

ఇండియన్ మెడిసన్ హౌస్,

విజయవాడ-2.

## శ్రీబాలాంజనేయ ప్రశ్న

సంతానము, రోగములు, గ్రహబాధలు, వివాహం, పారిపోయిన పశువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలింపబడిన సొమ్ము, వీడిపోయినభార్య మొదలగు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలము. రూ 2 ఎం.ఓ. చేయండి. నెలలవారీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము రూ 2. పూర్తి పేరు, జాబు వ్రాసిన టైము తెలిపిన చాలును.

హనుమాన్ జ్యోతిషాలయము,

10వ లైను,అరండల్ పేట, గుంటూరు2.

## RATNAM'S N-OIL

(సైపూతకు మాత్రమే)

అంగనరములు బలహీనతి చెంది. చిన్న దినచో తిరిగి యథాప్రకారం అను భూతి పొందుట మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి కలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇంగ్లీషు స్పెషల్ రకం అర్జంటుగుణమునకు రూ. 25-0-0 లు.

డాక్టర్. రత్నం సన్స్, (Estd 1904

మలక పేటబిల్డింగ్స్, అజంపూరా నూర్ గంజ్ వద్ద, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

స్థాపితం: 1920

## రెడ్డి & కో. (రిజిష్టర్డు)

గోపాలపురం — తూ. గో. జిల్లా

బొల్లి, మేహపొడ, మేహమచ్చలు

వగైరా సమస్త చర్మవ్యాధులకు

ప్రత్యేక చికిత్స

శాస్త్రీయ ఆయుర్వేద ఔషధములు

లభించును.

కేటలాగు సలహా ఉచితం.


# పాపం పసివాడు

పట్నంనుంచి వస్తారు మధ్యాహ్నం. వాళ్ళు వచ్చే టప్పటికి అన్నీ అమర్చాలా.... మాపిల్ల భారం నీమీద వదలిపెడుతున్నాను సిన్నీ' అని నామీద వదిలేశా డాయన .... ఇంద ఈ అయిదురూపాయల కాయితం తీసుకో. అమ్మాయ్! సంచీ ఇవ్వమ్మా ఈ అబ్బాయికి', అని ఆజ్ఞ జారీచేసింది అయిదు రూపాయల నోటు అతని చేతిలో ఉంచుతూ.

లావణ్యను చూడటానికి పెళ్లివారు వస్తున్నారు!!!

శిలగా మారిపోయిన సుబ్రహ్మణ్యం మరబొమ్మ లాగా అందుకున్నాడు ఆ పిల్ల ఇచ్చిన సంచీ. అశని పాతంలాంటి వార్త తనచెవిన వెయ్యటమే గాక ఆ రాబోయే పెళ్లివారికోసం మామిడిపళ్లు తెమ్మని తనను పురమాయించడమా!

ఇదే ఇంకోసమయంలో అయితే ఎంతో సంతోషంతో అంగీకరించేవాడే! కాని ఇప్పుడు. తను ఎన్నాళ్లనించో నిర్మించుకుంటున్న గాలి మేడలు ఒక్కసారి కుప్పగా కూలిపోతున్న ఈసమ యంలో తనకు సంతోషం ఏమిటి చట్టుబండలు.

లావణ్య ఇచ్చిన సంచిని తీసుకుని బరువుగా అడుగులువేసుకుంటూ బయటికి నడిచాడు.

బయట గేటు దాటిందాకా చూసి, మామ్మగారు 'లావణ్యా! వచ్చినప్పుడున్నంత ఉషారుగా వెళ్లే టప్పుడు లేదేమే ఆ అబ్బాయి. బజారు వెళ్లమన్నా మని కోపమా ఏమిటి' అన్నది సందేహంగా.

'బావుంది. నాకేం తెలుసు. ఆ అబ్బాయినే అడక్కపోయావ్' అన్నది లావణ్య.

ముసుగు ముందుకు లాక్కుని వంట యింట్లోకి వెళ్లిపోయింది మామ్మగారు.

బజారుకు బయలుదేరిన సుబ్రహ్మణ్యం మనసు అమితంగా బాధపడిపోయింది.

ఒక్క క్షణంలో, పది లంకణాలు చేసినంత నీరసం ప్రవేశించింది వంట్లో. ఎటువంటి దుర్వార్త వినాల్సివచ్చింది. తన హృదయాధిదేవతగా ఆరాధించుకుంటున్న లావణ్యను చూసేందుకు పెళ్లివారు రావటమా! ఆ రూములో చేరిన రెండు సంవత్సరాలనుంచీ ఆమె పరిచయంకోసం తపించి పోతున్నది హృదయం.

పరిస్థితులు అనుకూలిస్తే, చందామార్కుడైన తండ్రి అంగీకరిస్తే,ఆపిల్ల తల్లీ,తండ్రీ, మామ్మగారు వగైరా అభ్యంతరం చెప్పకుండా ఉంటే లావణ్యను పెళ్లిచేసుకుందా మనుకున్నాడు.

తను వప్పేసుకున్నాడుగనుక తన పెళ్లి సగం ఖాయం అనుకున్నాడు. అంటే శాతముల లెక్కలో చెబితే ఏభై పర్సెంట్ అయిపోయినట్టే. కాని ఆశ నిరాశ అయిపోయింది. నీరసం ఆవరించింది. చేతిలో ఉన్న సంచీ విసిరి పారేద్దామను కున్నాడు సుబ్రహ్మణ్యం.

కాని మనసు ఒప్పలేదు. వెధవ మొహమాటం అడ్డొచ్చింది.

ఇంతకు తను లేచిన వేళా విశేషం అనుకుని బజారు చేరుకున్నాడు. మామిడిపళ్ళు, తమల పాకులు కొనుక్కుని అరగంటసేపు తిరుగు ప్రయాణంచేసి ,కొంపకి చేరుకున్నాడు.

**ఎటూ వరాయిది కాబోతున్న పిల్లతో మొహ మాటం, సిగ్గు, బిడియం వగైరా లేమిటని వేరుగా తలుపుదగ్గరకు వెళ్లి 'ఇదిగో పళ్ళూ, ఆకులూ'** అన్నాడు చేతిలో సంచీ ఎవరికో అందిస్తున్నట్టుగా.

గదిలో లావణ్య ఉన్నదనీ, తనచేతిలో సంచి అందుకుంటుందనీ అతని ఉద్దేశ్యం. ఎండలో నడిచివచ్చాడేమో గదిలో ఎవరున్నదీ స్పష్టంగా కనపడ్డంలేదు.

ఎంతసేపటికీ సంచీ ఎవరూ అందుకోక పోయేసరికి అనుమానంవచ్చి ఎడంచేత్తో కళ్ళు నులుముకుని చూశాడు. గదిలో ఎవరూ లేరు.

ఉసూరుమంటూ హాల్లోకి వచ్చి కసిగా 'మామ్మ గారూ' అని పిలిచాడు. వంటయింట్లోనుంచి గాజులు గలగల ఆడించుకుంటూ వచ్చింది లావణ్య.

'ఆ సంచి, మిగిలిన డబ్బులూ కింద పెట్టండి' అన్నది బహు నిష్కర్షగా.

మాట్లాడకుండ సంచి, డబ్బులు కింద పెట్టాడు. ఏ మి టో చెబుదామనుకున్నాడుగాని రుద్ధమయిన కంఠంలోంచి మాట పెగిలిరాలేదు. ఎదురుగా వంగి మామిడిపళ్ల సంచి, డబ్బులూ తీసుకుంటున్న సన్నజాజి తీగవంటి లావణ్యను చూస్తుంటే ని లు వు నా నీళ్లుగారిపోయాడు సుబ్రహ్మణ్యం.

ఇంక అక్కడ నించోడం బాగుండదని వెనక్కు తిరిగి తన గదివేపు నడిచి తలుపు తీసుకుని ఉసూరుమంటూ చతికిలపడ్డాడు మంచంమీద.

* * *

ఇంతలో లాయరుగారి ఇంటిముందు జట్కా వచ్చి ఆగింది.

'పెళ్లివారు చూపులకు వచ్చేశారు' అన్నాడు సుబ్రహ్మణ్యం.

మిగతా నలుగురూ అర్థంగాక 'పెళ్లివారేమి టిరా! కలవరిస్తున్నావా ఏమిటి' అన్నారు.

'లాయరుగారి అమ్మాయిని చూసేందుకు వచ్చారు' అన్నాడు ఏడుపుగొంతుపెట్టి.

జట్కాలోనుంచి దిగినవాళ్లు లోపలికి వెళ్లి పోయిన పావుగంటకు, పెళ్లికూతురులా ముస్తా బయిన పక్కయింటి మేష్టారుగారి అమ్మాయిని వాళ్ల అమ్మ రెక్కపట్టుకుని నడిపించుకుంటూ లాయరుగారింట్లోకి తీసుకువెళ్లడం చూసిన సుబ్రహ్మణ్యం మొహంలో రకరకాలుగా మారిన కళలు ఆఖరుకు గుండె పగిలే నవ్వుతో అంత మయింది.

'హరి నీ! అదా సంగతి' అన్నాడు బిగ్గరగా.

ఇదా మామ్మగారిమీద పెట్టబడిన భారం!

'ఏమిట్రా ఈ పట్టపగలు కలవరింతలు. కొంచెం విభూతి తెచ్చిపెట్టమన్నావా ఏం! జడుసు కున్న బాపతయితే సంజీవిమాదిరి పని చేస్తుందని మా అమ్మ నాకు ఎప్పుడూ విభూతి పెడుతుం టుంది!' అన్నాడు హనుమంతు.

శ్రీశైలం టిఫిను, కాఫీ మోసుకొచ్చి అందరి ముందు ఉంచాడు.

అందరూ ఆనందంగా ఫలహారం చేశారు.

"ఇంతకూ పెళ్లిచూపులు లావణ్యకు కాదన్న మాట....పక్కింటి మేష్టారుగారి కూతురికని తెలిసి ఉంటే ఇంత గొడవ ఉండేది గాదుగా.... అయినా ఇవ్వాళ తను ఎవరి మొహం చూశాడోగాని ....' ఉలిక్కిపడిన సుబ్రహ్మణ్యాన్ని అయిదుగురు గట్టిగా **పట్టుకున్నారు.**

# 5-10-'62

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

# దసరా సంచికను
# స్త్రీల ప్రత్యేక సంచికగా
# వెలువరించనున్నాము!

★ ఈ సంచికలో "రాజకీయాలలో స్త్రీలపాత్ర" వ్యాస రచన పోటీ ఫలితాలు: వ్యాసాలు.

★ స్త్రీల సమస్యలకు చెందిన ప్రత్యేక రచనలు.

★ ఇవిగాక మామూలు శీర్షికలన్నీ వుంటాయి.



పటేల్ ప్రొడక్షన్స్‌వారి "మదన కామరాజుకథ"లో రాజనాల, రాజశ్రీ

## కట్ కటా...

9-వ పేజీ తరువాయి

గాని, "కట్‌కటా! వాటితో బొమ్మల నాడించుట ఎట్లా?

దక్షిణ భారతంలో మొత్తం నాలుగు సినీ పరికరాల కర్మాగారాలున్నాయని వింటాము. ఇవన్నీ కలిపి సాలీనా 175 యూనిట్లు మాత్రం చేస్తాయట. ఐతే సాలీనా 2,000 యూనిట్లను చేయాలనే సదాశయంతో ప్రభుత్వంవారు ప్రయివేటు రంగంలో మరికొన్ని ఫ్యాక్టరీలు స్థాపించాలనుకుంటున్నారులెండి. అదో తాపీ మనసుకి. అయితే ఇవన్నీ ఆశ (యా) లుకదా? సరే ఇంతగా విదేశాలమీద ఇండస్ట్రీ నిలబడుతోందికదా, దీని కాళ్ళూ, చేతులూ అన్నీ కేవలం సొంతంగాలేవు కదా. పోనీ కథాబలం సంగీత సారస్వతబలం స్వదేశీయమైనాయనుకుంటే ఈమధ్య దుంపతెగా? అది దిగుమతేకదా?

ఇండస్ట్రీలో సాంకేతిక పరికరాల కట్ కటా—లకటా—ఎక్కువై, దీనికి దెబ్బ తగులుతున్నదని ఒక (ఆర్త)నాదం వినవస్తూంటె—క్రిటిక్‌లంతా చేరి అసలు కథా కమామిషూ బొత్తిగా "ఫారన్ ఐడ్" మీదనే ఆధారపడుతున్నయని తీర్మానం చేస్తున్నారు. సంగీతం 'జాజ'గా ఉండాలా? నృత్యం రాకెన్రోలుగానే ఉండాలా? లేదా అని ఆలోచిస్తూ, నిర్మాతలు తెలుగు రంగుల్లో ప్రాపంచిక చిత్రాలు తెనుగు తెరమీద అఖిల భారత చిత్రాలూ వేసేద్దామనుకుంటున్నారట. ఇంగిలీషు బొమ్మకి పొరపాటున ఎక్కడేనా ఓ అవార్డు ముక్క లభిస్తేచాలు, దాంతో ఇక్కడ దానికి బాక్సాఫీసు బద్దలైపోయి, దాన్ని తెనుగలోనికీ 'తమిళం'లోనికి తదుపరి ఉత్తరాదికి ఎలా (ఎగుమతి?) చేయడమా? అని ఆలోచిస్తున్నారట.

ఆవిధంగా "సింతటిక్" (వింత ట్రిక్‌కాదు) సంస్కృతితో, ప్రాపంచిక సినిమాలను నిర్మిస్తున్నారుట. దశావతారాలు ఎత్తిన దేవుడు కూడా ఈ నిర్మాతలు తనచేత ముమ్ముందు ఎలాంటి వేషాలు వేయిస్తారో తెలియమి "కలిక"వతారం ఎత్తడం మానేస్తున్నాట్ట.అథవా ఎత్తినా వెండితెర ఎక్కనని; పౌరాణికాలుతీసి, తన పరువుతీయొద్దని సత్యాగ్రహం చేస్తాట్ట. జానపదాలు నచ్చవని మొరపెట్టుకుంటాట్ట. ఇంతకీ చౌ చౌ సాంఘికాలుతీస్తే బేఫికర్ ఆ సంగతి వేరనుకేండి. మొత్తంమీద సాంకేతిక సాంస్కృతిక లోపాలవల్ల ప్రాపంచిక చిత్రాలు, సమైక్యతా' చిత్రాలువస్తే ఏ క్రిటిక్ కాదనగలడు?

—"క్రిటిక్"



కులగోత్రాలు చిత్రంయొక్క రికార్డింగు భరణీస్టూడియోలో జరిగినప్పటి దృశ్యం. ఫోటో: యాపం.

**మంచి పుస్తకాలు**

జీవిత రహస్యాలు - మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు - రూ 3-50
యువతి - స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు ... రూ 3-50
సంతానము - గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు ...... రూ 3 50
అమ్మకపు రహస్యాలు.- వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు రూ 6-00
ఉద్యోగదర్శిని - మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు రూ 5-00
ఆత్మజ్ఞానము.- శరీరానంతరం ఆత్మను గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు రూ 2-50
పోస్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీయింటికి పంపబడును

దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర



**మంచి రహస్యం**

గ్లోరియా ద్రవాన్ని, మీ ముఖానికి రుద్ది తుడిచినంతలో అద్భుతమైన కాంతిని, మంచి అందాన్ని వెంటనే తెస్తును, ముఖంలో ముదిరూపును పోగొట్టి చక్కని లేతదనాన్ని తెచ్చును ఎండకువచ్చే నలుపును, మొటిమలను నమ్మకంగా పోగొట్టును
వెల రూ 1-75. అన్ని షాపుల్లో దొరుకును.

JANITA PRODUCTS, ELURU, A P



ఒక సీసా, అనేక చికిత్సలు!

SLOAN'S LINIMENT

FOR EXTERNAL USE for the relief of muscular congestion as directed

DIRECTIONS: Apply the liniment liberally with a soft flannel cloth

TRADE MARK ®

KILLS PAIN

Dr. Earl S. Sloan

Manufactured in India by
MARTIN & HARRIS (PRIVATE) LTD.,
8, Ashutosh Mukherjee Road,
Calcutta 20.

Trade Mark owned by STANDARD LABORATORIES INC. U.S.A.

శీఘ్ర నాశము. నొప్పులు కండరాల నొప్పులు శరీరంలో అలసట మొదలైనవి పోగొట్టడానికి స్లోఅన్స్ లినిమెంట్ ఉపయోగించండి. స్లోఅన్స్ మీ నొప్పి ఉపశమనం కలిగించేస్తుంది.

వార్నర్ - లాంబర్ట్
ఫార్మస్యూటికల్ కంపెనీ
(పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

TEL.


# తెలుగు చిత్రవార్తలు

## మదనకామరాజు

కాశీమజిలీ కథల్లాంటి కథలను కమనీయంగా రమణీయంగా రూపొందించే జానపదదర్శకుడు విఠలాచార్య దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రం చాలావరకు పూర్తయింది.

సుజాత, రాజశ్రీ, అనూరాధ, శాంతి, జయంతి, మీనాకుమారి, హరనాథ్, కాంతారావు, ధూళిపాళ, రాజనాల, బాలకృష్ణ పాల్గొంటున్నారు. దర్శకుడు: విఠలాచార్య, సంగీతం: రాజన్, నాగేంద్ర, ఛాయ: చంద్రు కవి: కృష్ణమూర్తి.

## ఇరుగుపొరుగు

బెంగాలీకథ ఆధారంగా కళాప్రపూర్ణావారు నిర్మిస్తున్న ఇరుగుపొరుగు చాలావరకు పూర్తయింది ఐ. యన్. మూర్తి దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రంలో యన్. టి. రామారావు, రేలంగి, గుమ్మడి, బాలయ్య, కృష్ణకుమారి, గిరిజ, నిర్మల నూతననటి గౌరి ,పాల్గొంటున్నారు. సంగీతం, మాష్టర్‌వేణు, ఛాయ: అధిక్షరాని, మెహ్లాఇరాని నిర్మాత: సి. హెచ్, విజయ సారథి.

## అనురాగం

శివరంజనీసంస్థ పేరిట శ్రీటి. ఆర్. నాయుడు సమర్పిస్తున్న పై చిత్రంలో జగ్గయ్య, జమున, గుమ్మడి, రమణారెడ్డి, బాలయ్య, సి. యస్. ఆర్, చదలవాడ, పద్మనాభం, హేమలత, మీనాకుమారి, అన్నపూర్ణరాజు, నటశ్రీ పాల్గొంటున్నారు. రచన: పినిసెట్టి, ఛాయ: సి. నాగేశ్వరరావు, సంగీతం: బాబురావు, దర్శకుడు: టి. యస్. రామారావు.

త్వరలో సెట్సుకు వెళ్ళనున్నారు.

# హిందీ చిత్రజగత్

## జ్వాల

దర్శకనిర్మాత ఎమ్. వి. రామన్ మరోతొమ్మిది రోజులపాటు షూటింగ్ పూర్తిచేసినతర్వాత జ్వాలా అనే తనచిత్రాన్ని టెక్నికలర్‌లో 80పాళ్ళు పూర్తిచేశాడు. ఇందులో సునీల్‌దత్, రాజ్ మెహ్రా, చంద్రశ్రీ నటిస్తున్నారు. శంకర్‌జైకిషన్‌ల సంగీతం ఈ చిత్రంలో ప్రత్యేకత.

## రాఖీ

భీమ్‌సింగ్ దర్శకత్వంవహించిన ప్రభుదాం పిక్చర్సువారి హిందీచిత్రం రాఖీ త్వరలోనే దేశవ్యాప్తంగా విడుదలకాబోతుంది. అశోక్ కుమార్, వహీదారహమాన్, ప్రదీప్‌కుమార్, అమితాబు నటిస్తున్నారు.

## డా. విద్యా

వైజయంతిమాల మనోజ్ కుమార్‌లు నాయకీ నాయకులుగా నటించిన డాక్టర్‌విద్యా సెన్సారింగ్ పూర్తిఅయింది. దీనికిసంగీతం: యస్. డి. బర్మన్. బహుశావచ్చేనెల విడుదలకానున్న ఈ చిత్రంలో మదన్‌పురి, నాజిర్‌హుస్సేన్, హెలెన్ మున్నగు వారు నటిస్తున్నారు దర్శకుడు: ప్రేమ్‌జీటియా.

★





అలంకార్ చిత్రవారి "విక్రమ విజయం"లో రామచంద్రన్, పద్మిని.

# పట్టుదల గల ఇంతి

11వ పేజీ తరువాయి

పి. ఎస్. కాలేజీలో ఇంటర్ చదివాను. కాలేజీ నాటకాల్లో పాల్గొంటుండేదాన్ని. ఒకతడవ ఉత్తమ నటి బహుమతిని కూడా పొందానుకొండి! మా మకాం మళ్ళీ మద్రాసుకు మారింది.....

యతిరాజ్ కాలేజీలో బి.ఏ.చదువు ప్రారంభించాను.

యతిరాజ్ కళాశాల వక్తృత్వ పోటీలో నాకు ప్రథమస్థానం లభించింది. అంతర–కళాశాల వక్తృత్వ పోటీలలో పాల్గొనమన్నారు. యతిరాజ్ కళాశాల నుంచి వెళ్ళి పాల్గొన్నాను.

బహుమతులు ప్రకటించేరోజు రావటం తోటే భయంపట్టుకుంది. ఫలితం ఏమౌతుందో అని అందరూ ఆతృతతో కాచుకున్నట్టే నేనూ కూర్చున్నా. ఆనాడు విశ్వవిద్యాలయంలో ప్రథమస్థానంగా నా పేరు ప్రకటించినప్పుడు, ఆ బహుమతిని అందుకున్నప్పుడు నేను పొందిన ఆనందం 'ఇంత'అని చెప్పలేను.

అరే! ఇంతకూ నేను సినిమాల్లోకి ఎలా వచ్చానో మీకు చెప్పలేదల్లే ఉంది! అలా బి. ఏ. ఐపోయింది. మా యతిరాజ్ కళాశాలలో సాంస్కృతిక సభలు జరిగేవి. ఆ సభకు సాంస్కృతికవేత్తలను, కళాకారులను ఆహ్వానించేవాళ్ళం. అలా అతిథిగా వచ్చిన అక్కినేని నాగేశ్వరరావుగారు నన్ను చూడటం జరిగింది. ...అయితే అప్పుడేం జరగలేదు! సభ కాంగానే ఆయన ఇంటికెళ్ళిపోయారు.

సారథీవారు 'కాళిదాసు'చిత్రం నిర్మిస్తుండగా కాళిక వేషానికి ఎవరైనా విగ్రహం కలవారు కావాలని వెతుకుతున్నారు. అప్పుడు నాగేశ్వరరావుగారు నన్ను యతిరాజ్ కళాశాలలో చూచినట్లు, వేషంవేస్తుందేమో కనుక్కోమని చెప్పారుట. సారథీవారు ఇంతగా తమ అవసరాన్నిగూర్చి గట్టిగా చెప్పినప్పుడు కాదనలేకపోయాను. తత్ఫలంగానే ప్రప్రథమంగా వెండితెరపై 'కాళిక'గా ప్రత్యక్షమయ్యాను

మద్రాసు లా కళాశాలలో నేను యఫ్ యల్. చదువుతున్న రోజుల్లో, చిత్రాలయావారి 'తేన్నిలవు' తమిళచిత్రాన్ని నిర్మిస్తూ, దర్శకుడు శ్రీధర్ సాగించిన కొత్త ముఖాల వేటలో నాకు అవకాశం రావటం, ఆ చిత్రంకోసం కాశ్మీర్‌లో గడపవలసి రావటంతో చదువుకు గంటువాయించవలసివచ్చింది.

ఇన్నాళ్ళు మద్రాసులో ఉన్నందువల్ల తమిళం రాయనూ, చదవనూ నేర్చుకున్నాను. మాడప్పురా, బలేపాండ్య, అవనా-ఇవన్ అనే చిత్రాల్లోను, మంచి మనసుల్లోనూ మంచి అవకాశాలు లభించాయి. ప్రస్తుతం సిరిసంపదలు, సవతికొడుకు, 'విధివిలాసం' తెలుగుచిత్రాల్లో పాల్గొంటున్నాను. నాకు మలయాళం, హిందీకూడా అభ్యాసంఉన్నాయి. సీతాకళ్యాణం అనే మలయాళ చిత్రంలో నేను పాల్గొంటున్నాను.

అసలీ మధ్య కొన్నాళ్ళుగా ఏ పనికీ తీరికే కనిపించటంలేదు. ఏమాత్రమున్నా విశ్రాంతి దొరికితే పుస్తకాలు చదవటం, చిత్రాలు చూడటం—అన్నిటికీ మించి అభిమానులకు ఉత్తరాలు వ్రాయటం చేస్తుంటాను.

అయ్యో! టైమైంది! అవతల కాల్షీట్ పిలుస్తోంది! వీలైతే మళ్ళీ కలుస్తా.... లేకపోతే వెళ్తొస్తా..గుడ్‌బై. —వాసంతి



రిచ్ 'బ్లూ ఏంజెల్' లో వేద్దామని నా ఆశ. ఇది చాలా కష్టమయిన పాత్ర.

నేను చేసిన ప్రతి పనీ మరొక విధంగా చేయటానికి అవకాశం ఉంటే ఏం చేసేదాన్ని ? అన్నీ ఇంకోవిధంగా చేసేదాన్ని. అందులోనూ 'హృదయా'నికి సంబంధించిన విషయాలలో.

* * *

నేను పుట్టినప్పుడు పెట్టిన పేరు, 'నార్మజీన్ బేకర్.' నేను పుట్టకముందే మా తండ్రి కారు ప్రమాదంలో చనిపోయాడని నాకు చెప్పారు. నేనందరికీ ఇదే చెప్తాను. నిజం తెలుసుకునే అవకాశం ఏదీ ? నే నింకా చిన్నపిల్లగా ఉన్నప్పుడే మా అమ్మని పిచ్చాసుపత్రిలో చేర్పించారు. నేను అనాథగా పెరిగాను.

నన్ను 'పెంచిన' వారు పదకుండు—పన్నెండు మంది ఉంటారు. సరిగ్గా లెక్కపెట్టి అంతా గుర్తుకు తెచ్చుకొనడం నా కిష్టంలేదు. నాకు విచారంగా ఉంటుంది. కొందరు నన్ను మిగతా వారికన్నా ఎక్కువకాలం దగ్గరుంచుకునేవారు. మరి కొందరు త్వరలోనే నామీద విసుగుపుట్టి పంపించేసేవారు. నన్ను చూస్తేనే వారికి కష్టంగా ఉండేదేమో !

నాకు పదేళ్లున్నప్పుడు — అప్పుడు నన్ను చేరదీసినవారు పెద్దదాన్నయిపోయినతర్వాత తాగనీ, సిగరెట్లు కాల్చనీ, తిట్టనీ ఒట్టుపెట్టించుకున్నారు. నేను వాళ్ల నొదిలి మరొకచోటికి వెళ్లాను. అక్కడివాళ్లు ఖాళీ విస్కీసీసాలను ఆడుకోవటాని కిచ్చేవారు. వీటితో 'అంగడి' పెట్టినట్లు ఆడుకునేదాన్ని. రోడ్డుమీద వరసగా పేర్చి దారినిపోయేవాళ్లతో, "విస్కీ కావాలా?" అని అడిగేదాన్ని.

వారిలో కొందరు, "అబ్బా! ఎంత దారుణం !" అనేవారు. ఎప్పుడూ ఇలా ఆడుకుంటూ ఉండేదాన్నా, అనిపిస్తుంది. అంటే ఒకవిధంగా నా 'ప్రపంచం' బయట ప్రపంచంకన్నా అందంగా ఉండేది.

నన్ను మొట్టమొదట చేరదీసినవారు, 'సినిమాలు చూడటం పాపం' అన్నారు. త్వరలోనే ప్రపంచం ప్రళయంలో నశిస్తుందనీ, పాపాలు చేసేవారందరూ పాతాళానికి దిగిపోతారనీ చెప్పేవారు. నే నెప్పుడయినా సినిమాకి దొంగచాటుగా పోయినప్పుడు, ప్రళయం రాకూడదని ప్రార్థించేదాన్ని. అదృష్టవశాత్తు, అంతపని జరగలేదు!

కొందరిని చూస్తే ఇతరులలో సంచలనం కలుగుతుంది. మరికొందరు ఎవరికీ ఏదీ చేసిపెట్టరు. మగవారంటే నాలో సంచలనం కలుగుతుంది. కాని నేనేదో 'స్త్రీని' అని నిరూపించేందుకు కాదు. నాకు 'మార్లన్ బ్రాండో' అంటే ఇష్టం. రెండు రకాల 'సంచలనాలు' ఉంటాయి. కొందరిని చూస్తే 'ఆహా !' అనిపిస్తుంది. కొందరిని చూస్తే 'అబ్బ !' అనిపిస్తుంది.

నేనే కనుక 'సెక్స్' కి 'చిహ్నం' అయితే 'బాక్సాఫీసు' కి మంచిదే కాని నాకు కేవలం వ్యాపార దృష్టితో చూడటం ఇష్టంలేదు. 'చిహ్నం' గా ఉండటం కూడా ఒక బాధ్యతేగా!

# మమత ఎరుగని జీవితం

18-వ పేజీ తరువాయి

నే నెప్పుడూ మగవారిని గురించి ఆలోచిస్తూ ఉంటాను. మరికొన్ని సమయాలలో ఒక పురుషుడిని గురించి, ప్రత్యేకంగా, ఆలోచిస్తూ ఉంటాను: ఇలా ఆలోచించినప్పుడు 'సెక్సీ' గా ఉండటం తేలిక.

నే నెప్పుడూ నోరు తెరుచుకుని ఉంటానంటారు. కాని నేను నిజంగా నిద్రపోతున్నప్పుడు కూడా నోరు తెరిచి ఉంటాను. నా కెల్లా తెలుసు ? మేలుకోగానే నోరు తెరిచిఉందని తెలుస్తుంది కాబట్టి.

ట్వెన్‌టియత్ సెంచరీ ఫాక్స్‌లో నేను మొదట ఇచ్చిన 'పోజ్', స్టిల్ ఫోటోలకు మాత్రమే.



కీ. మారిలిన్ మన్రో

'ప్రచార సంస్థలు' కొన్ని నేను 'బేబీ సిట్టర్' (తలిదండ్రులు ఇంట్లో లేనప్పుడు చిన్న పిల్లలకు తోడుగా కూర్చునే మనిషి) గా సినిమా డైరెక్టర్ ఇంట్లో పనిచేస్తూ ఉండగా చూసి నన్ను ఆయన సినిమాలలో చేర్పించాడని ప్రకటనలు చేశాయి. ఇది పూర్తిగా నిజంకాకపోయినా నన్ను కూడా చెప్పమన్నారు. వీళ్ల భావనాశక్తి ఎంతమాత్రమో తెలుస్తుంది. కనీసం, 'బేబీ' సిట్టర్ బదులు 'డాడీ' సిట్టర్‌గా చిత్రించినా బావుండేది !

కొందరు మగవారికి 'సూక్ష్మ విశేష' లంటే ఇష్టం. మరికొందరికి ఇష్టం ఉండదు. కృత్రిమమయిన సిగ్గంటే నా కిష్టంలేదు. ఇది ఏ అమ్మాయికీ మంచిదికాదు. 'లజ్జ' మరీ ఎక్కువయిపోతే జీవితంలో ముఖ్యమయినది కొంత పోగొట్టుకున్నట్లే. మగవాళ్లేమో, ఇటువంటివారి స్వభావాలు 'అతి శీతల' మయిన వనుకుంటారు. అసలు మతానికీ దీనికీ చాలా సంబంధం ఉంది. ఇదంతా మెడ కొక గుదిబండ.

స్టూడియోలో ఇది విన్న తర్వాత ఒక అలజడి రేగింది. ఒక్కొక్కరూ నాకు టెలిఫోన్ చెయ్యటం మొదలుపెట్టారు. అప్పుడు నేను ఒక చిన్న సినిమాలో వేస్తున్నాను. ఒక వ్యక్తి అడిగిన ప్రశ్న : "ఇదేమిటి, బట్టలు లేకుండా ఫోటో తీయించుకున్నావుట ? నిజమేనా ?" అని.

"అవును, నిజమే. అందులో తప్పేమన్నా ఉందా ? ఆ కాలెండర్ బొమ్మ నేనే నని కనుక్కున్నారా ?" అన్నాను.

"కనుక్కోవటమా ? ఫుల్ కలర్‌లో వేస్తే, నిన్ను !" అని అరిచాడు అవతలవ్యక్తి. "నిన్నెవరేది అడిగినా కాదను ! లేదు .... ఏమీ చెప్పక. నేనే వస్తున్నా !"

ఫాక్స్ స్టూడియోలో ఒకచోట పనిచేస్తూ ఉండగా ఆయన చేతులు నలుపుకుంటూ వచ్చాడు. నన్ను డ్రెస్సింగ్ రూమ్‌లోకి తీసుకుపోయి నేను చేసిన పని ఎంత ఘోరమయినదో చెప్పాడు.

నా కేమి చెప్పాలో తెలీలేదు. చివరికి, "ఫోటోగ్రాఫర్ వాడిన లైట్ల కాంతిలో నన్నెవరూ గుర్తుపట్టలే రనుకున్నా" నని నీళ్లునమిలాను. ఈ జవాబుకి అతను మూర్ఛపోయినంతపని చేశాడు.

జరిగిన దేమిటంటే : కొంతకాలంగా నా అద్దె కట్టలేకపోయాను—నే నున్నది హాలీవుడ్ స్టూడియో క్లబ్‌లో. ఫోటోగ్రాఫర్‌లు కొందరు నన్ను బట్టలు లేకుండా పోజ్ చెయ్యమని కోరినా, అంతవరకూ నేను ఒప్పుకోలేదు. మామూలుగా పోజ్ చేస్తే—ఎడ్వర్టయిజ్‌మెంట్‌లకి, బట్టలకి—గంటకి అయిదు డాలర్లు ఇస్తారు. ఈ రకమయిన పోజ్‌కి ఏభై ఇస్తారు. సరేనని నాకు తెలిసిన ఫోటోగ్రాఫర్ టామ్ కెల్లీని పిలిచాను. "నన్నిక్కడినుంచితరిమేస్తున్నారు. ఎప్పుడు ఫోటో తీస్తావ్?" అని అడిగాను.

"రేపే" అన్నా డతను.

టామ్‌తో చెప్పాను, "అక్కడ నీ భార్య నటాలీ తప్ప వేరెవ్వర్నీ ఉండనివ్వ" ద్దని.

"ఒ. కె" అన్నాడు టామ్.

రెండే పోజ్‌లు తీశాడు; ఒకటి కూర్చుని, ఒకటి పడుకుని. రెండోది బాగా వచ్చిందని నా అభిప్రాయం.

ఆ కాలెండర్ కాపీ నొకదానిని నా మనవరాళ్లకీ, మనవలకీ అందేట్లు చూడబోతున్నాను. కొన్నిటిని ఆటోగ్రాఫ్‌చేసి కొందరికి ఇచ్చాను. "ఇది అంత బాగా నచ్చిఉండకపోవచ్చు" అని ఒకదానిమీదరాశాను.

దీనివల్ల నాకు చిక్కులు కొన్ని వచ్చాయి. 'దీనివల్ల' అంటే, నిజం చెప్పటంవల్ల అని. మరీ నిక్కచ్చిగా మాట్లాడి తగ్గితే నే నేదో సిగ్గుతెచ్చి పెట్టుకుంటున్నానని అనుకుంటారు. ఆడ పత్రికా విలేఖరు లంటే నా కిష్టంలేదన్నాననే ప్రచారం జరిగింది. నాకు వారంటే అయిష్టంలేదు. కాని, మగ విలేఖరులతో మాట్లాడమంటే సరదాగా ఉంటుంది.

ఒక అమ్మాయి అడిగింది : "ఆ బొమ్మ తీసినప్పుడు ఏమీ వేసుకోలేదా ?" అని.

"ఎందుకులేదూ, రేడియో వేసుకున్నాను," అని చెప్పాను. (సశేషం)

# హరివంశము

15—వ పేజీ తరువాయి

చెల్లవచ్చును. అకర్మియందు, జీవన్ముక్తునియందు ఎట్లుచెల్లును? అకర్మికి కర్మఫల మంటునా? అంటిన కదా, ఈ అభియోగము చెల్లును. మహానందు డకర్మి. వానియందే అభియోగమును వర్తించదు. కాదు. వర్ణాశ్రమధర్మ నిర్వహణ కొరకాయనను శిక్షింతుము అందరా, శిక్షించుడు. అదియు నాతనికి బంధముకాదు. భార్యయు, బిడ్డయు, బంధువులు, మిత్రులు బంధములు కాని వానికి వర్ణమును ఆ వర్ణముతోడి ధర్మమును, తదనుగుణమైన శిక్షాస్మృతియు బంధములగునా? అతడు ముక్తుడు. అతని కివి పట్టవు.

మరియు వర్ణాశ్రమ ధర్మమే ప్రకృష్టమను వాదముగూడ చెల్లదు. గుణమును చేసి, కర్మమును చేసి, వ్యవహారములో మానవులు వేరువేరుగా నుండవచ్చును. అది ఉండుటకూడా కాదు. కన్పించుట. రేచీకటివానికి లోకము చీకటిగా కన్పించినట్లు కన్పించుట. ఏలన ముక్తులయినవారు ఏమి చెప్పుచున్నారనగా—వారు అపరోక్షానుభవమున చేసి చెప్పుచున్నారు— వర్ణాశ్రమ ధర్మములు గాని, తద్వర్ణాశ్రమ ధర్మచిహ్నధారణము గాని, తద్ధర్మానుసారి కర్మాచరణము గాని మోక్షమును సమకూర్చిపెట్టవని. అనగా అవియన్నియు బంధములని. వ్యవహారమే బంధము. ఆ బంధములో చిక్కుకొని ఉన్న మనము తదతీతస్థితిని, పారమార్థికస్థితిని పొందినవానిని విచారించుట యెట్లు! ఇచ్చట మరియొక ప్రశ్నయున్నది. మహానందుడు ఆ స్థితిని పొందెనా? అని. మణికర్ణకయందు ఆ దానమును పట్టుటయే అతని స్థితికి తార్కాణ. అప్పుడతడు బ్రాహ్మణ్యమను తుదిబంధమును త్యజించెను. అప్పు డతడేమనుకొనియుండును: నా యెదుటనున్న ఈ పంచముడు నిజముగా పంచముడా? కాశిక పరుసనేదివంటిది. అది అచ్ఛమైన జ్ఞానము. ఆ జ్ఞానమును చేరినప్రతి ఒక్కడును జ్ఞానగమ్యుడగు పరమశివుడే యగుచున్నాడు. మరియు నేనిచ్చట యెవనని కాదనవలయును? అన్నమయ శరీరము నుండి శరీరమునా? లేక చైతన్యమునుండి చైతన్యమునా! శరీరమునే యన్నచో దేనికి సార్థక్యము? చైతన్యమునైనచో, ఉన్నది ఒక్కటే చైతన్యము. అక్కడ తొలగుట కేమియున్నది? అదియెట్లు తొలగగలదు? గంగాజలమున్నది. అది సవర్ణవాటికలమీదగను పోవుచున్నది. అసవర్ణవాటికల మీదుగాను పోవుచున్నది. అప్పు డది ఒక్కచో గంగాజలమును, మరియొక్కచో గంగాజలము కాకను పోవుటలేదు. సూర్యుడీ జలమునందును, ఆ జలమునందును ప్రతిబింబించుచునేయున్నాడు. మరియు సూర్యునియందు ఎవ్వరును భేదము చేయుటలేదు. అనగా ఆత్మ అన్నిశరీరములయందుద ఒక్కటియై యున్నది. దానికి బ్రాహ్మణత్వమని చండాలత్వమని యున్నదా! ఉన్నచో అది ఆత్మకాదు. అనాత్మ. ఆత్మకు భేదవిభ్రమములేదు. అది చైతన్యము. జాగ్రత్ స్వప్నసుషుప్తులలో అది


పేరుపొందిన చికిత్స

జమ్మివారి లివర్‌క్యూర్

పసిబిడ్డల లివర్, స్ప్లీన్ వ్యాధులకు పరమౌషధము

వ్యాధి లక్షణాలను ఆదిలోనే గుర్తించండి:

ఆకలి మందగించటం — అజీర్ణం — చిరాకుగా ఏడుస్తూండటం — కొంచెంగా జ్వరం — పొట్ట పెరగటం — మట్టిరంగుగా లేదా తెల్లగా విరేచనం.



జమ్మివారి డాక్టర్లు ముఖ్యమైన పట్టణాలకు ప్రతి నెలా వస్తారు.
వివరాలకు వ్రాయండి:

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్

హెడ్ ఆఫీసు: మద్రాసు-4.

బ్రాంచీలు: బొంబాయి-4 — బెంగుళూరు-2 — కలకత్తా-7 — ఢిల్లీ-6 — కుంభకోణం — లక్నో — నాగపూరు-1 — పాట్నా-4 — తిరుచిరాపల్లి-2 — విజయవాడ-3 — విజయనగరం.

JV-44-TE

అశోకా ఆమ్లా
రత్నత్రయము

* అశోకా ఆమ్లా హేరాయిల్
* అశోకా ఆమ్లా పొమేడ్ డీలక్స్
* అశోకా ఆమ్లా బ్రిలియంటైను

నల్లని కురులకు చల్లని గుణమునకు
సాటిలేనివని ప్రఖ్యాతిగాంచినవి

ASOKA
AMLA
Vegetable HAIR OIL

AMLA POMADE

VIJAYA CHEMICALS
MADRAS-7.

పామోలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!



మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకో గలరు. పామోలివ్ సౌందర్యరక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి

మొదటి రోజు నుండే, పామోలివ్ సౌందర్య రక్షణ మీ దేహకాంతికి క్రొత్త శోభను యిస్తుంది. భారత దేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేరిన పామోలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడ వంటి నురుగు ఎంతో శుభ్రపరచి, మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది. సౌందర్య పోషక తైలములు చేరిన పామోలివ్ సబ్బునే ఎల్లప్పుడూ వాడి చిన్న చిన్న కళంకములు చాల తక్కువగుట, ఎక్కువ మృదుత్వము, మరియు నునుపు, తాజాయైన మరియు నిర్మలమైన చర్మము, ఎక్కువ శోభాయమానమైన అందమగు దేహకాంతి మొదలైన వర్చస్సులో కలిగే అభివృద్ధిని మీరు చూడగలరు!

భారతదేశపు అపూర్వమగు
సౌందర్య పోషక తైలములతో
తయారైనది!






పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామోలివ్ సబ్బుతో స్నానము చేయండి!

# హరివంశము

స్ఫుటతరముగా ప్రకాశించుచున్నది. ఆ బ్రహ్మ పిపీలికాద్యత్త తనువు అది. అది జగత్ సాక్షి. ఓయి మహానందుడా! నీవు లేవు. ఉన్నది చైతన్యము. ఆ చండాలుడును చైతన్యము. నీవును చైతన్యమవు. ఇంక భేదమెక్కడ? ఇచ్చెడివాడెవ్వడు? పుచ్చుకొనెడి వాడెవ్వడు? పరమశివుడు పరమశివుని సంభావించు చున్నాడు. ఆత్మ ఆత్మయందు ఎరుకపొందు చున్నది. సర్వవ్యవహార ధర్మములను త్యజించు చున్నది. మాయను త్రోసివేయుచున్నది. మాయను త్రోసివేయగా వ్యవహారమదృశ్యమై, పరమార్థ సాక్షాత్కారము కల్గుచున్నది. నేను పరమార్థమును. నేను చైతన్యమును, నేను నేను."

ఈ జ్ఞాని అసంగి, అకర్మి. అతడు దానము పట్టగా, అది అధర్మముగా మనకు అవభాసించు చున్నది. మరి అసంగులు, అకర్ములుచేసిన కర్మము నకు ఫలమున్నదియుండునా! కర్మఫలమునుకూడ త్యజించినవారికి కర్మమున్నదియుండునా? ఇచ్చట కర్మములేదు. కర్మఫలమును లేదు. మహారాజ! ఈ విషయము నిట్లు చూడవలయును.

మరియు మహారాజ! ఐతిహాసికులుగూడ వర్ణా శ్రమ ధర్మవ్యవహారమును కల్పితమునుగా నిరూ పించియున్నారు. వారు మానవుని ఆధ్యాత్మిక జీవితము నేడు విభాగములుగా చేసి, వానికి ద్వీప నామ ధేయములను కల్పన చేసి, వర్ణాశ్రమధర్మ బంధమోక్షణ మెట్లో నిష్కర్షచేసియున్నారు. జంబూ ద్వీపమందలి వర్ణాశ్రమధర్మాదికములు తదితరములైన ప్లక్షాదిద్వీపములయందు విరళ ములై, తుదిద్వీపమున నశించిపోవుచున్నవి. అచ్చట మనుజులు కార్మికులై, వర్ణాశ్రమ ధర్మా దిక ప్రతిబంధకములేని పరమార్థస్థితిని పొంది భగవంతుడైన హరియందు అద్వితీయభక్తిని, అద్వయభక్తిని చేయుచున్నారు. అనగా, వ్యవ హారము జంబూద్వీపము. పరమార్థము పుష్కర ద్వీపము. వ్యవహారమైన జంబూద్వీపమున పరమార్థ మైన పుష్కరమును దర్శించినవాడు బ్రహ్మ మయుడు, బ్రాహ్మణుడు యగుచున్నాడు. వానికి మన ధర్మము పట్టదు. మన బ్రాహ్మణత్వము, మన క్షత్రియత్వము, ఆదిగాగల కర్మవర్ణ సంచయ మంతయు దబ్బర. వానికి యంతయు శివమయము; విష్ణుమయము; బ్రహ్మమయము. అట్టివానిని ధర్మపరిషత్తులు విచారించుట యేమిటి? శిక్షిం చుట యేమిటి? అట్టివానిని శిక్షించుటయనగా, నన్ను నేను శిక్షించుకొనుట. ఎవరిని వారు శిక్షించు కొనుట. మాయాకార్యముగా కల్గిన చిత్తవిభ్రాంతి వలన నిది యేమియు మన కవగత మగుటలేదు. ఆ చిత్తవిభ్రాంతిని తొలగించుకొన గల్గినచో సర్వము విశదమగును. మహారాజా నీల వర్ణమును శరీరమునందంగీకరించుటవలన యాదవు డైన శ్రీకృష్ణుడు కానట్లు, ఈ పరిషత్తు, మహానందుని, నిస్సంగుని, అకర్మిని, శిక్షించినంత మాత్రముచేత అది శిక్షించుటయుకాదు. అతడు శిక్షననుభవించుటయు కాదు. అతడు ఆ శిక్షను అనుభవించుటయు లేదు. అతనిని శిక్షించు


మీకిష్టమైన నూనెల్లో నానబెట్టుడు
కాష్మీర్-కుసుం
కేశములను పెరిగించును. అకాలనెరసునరాన్వును.
చేరుమ ఉపద్రవములకు
సాంటులక్స్ ములాము
చేరుమ అపాయములకు
"కోడి మార్కు" శ్రేష్ఠమైన ఉదువత్తులు & సువాసనలు & ఫ్లవర్ డస్ట్ పొట్లములు
నంజనగూడు పండ్లపొడి & అపూర్వ ఔషధములు ••
సోల్ ఏజంటు: యునైటెడ్ కేసరీ, మదరాసు | హైదరాబాద్, విజయవాడ
నంజనగూడు ఔషధములకు ఒక టపునకు ఒక స్టాంపును ఆహ్వానించెదము



ఏన్విల్
క్రిమి సంహారక ఆయింట్మెంట్


కోతలకు, రక్కులకు, ఉడుపులకు వాడండి. 'ఏన్విల్' మొటిమలను, కురుపులను, కీటక కాట్లను కూడా మాన్పును.
అట్లాంటిస్ (ఈస్ట్) లిమిటెడ్ (ఇంగ్లండులో స్థాపితం)
JWT.ANEV-5312 R TE
AN 2



ఉపశమనకు ప్రత్యేకమైనది
కాంతర్ డైన్

హేర్ ఆయిల్

బెంగాల్ కెమికల్
కలకత్తా
బొంబాయి
కాన్పూరు

# లాభదాయకమైన లఘు పరిశ్రమ ప్రారంభించండి

"అధునాతన కుటీర పరిశ్రమలు" (తెలుగు) పుస్తకంలో లాభదాయకమైన వివిధ పరిశ్రమలు వున్నాయి. ఈ పరిశ్రమలలో వున్నవారు చక్కటి లాభాలను ఆర్జిస్తున్నారు. ప్రతి పరిశ్రమను గూర్చి సంక్షిప్తమైన వివరాలు, ముడి పదార్థాలు లభించే చోట్లు, ముడి పదార్థాల కొనుగోలుకు, వాయిదాల పద్ధతిన యంత్రాల కొనుగోలుకు ప్రభుత్వం యిచ్చే సహాయం – యిందులో వున్నాయి. లఘు పరిశ్రమలు ప్రారంభించ దలచుకున్న వ్యక్తుల సమస్యలకు తగిన పరిష్కార మార్గాలు యిందులో వున్నాయి. పుటలు 878, సుమారు 300 బొమ్మలు, ధర రూ. 13/- తపాలరుసుము రూ. 1·61· Phone: 229835·

COTTAGE INDUSTRY, (WN-39),
P.B. 1262, Jamuna Road, Delhi - 6.





బాధగా అసహ్యంగా ఉండే

## తామరనుంచి బయటపడండి!

అది ఒళ్లంతా వ్యాపించవచ్చు



తామర వుండేచోట అమృతాంజన్ వారి డెర్మల్ ఆయింట్ మెంట్ (తైలం)ని మర్దించి త్వరగా ఉపశమనం పొందండి. తామర భయంకరమైన అంటువ్యాధి. తామర వచ్చినవారు వుపయోగించే దువ్వెన, తుండుగుడ్డ, సబ్బు మొదలైనవి విడిగా వుంచుకోవాలి. ఎక్కడైనా తామర వుందని తోస్తే వెంటనే అమృతాంజన్ వారి డెర్మల్ తైలాన్ని మర్దించండి.

అమృతాంజన్ లిమిటెడ్ వారి డెర్మల్ తైలాన్ని పాసిన కాళ్ళకూ, గజ్జి దురదలకూ కూడా వాడవచ్చు.




## అమృతాంజన్ లిమిటెడ్ వారి డెర్మల్ ఆయింట్‌మెంట్

అమృతాంజన్ లిమిటెడ్ 14/15, అప్‌చర్చి రోడ్డు, మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-1, న్యూ ఢిల్లీ-1.

JWT/AM/D-1738



ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి. వివరాలకు: ఎడ్వర్ టయిజ్ మెంట్ మేనేజర్ కి వ్రాయండి.



# తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతోగాని, చక్కెర లేకుండగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన చిహ్నము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈ వ్యాధి, తన బంధంలో చిక్కినవారిని ఆరోజాకారోజు మృత్యువుకు ఆసన్నుని చేయును. ప్రథమదశలో శారీరక, మానసిక శ్రమలకు యిచ్ఛగించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడలలో తిమ్మిరి, నరముల బలహీనతతో ఈ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు నోరు యెండుట, దురదలు, కాళ్ళలో పగుళ్ళు, తూకం తగ్గడం, శరీరమంతా పోట్లు, కీళ్ళనొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యెన్నో సంభవింపవచ్చును.

"పినస్ ఫారవ్" మాత్రలు వాడి అనేక వేల మంది తమ బాధలనుండి నివారణపొంది మృత్యుకరాళమునుండి రక్షింపబడిరి. "పినస్ ఫారవ్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యూనాని వైద్య విధానం ప్రకారం అమూల్య ఓషధుల శాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. అమిత దాహము, మూత్రంలో చక్కెర తగ్గి పలుమారు మూత్ర విసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలా భాగము నివారణ యగును. కొద్దిరోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "పినస్ ఫారస్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేక పథ్యములేదు. నిరాహారముతోనుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై ఇదివరకటికంటే ఎక్కువరకాల ఆహార పదార్థములు తీసికొనవచ్చును. వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినవారికి ఉచితముగా పంపబడును. 50 బిళ్ళల ఖరీదు రు. 8-75 న.పై. మాత్రమే. ప్యాకింగ్ మరియు పోస్టేజి ఉచితం.

(SELLING AGENTS)
Barrys Commercial Corporation
(W. A. P.)
27/A, Dhurumtollah Street
CALCUTTA-13.

## హరివంశము

వారును లేరు. శిక్షయు లేదు. అద్వయమ్మైన చైతన్య మొక్కటే యున్నది. అది యేలతడు."

ఆచార్య సాందీపని పరమశాంతమ్మైన కంఠము సంగీతమువలె, సభలో విస్తరించెను. ఆయన చివరిమాటలు సభకు విన్పించినవో లేదో? పౌండ్రకుడుమాత్రము క్రోధతామ్రాక్షుడగుటయు, దండతాడిత భుజంగమువలె లేచుటయు, నిరుపదముగా సాందీపని యని ఆచార్య సాందీపనిని సంబోధించుటయు సభకు ప్రళయ మేఘమువలె కానవచ్చెను. వినవచ్చెను.

కంచుకి తన ముదుసలి కన్నులను తెరచి సభను చూచెను. సభవిస్తరంగమ్మైన సముద్రమువలె నిస్తబ్ధమ్మై యుండెను.

మహారాజా పౌండ్రకుడు ధర్మాసనమునందు తిరిగి ఉపస్థితుడయ్యెను.

'సాందీపని! నిన్ను దేశమునుండి బహిష్కరించుచున్నాము. నీ చెప్పిన ధర్మము భయావహమ్మైనది. స్వధర్మవిరుద్ధమ్మైనది. ఇది మా అనుశాసనము."

కశాఘాతమువలని గుర్రమువలె సభ కదిలి పోయెను.

ఆచార్యసాందీపని ఆసభలో నివాతస్థిమితమ్మైన దీపమువలె ప్రకాశించెను.

భగవంతుడైన శ్రీకృష్ణుడు ఆచార్యుని సంబోధించెను. "ఆచార్యా! కాశికను అజ్ఞానమావరించినది. పదుడు! పోదము."

ఆచార్య సాందీపని సశిష్యముగా సభనుండి నిష్క్రమించెను.

సభ నిస్తేజస్కమై దివోదాసుని నాస్తికతను కోరి మ్లానతను భజించెను. ★

### కథ కాని కథల రచయితలకు

### విజ్ఞప్తి

రచయితలీశీర్షికకు కేవలం 'హాస్య సంఘటనల'నే పంపుతున్నారు. నిత్యజీవితంలో చిత్రవిచిత్రాలైన సంఘటనలెన్నో తటస్థిస్తూ ఉంటాయి. వాటిని గురించి కూడ వ్రాస్తే బాగుంటుందని రచయితలకు మనవిచేస్తున్నాము.


## ఎలెక్ట్రిక్ & రేడియో గైడ్

**అభివృద్ధి చేయబడిన క్రొత్త కూర్పు**

ఇంటిలోనే ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ పూర్తి కోర్సు రేడియో రిపేరింగ్ రేడియోమెకానిసం,ఇండ్ల వైరింగ్ నేర్చుకోండి. ఇంటిలోనే రు. 50 లకు ట్రాన్సిస్టర్ రేడియో తయారుచేయుటం నేర్చుకోండి. ఎలెక్ట్రిక్ & రేడియో పనులకు ఉత్తమగైడ్. (900 చిత్రపటములు) ధర రు. 10. వి.పి.పి. చార్జి రు. 2.

**14 భాషల మాస్టర్ :**

ఉపాధ్యాయుల సహాయము లేక ఇంటిలోనే హైపిస్, జపానిస్, అరవం, ఫ్రెంచి, రష్యన్ మొ॥ భాషలను నేర్చుకోండి. 14 భాషలు ధర రు. 6/- డ్రాయింగ్, పెయింటింగ్ రు 5-50. టైలరింగ్ & కట్టింగ్ రు.5-50 సెక్స్ అట్లాస్: 325 చిత్రపటములు గల అమెరికన్ ప్రచురణ. ధర: రు. 6/- V.P.P. చార్జి రు. 2/- అదనం.

Tagore Vigyan Mandir (A.10)
Halka No. 13, ALIGARH



## ఐటెక్స్

(కాటుక)
శాస్త్రీయంగా
తయారైనది
అరవింద్
బింది
కుంకుమ చాదు




6 ఆకర్షణీయమైన రంగులలో లభించుచున్నవి

**అరవింద్ లేబరేటరీస్**
పి. బి. 1415, మద్రాసు-17.

తెలంగాణా జిల్లాలకూ హైదరాబాదుకూ మినహా ఆంధ్రప్రదేశ్‌కు ఏజెంట్లు:
**ప్రగతి ఏజెన్సీస్,**
పులిపాటివారి వీధి, విజయవాడ-1.



మనోహరంగా కనబడండి ....







ఆఫ్ఘన్ స్నో
సౌందర్య సాధనములు

**AFGHAN SNOW** BEAUTY AIDS

ఆఫ్ఘన్ స్నో సౌందర్య సాధనములు మీ అందాన్ని, సొగసును పెంపొందించుటకు తోడ్పడుతుంది ...ఆఫ్ఘన్ స్నో సౌందర్య సాధనాలు మీ ముఖలావణ్యం ... మీ వర్చస్సు .. మీ కురులు ... మీ గోరులు ... గూర్చి సున్నితమ్మైన జాగ్రత్త వహిస్తుంది. మీ అలంకరణ సమస్యలన్నింటిని పరిష్కరిస్తుంది ...

స్నో క్రీములు & పౌడర్లు *
టాయిలెట్ & టాల్కం పౌడర్లు *
లిప్‌స్టిక్స్ & నెయిల్ పాలిష్ *
బ్రిలియంటైన్స్ & హేర్ ఆయిల్స్ *
లావెండర్ & ఫగ్ ఫ్యూమ్స్ *
టాయిలెట్ సోపులు *

# శక్తివంతమైన సాధనం

సమస్యలేమిటి? అంటూ చాలామంది వ్రాస్తున్నారు. నిజమే. వెంటనే యువతీ యువకులు ఇదే ప్రశ్న వేసుకుని తరచి చూసుకోడం మంచిది... ఇవాళ ఎంత గందరగోళం... పైగా అసలు సమస్యయేమో తెలుసుకోలేని దుర్దశ. ఝరీవేగ తుల్యంకదా యౌవనం! వరకట్నాలగురించి రాస్తే కొంపా జీవనే అయిపోయింది. ఒకనాడు సాంఘిక సమస్యే అది. కాని ఇవాళ అది సంసారిక సమస్యమాత్రం. ఇందులో యువతి ఒక అంగమాత్రమే. పోనీ ఫ్యాషన్లగురించి సినిమాలగురించి రాస్తే? ఇవి సమస్యలెలా అవుతాయి! సరదాలవుతాయి. వ్యసనాలవుతాయి. ఇవి కాలానుగుణంగా వస్తాయి. ఒకవయస్సు తరువాత తగ్గుతాయి. ప్రమాదభరితాలేం కావు. మరి? యువత నెదుర్కొనే సమస్య విద్య దాని అభ్యాసానికి చేసే అమలులో వున్న విధానాలు, వర్తమానంలో సంస్కారాన్ని భవిష్యత్తులో బ్రతుకుతెరువును (తలిదండ్రుల ఆదర్శాలను ప్రతిష్ఠలను అలా ఉంచండి) ఇచ్చి యౌవనం తర్వాత అవసరంలేనిదీ ప్రభావంలేనిదీ కాకుండా వ్యక్తిలో జీర్ణించుకుపోయేది విద్య. దీనివిధానం లోపభూయిష్టంగా వుందని అంతా ఒప్పేసుకుంటారు. కేవలం కంఠోపాఠాలు, వాటివల్ల ఓకాయితం, దానికో 'పఠం', ఆపైన జీవితంలో అనేక కుపాఠాలు, ఇవి తరువాత; ఏదో వ్యథా, వెలితీ ఇవి మిగులు. పైగా జిజ్ఞాసతీరి ఆశ నెరవేరదు. గాఢ్యో ఎట్లా లోకజ్ఞానానికి రైళ్ళలోను బస్సుల లోను అగ్నిపరీక్షలు. [చుట్టలుకాల్చే పుట్టపాగాలవాళ్ళ ద్వారా] పరిహాసాల పాలు. వీరి విషయజ్ఞానం 'ఫీసు'లో అపహాస్యం. 'మరీ పర్సన్' ధ్యేయంతో ఏవో క్లాసులో ప్రారంభమైన కోర్సు సిలబస్సు ఉన్నత విద్య దశకు వచ్చినాకూడా కేవలం ఉత్కరాస్వతగాను దబాయించి జీతం రాళ్ళు తెచ్చుకునేదిగాను మిగులు! అయితే ప్రాథమికవిద్య సెకండరీవిద్యల పునాదుల మొదలు, కళాశాలల్లో ఎమ్.ఏ. పి.హెచ్.డీల వరకూ ఉన్న పద్ధతులను – నిందలకు నిష్ఠూరాలకు దూరంగా ఆవేశంతోగాక ఆసక్తితో పరిశీలించి వర్తమానపరిస్థితుల కనుగుణంగా ఇది ఎలా రూపొందాలి అని ఒక వైఖరినో ధోరణినో ఆలంబనగా అభిప్రాయాలను సంతరించుకోవాలి. సిలబస్సులు పరీక్షలు ఇవి కేవలం బ్రతుకుతెరువుకే ప్రాతిపదికలైనా ఈ ఆర్థిక వ్యవస్థలో ముందుకు పోయే ప్రమాదమేమీ లేదుగాని అటు ఆధ్యాత్మికమూ గాక ఇటు ఐహికానికీ రాక గోచీకి పెద్దా అంగవస్త్రానికి చిన్నాగా, ఈ అధునిక 'విద్య'లు పరిణమిస్తూ వుంటే... లోపం వుందనీ తెలుసు... దీన్ని మరింత పాడుచేస్తున్నామనీ తెలుసు... కాని కదిపితే కందిరీగలపుట్ట అని చాలామంది ఎలాగో నెట్టుకొద్దాం అని తరువాతితరంవారికి ఈ ఆలోచన పరిశీలనల బరువును వదిలేయడం భావ్యమా? బాగుపడ్డవాళ్ళు వేళ్ళచీగాను, బలిపోయినవారు నిర్లక్ష్యంగాను కొత్తవారు భయంచేతో, ఫికరు చేతో దీన్ని తప్పించుకు తిరుగుతున్నాము. యువత అంటే 'టీనేజరే' మాత్రమేనని 'బీట్నిక్' సాహిత్యం రాక్ న్ రోలు సినిమాలవల్ల పాడైపోయి, చదువు రాకపోవడానికి అమ్మాయిల నైలాన్ కోకలను నిందించేవారని ముష్ఫ్యయోపడేలో వున్నారు సైతం [ముసలాళ్ళమాట వదిలేయండి] భావించడంకూడా సమస్యను ఎదుర్కోలేకమాత్రం చేసేనని తెలుస్తున్నది. ఇదీ ఓ సమస్య. సంప్రదాయాల్లో విధానాల్లో టీ త్రాగి పాఠాల్ని కంఠోపాఠంపట్టే విద్యార్థుల భవిష్యత్తులో ఇది విషమించి తిష్ఠవేసింది. ఈ శీర్షిక నిజంగా శక్తివంతమైన అభిప్రాయవేదిక... నిజంగా కోరి వీరీ ఎన్నుకోదగ్గ సదక కాలం. ఉభయతారకంగా, తీవ్రంగా, చిత్తశుద్ధితో విద్య ఏమిటి? ఎలా ఉండాలి? స్పుట్నిక్ యుగంలో ఆర్థిక పురోగమన వేగంలో పరుగులెత్తే ఇతరప్రపంచంతో పోల్చుకొనిగాక కనీసం మనం మనముందు తరం రానున్న తరం ఈ మూడింటినీ దృష్టిలో వుంచుకొని ఈ విద్యావిధానం దాని ప్రభావం దాని లోపాలు ఆలోచించి రాస్తే ఈ శీర్షిక కొల్లకమేపే బలమైన చర్చా వేదికగా సైతం అవుతుంది. అలా గాకపోతే 'దోబూచాటా' లాగ "పుట్ట" చుట్టూ రాబడి తెల్ల కొట్టినట్లు ఉంటుందని మనవి.

కృష్ణానంద్.



## విసుగూ - విద్యార్థీ!

విసుగు గురించి రాసి విసుగెత్తిం చనుగదా! అయినా విసుగూ విరామం లేకుండా విసుగుచెందగల 'మన' కేం విసుగులెండి! ప్రతివాడికీ ఏదో ఒక విసుగు వుండనేవుంటుంది. ఆఫీసర్ కి ఫైల్లుచూడాలంటే విసుగు, పిల్లలు వాగుతుంటే తలిదండ్రులకు విసుగు, బేరమాడితే శెట్టికి విసుగు, చదవాలంటే విద్యార్థులకు విసుగు, అలాగే రాయాలంటే గుమాస్తాకి, గాయాలంటే డక్టరుకి, విసుగు.

'విసుగు' అనేది విద్యార్థులపాలిటి భూతమయి కూర్చుంది. కొందరు విసుగువల్లనే ప్రగతికి సాగలేరు. నా స్నేహితు డొకడుండేవాడు. వాడికి చదువంటే విసుగు. పబ్లిక్ పరీక్షలకు చదువాలన్నా విసుగే! ఇహ ఎలా పాసవుతాడు? అతనికి ఇంగ్లీషు ఒక్కటే కష్టం. కథలు "సొంతగా రాయరా" అంటే "ఎంత సేపటికీ వాక్యం తరువాత వాక్యం రాకపోతే ఎలారా? విసుగెయ్యదూ?" అనే వాడు. పోనీ "అప్పజెప్ప రాదా?" అంటే ఆఁ! చదివిందే చదవాలి... ఊరికే భట్టీ ఎలారా?" అనేవాడు. అందు (విసుగు) వల్లనే తప్పాడు.

విసుగంటె ఒక్కొక్కప్పుడు బద్ధకం అనికూడా అర్థమవుతుంది. ఒక పని చెయ్యాలంటే విసుగుపుట్టి ఆ పని చెయ్యకమానేస్తే అది బద్ధకం, కానీ ఒకపని చేసి చేసి విసుగుపుట్టి ఆపేస్తే అది బద్ధకంకాదు, అదీ విసుగే.

విసుగు కారణంగా పరీక్షలు తప్పే విద్యార్థులు కొందరు లేక పోలేదు. వాళ్ళకి మేష్టరు చెప్పందే పాఠం అర్థంకాదు. అర్థంకానిపాఠం చదవాలంటే విసుగు. మేష్టరుచెప్పిం తరువాత అర్థమయి, తెలిసిందే కాబట్టి మళ్ళీ చదవటానికి విసుగు. కాబట్టి ఎలా చదవాలన్నా విసుగే! ఇలా చదివితే తప్పటం తథ్యం. పోనీలే అనుకుని మరోసారి పరీక్షకు హాజరవటానికి చదవాలంటే "ఆఁ! అంతా క్రిందటేడు చదివిందేగా!" అనిపిస్తుంది. శాంత మనస్సు నదుపులో పెట్టుకోగలిగిన వాడయితే మొదటి ఛాన్సులోనే పాసవుతాడు, లేదా విసుగుని దూరంచేసుకు రెండో ఛాన్సులోనన్నా పాసవటానికి శ్రమపడతాడు.

విసుగులేని విద్యార్థులు తక్కువేనేమో? అందుకనే కొందరు పెద్దలు ప్రతి సబ్జక్టూ కొంచెం కొంచెం చదివితే విసుగుండదని సలహాయిస్తారు. గానీ ఏసబ్జక్టు చదవాలన్నా విసుగేనాయె! (కొందరికి మాత్రమే).

దర్భా. బాబూరావు (బాపట్ల)

* * *

## బోధనాభాష సమస్య!

మీరు ఆంధ్రసచిత్రవారపత్రికలో "యువ ప్రపంచం" శీర్షిక ప్రారంభించినప్పటినుండి నేను చాలా కుతూహలముగా చదువు చున్నాను. కాని ఆంధ్రవిద్యార్థుల నెదుర్కొనుచున్న ఒక ముఖ్యమగు దురవస్థను గూర్చి ఎవరును వ్రాసియుండలేదు. ఈ లేఖలో అందుగూర్చి వ్రాయుట నా ఉద్దేశ్యము.

ఆంధ్రవిశ్వవిద్యాలయముయొక్క పరిమితి (Andhra University Area)లో ఎస్.ఎస్.ఎల్.సి పరీక్షవరకు అన్ని పాఠములు తెలుగులోనే బోధింపబడుచున్నవి. అది యును అచ్చతెనుగునందు నా ఉద్దేశ్యమేమనగా లెక్కలు, సైన్సు మొదలగు సబ్జక్టులలో సాంకేతిక పదములనుకూడ తెలుగులోనికి అనువదించి పాఠ్యగ్రంథములు రచియింప బడుచున్నవి. కాని పి. యు. సి. యందు



మత్స్యగంధి
వై. జైదేవ్, కాకినాడ

హఠాత్తుగా అన్నియును ఇంగ్లీషులో బోధింపబడును. దీనితో విద్యార్థి కొకవిధమగు (Confusion) వచ్చును. ఎస్. ఎస్. ఎల్. సి. లో ఎంత మంచి మార్కులు వచ్చినను, ఆ పాఠములు తెలుగులో నేర్చుకొనియుండుటచే పి.యు.సి.లో త్వరగ అర్థము చేసికొనుట సామాన్య విద్యార్థికి కష్టము.

కొన్ని దినములు పోయిన తరువాత ఆంగ్ల బోధనకు అలవాటుపడవచ్చునను వాదము కలదు. కాని దీనికి కనీసము రెండుమూడు నెలలు పట్టును. పి. యు. సి లో సాధారణముగా ఆగస్టు నెలలో పాఠములు ప్రారంభమగును. మార్చి 15వ తారీఖున (Preraration) సెలవులు ఇచ్చివేయుదురు. ఇట్టి స్వల్పవ్యవధిలో తెలుగుమీడియంనుండి ఇంగ్లీషు మీడియములోనికి మారిన కోర్సులన్నియు జీర్ణించుకొనగల సమర్థత కొద్దిమందికి మాత్రమే సాధ్యము.

ఇంతేకాదు, పి. యు. సి. కి సమానమగు విషవఫారము తెలుగుమీడియములో చదువవలసి, డిగ్రీకోర్సులలో చేరువారి అగచాట్లను వేరే వ్రాయనక్కరలేదు.

కనుక విద్యార్థుల అవస్థను గమనించి ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు కనీసము నాల్గవఫారమునుండి ఇంగ్లీసుబోధన అలవాటు చేసినచో విద్యార్థులకు పైచదువులు సులభతరమగును. విషవఫారములో కూడ ఇంగ్లీషు మీడియము పెట్టిన ఎట్టి అవసరము నుండదు. ఈ విషయములో సత్వరచర్య ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు తీసుకొనవలెనని ఆశించుచున్నాను. ☆

కె. రమేష్ (కాకినా )

# గ మ ని క

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపే రచనలు

సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక

పేరుమాత్రమే పంపాలి. వ్యక్తుల పేర్లు

వ్రాయ వద్దని మనవి


జ్వరచిహ్నాలు,

జ్వరచిహ్నాలతో వణకుగాను, అస్వస్థతగానువుందా? లేకపోతే ఫ్లూగాని వచ్చిందా? 'ఆస్ప్రో' వేసుకొని జ్వరాన్ని తగ్గించుకోనండి. ప్రపంచంలో లక్షలాది మందికి కుటుంబ ఔషధం. 'ఆస్ప్రో' మీ శరీరంలో బాధిత భాగాల మీద నేరుగా పనిచేసి, సత్వర బాధ నివారణ కలిగిస్తుంది. ఇంటెల్ల పాది కోసం 'ఆస్ప్రో' దగ్గర వుంచుకోనండి.

ఫ్లూలనుంచి పూర్తిగా విముక్తి పొందండి

'ఆస్ప్రో'

ఇంటెల్ల పాదికీ




'ఆస్ప్రో'

తీసుకోనండి

తిరిగి నిజముగా స్వస్థత పొందండి

నికొలాస్ వారి (N) తయారు

నాణ్యతకు మరియు శుద్ధతకు మీకు గ్యారంటీ కలదు



# కొత్తనుడికట్టు-7

## అడ్డం:

1. అల్లరివాడు.
3. నోచుకునేది.
7. అప్పర తిరగబడింది!
9. ఏ పక్షి వంటరిఅయినట్లా?
11. మట్టి— కాని కలగాపులగం.
13. చిరుతొండ — (శివభక్తుడు)
14. చెట్ల గుంపు.
15. నాట్యము చెయ్యము.
17. గొల్లభామ.
19. దీనికి పళ్ళున్నాయి జాగ్రత్త! కొయ్యగలదు.
20. పాముఇల్లు!
21. ఇతని ఊరు అయోధ్య.

## నిలువు:

2. గుర్రంమొహాలు!
4. నూతిమీద తొక్కేది ఇక్కడ తలక్రిందులు.
5. మునుపటికాలంలో ఇది ఎక్కి వెళ్లేవారు.
6. శిశువు.
8. మనముఖ్యమంత్రిగారిజిల్లా, ఇది చాలా పెద్దదా?
10. తూర్పుగోదావరిజిల్లాలో ఒక రేవు.
12. కృష్ణాజిల్లాలోకెల్లా పెద్దఊరు పాతపేరు.
15. ఆ సంతోషము చమురు ఎక్కువ.
16. నేలమీద వేసేది.
17. శేషభాగము.
18. కవాటము.

★

## 6వ-కొత్త నుడికట్టుకు జవాబులు.

★

### అడ్డం

1. అతివ, 3. తేప 7. గడ్డము 9. మునుపు, 11 నాగలి 13. దాది 14. హద్దు, 15 నలుసు 17 ఎలుక 19 ములగ, 20 తప్పు 21 కాముడు

### నిలువు

2. తిరగలి 4 పదము, 5 పసుపు 6. నావ 8. ముదావహాము 10 నుర గలు 12. గజములు, 15. నగరము 16. సున్న 17. ఎక్కము, 18 కవిత.


## నారసింహ లేహ్యాం

బంగారు చేరినది. మేహము, నిక్కాక, నిస్సత్తువను హరించి వీర్యవృద్ధి, బలము, రక్త వృద్ధిని కలిగించును. 20తు.డబ్బీ రు. 3-50

## రోజా పుష్ప లేహ్యము

అజీర్ణం, గర్భవాతం, మలబద్ధకం హరించి చక్కగా విరేచనమును, జీర్ణశక్తిని కలిగించును. 15 తు. డబ్బీ రు. 1-4-0; పోస్టేజి రు. 1-1-0. మా క్యాటలాగు ఉచితం.

పి. సి. ఏ. అండ్ కో.,

ఆయుర్వేద సమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా

## నెలకు రు. 200 సంపాదించండి

డ్రాయింగ్ అండ్ పెయింటింగ్ గైడ్ ఫ్రీ హాండ్ డ్రాయింగ్, స్టెన్సిల్, కలర్ స్కీముతో పెయింటింగ్ వర్కు నేర్చుకోడానికి 352 బొమ్మలతో పూర్తి గైడు ధర రు.6—దీనితో మీరు మంచిడ్రాఫ్ట్సుమన్ డ్రాయింగు మాస్టరు, పెయింటరు డిజైనరు, ఆర్టిస్టు కావచ్చును. ఎంబ్రాయిడరీ డిజైను బుక్కు 250 డిజైనులతో ధర రు. 5.

వివాహ జీవితం: 88 చిత్రపటములతో. ధర రు.5.

ప్రతి పుస్తకమునకు పోస్టేజి రు. 1 అదనం.

VANDANA BOOK DEPOT.,
(AP-5) Rafatganj, Aligarh (U.P.)

అత్యుష్ణము, ధాతునష్టము, అతిమూత్రము, నరములబలహీనత, శరీర కృశత్వము, దడ, అంగవైకల్యము, జీవశక్తి నశించుట వాటిని

## వాజీప్రభ (బంగారు చేరినది)

హరించి ధాతువును గట్టిపరచును. సీసా రు 5. పోస్టుఖర్చు వేరు. కేటలాగు ఉచితం. అన్ని పెద్ద మందుల షాపులలో దొరకును.

చరకాశ్రమం ఫార్మసీ (ఫోన్ 2240)

తాలూకాఫీసు ఎదుట, గాంధీ నగరం,

విజయవాడ - 3.

## క్యాలెండర్లు

నాణ్యమైన ఫోటో ఆఫ్ సెట్ క్యాలండర్లకు మమ్ము సంప్రదించండి. క్యాలండరు బొమ్మలను క్యాలెండరు మాన్యుఫాక్చర్లకు, ప్రింటర్లకు ప్రత్యేక ధరలకు సప్లయి చేయుదుము.

మంచికమీషను సేపని చేయుటకు సమర్థులైన ఏజంట్లు కావలెను. వ్రాయండి

ELITE CALENDAR Co.,
P. B. 1927, MADRAS-1

# పొట్టికథలు

### చిక్కు విడ్డది!

ఏడుగురు స్త్రీలతో ఒకసారి ఒకన్యాయమూర్తికి పెద్దచిక్కు వచ్చిపడింది ఆఏడుగురు ఒకేసారి ఒకరిమీద నొకరి ఫిర్యాదులు చేసుకోసాగారు. జడ్జి చెవులు బద్దలైపోయాయి. బ్రుర వేడెక్కి—

ఎవరోఒకరు ముందుచెప్పండి అన్నాడు. ఆ ఆడపడుచు లెవరూ వినిపించుకో లేదు.

జడ్జికి ఒకవుపాయం తట్టింది.

"అమ్మా! మీలో వయస్సులో ఎవరుముందో వారి వాదన మొదట వింటాను" అన్నాడు అంతే. కేసుఉపసంహరించుకొని వెళ్ళిపోయారు అంగనలు.

శ్యామల (పాట్నా)

### యవ్వనం

ఒకసారి ప్రఖ్యాత రచయిత విక్టర్ హ్యూగో బాగా ముసలి వాడయ్యాక ఒకమిత్రుడి 50 వ పుట్టినరోజుకి వెళ్ళాడు.

"ఆ మిత్రుడు వయస్సు ముదిరిందని విచారంగా వున్నాడు." నలభైఏళ్ళయితే బాగా నేవుంది కాని 50 ఏళ్ళనగానే బొత్తిగా అండలేని వయస్సు సుమా?" అన్నాడు.

హ్యూగో ముగ్గుబుట్ట లాంటి గడ్డం తడుముకొంటూ "40 అంటే యవ్వనానికి వృద్ధాప్యం. 50 అంటే వృద్ధాప్యానికి యవ్వనం గనుక యిదేమంచిది" అన్నాడు.

కె. సత్యనారాయణమూర్తి (మదరాస్)

* * *

### అనుభవం

"పొగమంచు దట్టంగా పట్టివుంది. ఒకవ్యక్తి అందులో యిరుక్కొన్నాడు." అయ్యా! కాస్త చెపుతారా? ఎవరేనా యిటుకేసి వెళ్ళావుంటే... నేను ఎటు వెళ్తున్నాను?"

"మీరూ తూములోకి వెళ్తున్నారు...ఎందుకంటే నేనిప్పుడే అందులోనించి వస్తున్నాను గనుక" అన్నది మరొకగొంతు.

ఆర్. శాస్త్రి, (అల్లిపురం) ★


## త్వరలో కొత్తకథ

## ప్రారంభం!

హాలివుడ్ అందాలతారగా వెండితెరమీద ప్రకాశించి మొనాకో సింహాసన మధిష్ఠించిన "గ్రేస్‌కెల్లీ" కథ ఆంధ్రసచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించ నున్నాము. తేదీకై ఎదురుచూడండి।



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



నిరంతరవలయం

ఫొటో: డి. వి. కె. మూర్తి (ఖర్గపూ

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.


అలంకార్ చిత్ర వారి

# బాత్ ఏక్ రాత్ కీ

[హిందీ]

# Baat Ek Raat Ke



డైరెక్షన్:

శంకర్ ముఖర్జి

మ్యూజిక్:

S.D. బర్మన్



వాణీ రిలీజ్

REVATHI

STUDIO Kethra